## కథలవరస

1. కొనే మనిషి ........................................................ 2
2. జమాఖర్చుల పట్టిక .................................................. 11
3. దేవీ పూజ ............................................................ 23
4. నిజానికీ ఫెమినిజానికీ మధ్య ...................................... 35
5. ఆనందో బ్రహ్మ! ...................................................... 51
6. చివురుకొమ్మ చేవ .................................................. 67
7. పెంపకం ................................................................ 79
8. అమ్మ తపన ............................................................ 88
9. జేబు ..................................................................... 97
10. "నేను" .............................................................. 109
11. రంగు తోలు ........................................................ 116
12. కులదీపకుడు ....................................................... 124
13. మీరెవరితాలూకు! .................................................. 133
14. కొత్తసీసా, పాతసారా .............................................. 143
15. తల్లీ, నిన్ను దలంచి ... ............................................ 152

# 1. కొనే మనిషి

చిన్నప్ప అక్క కామాక్షికి పెద్ద ఉత్తరం రాసేడు. అక్కనీ, మేనల్లుడు వెంకట్రాంని అమెరికా రమ్మని. ఒట్టి కబుర్లు కాదు. వాళ్లకి టిక్కెట్లు కూడా కొని పంపించేడు. కామాక్షి ఉప్పొంగిపోయింది. తనచేతులమీదుగా పెంచి పెద్ద చేసిన చిన్ని తమ్ముడు ప్రయోజకుడై అమెరికాలో పెద్ద ఉద్యోగం సంపాదించడమే కాక పాతకాలపు అభిమానాలు అలాగే నిలబెట్టుకున్నాడు!

"అమెరికా వెళ్తున్నావటే, ..."

"నిజంగా అమెరికాయే, ... అబ్బో,"

"నువ్వా? అమెరికావా? ... ఎందుకూ ..."

ప్రశ్నలవర్షం. కామాక్షికి ఊపిరాడ్డంలేదు. ఇహ కొడుకు సంగతి సరేసరి. చుట్టాలూ, పక్కాలూ, స్నేహితులూ తెమ్మన్న వస్తువుల జాబితా హనుమంతుడితోకలా పెరిగి పోతూంది.

000

చిన్నప్ప వాళ్లని తీసుకురావడానికి ఎయిర్‌పోర్టుకి వెళ్లేడు.

"న్యూయార్క్‌లో మారాల్సి వచ్చింది. నువ్వక్కడికి వస్తావనుకున్నాను," అంది కామాక్షి ఒకింత కించ పడుతూ.

"వద్దాం అనే అనుకున్నాను. ఆఫీసులో పనివల్ల పడలేదు. దేవికి కూడా పని. తీరలేదు. ఆఫీసులో ఊపిరాడ్డంలేదు. లేకపోతే రెండువేలు పెట్టి టిక్కెట్లు కొన్నవాణ్ణి మరో రెండువందలకి వెనుదీస్తానా?" చిన్నప్ప సన్నగా నవ్వేడు, అదేమంత పెద్దవిషయం కాదనిపించేలా.

“అంతేలే” అంది కామాక్షి.

“అయినా వెంకట్రాం ఆమాత్రం చూసుకోలేడా అని కూడా లే ...”

“ఎందుకు చూడలేనూ? నేనే కదా అక్కడ అన్నీ కనుక్కుని చేసింది,” అన్నాడు వెంకట్రాం చిరుకోపంతో. అతనికి తల్లిమాటలు మహా అవమానంగా తోచేయి.

చిన్నప్ప వెళ్లి కారు తీసుకొచ్చేడు. సూట్‌కేసులు వెనక ట్రంకులో పడేసి, కామాక్షీ, వెంకట్రాం కారెక్కేక, మళ్ళీ మాటలు మొదలు పెట్టేడు. “అయితే కాలేజీలో చేరుతున్నావన్నమాట. ఏమిటి నీ మేజరు?”

ఈ అమెరికనింగ్లీషు వెంకట్రాంకి ఇంకా కొత్త. రెండు నిముషాలాలోచించి, “ఇంకా ఏం అనుకోలేదు,” అన్నాడు తటస్థంగా.

చిన్నప్ప “ప్చ్” అని చప్పరించి, “చూశావా? ఇదే మనవాళ్లతో వచ్చిన చిక్కు. అందుకే మనం ఇంత వెనకబడి ఉన్నాం. జనం చిన్నప్పట్నుంచీ సొంత ఆలోచనలూ, అభిప్రాయాలూ ఏర్పరుచుకోవడం నేర్చుకోవాలి. ఇక్కడ చూడు. ఉగ్గుపాలతోనే నేర్పుతారు అలాటివి. అంతెందుకూ? కాలేజీకి జీతం కట్టాలి. డబ్బివ్వమని తల్లిదండ్రులని అడిగే కుర్రాడు ఇక్కడ మచ్చుకయినా కనిపించడు, తెలుసా?”

వెంకట్రాం జీతం కట్టడానికి తల్లిని డబ్బు అడగక్కర్లేకపోతే ఎలా ఉంటుందో ఊహించుకుంటున్నాడు.

“ఏ మాటకామాటే చెప్పాలిలే. పిల్లలికి చిన్నప్పట్నుంచే అలవాటయిన ఈ స్వాతంత్ర్యంమూలంగా అభిమానాలు దూరం అయిపోతాయి కూడాను. మనలాగా ప్రేమలూ, అభిమానాలూ అంటూ తాపత్రయపడరు. నిజానికి ఇక్కడ చాలామంది ఆశ్చర్యపోయేరు తెలుసా నేను మీకు టికెట్లు కొన్నానంటే.” చిన్నప్ప తేలిగ్గా నవ్వేడు.

కామాక్షి తమ్ముడు ఇంకా ప్రేమాభిమానాలగురించి మాటాడుతున్నందుకు ఆనందించింది.

000

దేవి ఇంట్లో లేదు వాళ్లు ఇంటికి వచ్చేసరికి. ఓ చిన్న నోటు పెట్టింది ఉప్మా ఫ్రిజ్‌లో ఉందనీ, కాఫీ ఫ్లాస్కులో ఉందనీ.

‘‘శనివారం కూడా పనేనా’’ అంది కామాక్షి.

‘‘మరేంటనుకున్నావు. ఇండియాలో అందరూ మేం ఇక్కడ ఏదో కుప్పలు తిప్పలు సంపాదించేస్తున్నాం అనుకుంటారు. కానీ దానికోసం ఎంత చాకిరీ చేస్తామో తెలీదు. అసలు మనదేశంలో చూడు తీరిగ్గా తొమ్మిదిగంటలకొస్తారు కాళ్లీడ్చుకుంటూ. పదిన్నరకి కాఫీకి పోతారు. మూడొంతులకాలం టీబ్రేకులూ, లంచిబ్రేకులే అక్కడ. మిగతా టైంలో కాళ్లు చాపుకు నిద్రపోతారు. దేశం బాగుపడమంటే ఎలా బాగుపడుతుంది? తల్చుకుంటే నాకు కడుప్మండిపోతుందనుకో. మనకి కావలిసినంత తెలివితేటలున్నాయి. ఇక్కడ చేసేదాన్లో సగం అక్కడ చెయ్యమను. వీళ్లకంటే రెండింతలు బాగుంటాం. మనవాళ్లందరూ నేను ఇండియా వచ్చేయలేదని దెప్పుతారు. వచ్చి ఏం చేస్తాను? నావిద్య వినియోగించుకోగల ఆఫీసే లేదక్కడ …’’

కామాక్షికి అయోమయంగా వుంది. ‘‘మనదేశంలో పనికొచ్చే చదువే నువ్వెందుకు చదవలేదూ?’’

‘‘ప్రతివాడూ అడిగే మరో చచ్చు ప్రశ్న ఇదీ. నిన్ననడం లేదులే. ఎంతసేపూ చదివిందే చదివి, చేసిందే చేసి, దొరికిన గంజినీళ్లతోనే సరిపెట్టుకు పోతూ ఉంటే, మనకి అభివృద్ధి ఎలా సాధ్యం? నామాటే తీసుకో. ఓ పదేళ్లపాటు ఇక్కడ పని చేసి, ఓ కోటి రూపాయలు సంపాదించి తెస్తాననుకో. అప్పుడు అక్కడ ఓ కంపెనీ మొదలుపెట్టి, మరో నలుగురిని నాలాగే తయారు చేస్తే, అదీ పురోభివృద్ధి. అవునా, కాదా’’

OOO

చిన్నప్ప వాళ్ల లగేజీ తీసుకెళ్లి మేడమీద గెస్టురూంలో పెట్టేడు.

కామాక్షీ, వెంకట్రాం కార్పెట్ మాసిపోతుందేమోనన్నట్లు నెమ్మదిగా అడుగులేస్తూ అతనివెనకే మెట్లెక్కేరు. చిన్నప్ప వాళ్లకి బాత్రూం చూపించి, కిందకి వచ్చేడు బల్లమీద ప్లేట్లూ అవీ అమర్చడానికి.

కామాక్షీ, వెంకట్రాం త్వరగానే బట్టలు మార్చుకుని కిందకి వచ్చేరు. చిన్నప్ప వాళ్లని చూస్తూనే, మహోత్సాహంతో తనభార్య చేసిన అరేంజిమెంట్లు చెప్పాడు, "చూడు. మీమరదలు మనవంటలూ, ఆచారాలూ, బట్టలూ అంటే మహ ఇష్టపడుతుంది. మడి కట్టుకుని వంట చేస్తుంది తెలుసా. అదేలే. లేవగానే శుభ్రంగా స్నానం చేసి, బట్టలు మార్చుకుని కానీ వంటింట్లో అడుగెట్టదు. అటు చూడు. వెంకటేశ్వరుడి పటం. అదేదో ఆ పద్యాలు కూడా చదువుతుంది. ... ఏమిటదీ .. తవసుప్రభాతం అని వస్తుందీ ... అదీ ...ఈ ఉప్మా తనే చేసింది. రోజూ వంట చెయ్యడానికి టైముండదు. అంచేత వారానికోమారు చేసేసి, ఫ్రిజ్‌లో పెట్టేస్తుంది. అదీ ఇక్కడవాళ్ల తెలివితేటలు. టైం లాభసాటిగా వాడుకోడం వీళ్లతరవాతే ఎవరైనా ..."

"అంతేలే" అంది కామాక్షి చప్పగా చల్లారిపోయిన వంటకాలు తిరిగి వెచ్చబెట్టుకోడంలో గల రుచిని తొలిసారిగా అనుభవిస్తూ.

చిన్నప్ప కొంచెం బ్లాక్ కాఫీ తనకప్పులో పోసుకున్నాడు. వాళ్లిద్దరికీ పంచదారా, పాలూ పోశాడు. వెంకట్రాం ఎలాగో సగం తాగేడు కానీ కామాక్షి ఓ చుక్క రుచి చూసి పక్కన పెట్టేసింది.

చిన్నప్ప నవ్వేడు. "బాగులేకపోతే తాగఖ్కర్లేదులే. ఇండియాలో ఫిల్టరుకాఫీలా ఉండదిక్కడ. నాక్కూడా కొన్నాళ్లు పట్టింది అలవాటు పడడానికి. మొదట్లో నాక్కూడా ప్రాణాంతకంగా ఉండేది. ఎవరేనా మంచి కాఫీ ఇస్తానంటే వాళ్లకాళ్లమీద పడడానికి కూడా సిద్ధం అనుకో. కానీ ఒకమాట ఒప్పుకుతీరాలి. ఆరోగ్యందృష్ట్యా ఇదే మంచిది. పైత్యం చెయ్యడం, కళ్లు తిరగడంలాటివి ఉండవు. పైగా, కడుక్కోడానికి అన్ని గిన్నెలూ ఉండవు. చెప్పేను కదా పని సుళువులు వీళ్ల తరవాతే. .. అదీ నాకు నచ్చేవిషయం. సరే, మీరిద్దరూ వెళ్లి పడుకోండి,"

కామాక్షి తనప్లేటూ, కప్పూ పట్టుకు లేచింది. చిన్నప్ప గబుక్కున ఆవిడచేతిలోంచి అందుకున్నాడవి, "నువ్వేం చెయ్యక్కర్లేదులే ఇక్కడ. నేను చూస్తాను, ..." చిర్నవ్వుతో అన్నాడు, "ఇక్కడ గిన్నెలు కడగడం అంటే, ఇండియాలోలాగ చీరె

కుచ్చిళ్లు ఎగ్గట్టి, చింతపండూ, ఇసుకా వేసి తోమడంలా కాదు కదా. … కాస్త తొలిచి డిష్ వాషర్‌లో పడేస్తే అవే క్లీనయిపోతాయి. మనవంటలకి కొంచెం కష్టం అనుకో. గిన్నెలూ మనుషులూ కూడా మసయిపోతే తప్ప పూర్తవదు మనవంట. అంతే కాదు. కూరలూ, అందులో విటమినులూ కూడా మసైపోవాలి. … పోనీ కానీ, మీరు కొంచెంసేపు పడుకోండి. నేను శామీనీ అలా తిప్పి తీసుకొస్తాను. రాత్రి ఒక ఫ్రెండు భోజనానికి పిలిచాడు. పాట్లక్. అంటే అందరూ తలో డిష్ తీసుకొస్తారు. .. దేవి వడలు చేస్తుంది. ..అలా చేస్తే ఆ ఇల్లాలొక్కర్తే హూనం అయిపోనక్కర్లేదు కదా.''

కామాక్షీ, వెంకట్రాం సోఫాలో పడి నిద్రపోయేరు చిన్నప్ప మాటాడుతుండగానే. చిన్నప్ప వాళ్లని లేపి పైకి పంపడమా ఊరుకోడమా అని ఓనిముషం ఆలోచించి, వాళ్లమొహాలు చూసి ''పడుకోనియ్‌లే'' అనుకుని ఊరుకున్నాడు.

శామీతో ఇవాళ బయటికి వెళ్లడానికి వీలుండదని చెప్పేడు. ఇంటిముందే ఆడుకోమనీ, జాగ్రత్తగా ఉండమనీ, అటూ ఇటూ పరుగెట్టకూడదనీ, బట్టలు మాపుకోకూడదనీ, ఒకగంటలో ఇంట్లోకి వచ్చేయాలనీ …

000

కామాక్షీ, వెంకూ నిద్ర లేచేసరికి అయిదయింది. మొహం కడుక్కుని, బట్టలు మార్చుకున్నారు. అప్పటికి దేవి కూడా వచ్చింది. ఆవిడ ఆకుపచ్చ చీరె కట్టుకుని, మాచింగ్ బ్లౌజు వేసుకుని, నుదుట తిలకంతో, బంగారు దుద్దులతో, చేతికి గాజులతో చూడ చక్కగా ముస్తాబయింది - అమెరికన్ డైమండ్‌లా మెరిసిపోతూ.

''అదుగో మీమరదలు'' అంటూ చిన్నప్ప ఉప్పొంగిపోతూ పరిచయం చేశాడు ''అచ్చు పోతపోసిన తెలుగు పడుచులా లేదూ?''

దేవీ అనబడుతున్న డెబ్బీవేపు చూసి చిన్నగా నవ్వింది కామాక్షి. వెంకట్రాం ఆవిడవేపు పట్టలేని కౌతుకంతో చూడసాగాడు.

''నమస్తే'' అంది దేవి.

కామాక్షి తలూపింది మందహాసంతో.

చిన్నప్ప మహా గర్వపడిపోయేడు.

శామీ తండ్రిమాట ప్రకారం ఒకే ఒకగంటలో లోపలికి వచ్చేశాడు. వాడు పరుగెట్టలేదు. బట్టలు మాపుకోలేదు. తల చెరుపుకోలేదు.

బేబీసిటర్ వచ్చింతరవాత పిల్లాడిని అప్పగించి, పార్టీకి బయల్దేరారు. కామాక్షీ, వెంకట్రాం వెనకసీటులో కూర్చున్నారు. చిన్నప్ప కారుతలుపు తెరిచాడు దేవికి. దేవీ డ్రైవు చేసింది.

పార్టీలో జనం అంతా గొడవ గొడవగా అనిపించింది కామాక్షికీ, వెంకట్రాంకీ. ఆ తిండి వాళ్లకెక్కలేదు. వెంకట్రాం ఓ ముక్క కొరికేడు కానీ కామాక్షికి అస్సలు కొరుకుడు పడలేదు, ఆఖరికి దేవి చేసిన వడలు కూడా. మహా సంబరపడిపోతూ ఆవంటకాలు తింటున్న చిన్నప్పని ఆశ్చర్యంగా చూడసాగింది కామాక్షి. పూర్వం పళ్లెం విసిరి కొట్టేవాడు ఏమాత్రం తేడా వచ్చినా. ఆ చిన్నప్పేనా ఇతగాడు?

జనం క్రమంగా చిన్న చిన్న గుంపులుగా విడిపోయేరు. కొందరు పానీయాలు పుచ్చుకు నిలబడ్డారు. కొందరు కబుర్లలో పడ్డారు. మరికొందరు రెండూ చేస్తున్నారు. ఒకళ్లిద్దరు కామాక్షికీ, వెంకట్రాంకీ డ్రింకులు ఆఫర్ చేసేరు. వాళ్లిద్దరూ తమకి అలవాటు లేదని తెలియజేశారు. అసలు తాగనివారిని కొందరిని చూసి ఆశ్చర్యపడింది కామాక్షి.

"బీరు తీసుకోవోయ్. ఫరవాలేదు. అది ఒట్టి బార్లీ నీళ్లే. ఆరోగ్యం కూడాను," అన్నాడు చిన్నప్ప వెంకట్రాంతో మేలమాడుతూ.

"చాల్లే, నువ్వు చెడింది కాక వాణ్ణి కూడానా .." అంది కామాక్షి చిరాగ్గా.

"నువ్వక్కడే పొరబడుతున్నావు. చుట్టూ చూడు. వీళ్లంతా చెడిపోయినవాళ్లేనా? అన్ని పానీయాల్లాగే ఇదీ ఒక పానీయం. నిజానికి ఇది ఒట్టి నీళ్లే మన ఇండియాలో బీరుతో పోలిస్తే. అఫ్ కోర్స్. ఇక్కడ తాగుబోతులు లేరనను. అది వేరే కథ. అది పోనియ్. ఇక్కడ యువతరాన్ని చూడు. వీళ్లలో చాలామంది మన వెంకట్రాం ఈడువాళ్లే. ఒకొక్కళ్లూ వాడిలాటి వాళ్లని నలుగుర్ని పట్టుకు తన్నగలరు. ఏదో ఓ పని చేసుకుని, సంపాదించుకుంటూ చదువుకుంటున్నారు. వాళ్లకేం ఇష్టమో, ఏం

చదువుతారో, ఏం ఉద్యోగాలు చేస్తారో, అన్నీ వాళ్లకి వాళ్లే నిర్ణయించుకుంటారు. మనదేశంలోలా కాదు. అక్కడ తల్లి డాక్టరంటే డాక్టరూ, తండ్రి లాయరంటే లాయరూ, తాత మరేదో అంటే అదీ" చిన్నప్ప విసుగేసినట్టు ఆపేశాడు. గదిలో ఎవరో ఓమూలనించి అతనికి చెయ్యూపేరు. "excuse me" అంటూ అతనటు వెళ్లేడు.

ఇంటికి తిరిగి వస్తూ, చిన్నప్ప ఇందాకా సగంలో వదిలేసిన ఉపన్యాసం మళ్లీ ఎత్తుకున్నాడు, "ఆ గళ్లచొక్కా కుర్రాణ్ణి చూశావా? అతనిపేరు టిమ్. కొన్నాళ్లు గ్రీక్ చదివేడు. తరవాత బాటనీ చదివేడు. ఇప్పుడు చరిత్ర మొదలుపెట్టేడు. ఏదో ఫొటోషాపులో పని చేస్తున్నాడు. పేపర్లు అమ్ముతాడు. ఒకమాట చెప్తాను విను. కావాలంటే మన వెంకట్రాముడు కూడా ఇక్కడే ఉండి చదువుకోవచ్చు. ఏడాది తిరిగేసరికి తనచదువుకే కాక, నీకు కూడా పదో పరకో పంపగలుగుతాడు ..."

కామాక్షి తృళ్లిపడింది.

వెంకట్రాముడు ఉలిక్కిపడ్డాడు.

చిన్నప్ప అదేమీ గమనించనట్టు చెప్పుకు పోసాగేడు, "అంటే వెంకట్రామనే కాదు. ఊరికే, ఉదాహరణకి చెప్పేనంతే. వాణ్ణి పంపిస్తే, నీకు ఇబ్బంది కాదూ ..అలాగని నువ్విక్కడ ఉండిపోనూ లేవు. ఈ పద్ధతులకి నువ్వు తట్టుకోలేవు. ఇంత పెద్ద మార్పు.. ఈ వంటలూ, ఈ తిళ్లూ, ఈ చలీ నీకీజన్మలో అలవాటవవు. ఓహ్ .. సారీ .. ఆ, ఏమిటీ మాటాడుతున్నది. అదే, స్వశక్తిమీద ఆధారపడి బతకడం. అది నాకు నిజంగా నచ్చింది ఇక్కడ. మనదేశంలో ఒక్కడి సంపాదనమీద పదిమంది పడి తింటారు. ఇక్కడ అది చెల్లదు. అంటే నేను మన సాంప్రదాయాలని తీసి పారేస్తున్నానని అనుకోకు. నన్ను ముక్కలు ముక్కలుగా నరికినా ఇదంతా నువ్వు పెట్టిన భిక్షేనన్న సంగతి మరిచిపోను. అది మనసులో పెట్టుకునే చెప్తున్నాను. నువ్వూ వెంకట్రాం కావాలంటేనే, ఇక్కడ పెట్టుకుని చదివిస్తాను. కష్టం, సుఖం అని చూడను. దేవి కూడా మనవరసే. ఇటువంటి విషయాల్లో మాఇద్దరికీ ఒక్కలాటి ఆలోచనలే. సరేలే. అదలా ఉంచు. ఇక్కడ వారి individuality గురించి. మా డైరెక్టరు ఉన్నాడు

చూడు. స్వయంగా తనచేతులతో తనే గరాజి కట్టుకున్నాడు. అదేదో పనివాళ్లని పెట్టి కట్టించుకోలేక కాదు. తనచేతులతో తను కట్టుకోడంలో ఉన్న ఆనందంకోసం, తృప్తికోసం ... అలాగే మరో డాక్టరు, కోటీశ్వరుడు తనఇంటికి కావలసిన ఫర్నిచరంతా తనే చేసుకున్నాడు. ...''

చిన్నప్ప ఒక నిముషం ఆగేడు ఏదో ఆలోచిస్తున్నట్టు. ''నిజానికి దేవీయే అంది ఒకటి రెండుసార్లు మన వెంకట్రాంని ఇక్కడ ఉంచుకుని చదివిద్దాం అని. చాకులాటి కుర్రాడని నేనే చెప్పాలే ... కానీ బహుశా నీకు నచ్చదేమో. నాకు తెలుసులే అందులో కష్టం. పైగా నేను చెడింది చాలదూ, ...'' అన్నాడు ఎత్తిపొడుస్తున్నట్టు.

''చాల్లే'' అంది కామాక్షి. ఆవిడ నొచ్చుకుందో, మెచ్చుకుంటోందో అర్థం కాలేదతనికి.

సమాధానంగా అన్నాడు, ''ఒక్కమాట మాత్రం ఖచ్చితంగా చెప్పగలను. ఇక్కడి సౌఖ్యాలు ఇక్కడివీ. అక్కడి సౌఖ్యాలు అక్కడివీ. అక్కడ రెండు రూపాయలు పారేస్తే చాకలాడు బట్టలు శుభ్రంగా ఉతికి, ఆరేసి, ఇస్త్రీ చేసి తీసుకొస్తాడు. ఇక్కడయితే మనమే తీసుకెళ్లి లాండ్రొమాట్‌లో ఇవ్వడానికి కూడా అయిదు డాలర్లు తగలేయాలి. అంచేత, ఎవరికి వారు ఆలోచించుకోవాలి తమకి ఏది ముఖ్యమో. నామటుకు నేను ఎన్నోసార్లు అనుకున్నాను ఇండియా వచ్చేద్దాం అని. వస్తానేమో కూడా కొంతకాలం అయినతరవాత, తగినంత డబ్బూ, అనుభవమూ సంపాదించేక. అప్పుడు నేను నాకు తగిన ఓ కంపెనీ ఓపెన్ చెయ్యొచ్చు. నాలాంటివాళ్లని మరో పదిమందిని ట్రైన్ చెయ్యొచ్చు. అదీ నాప్లాన్ .. జరుగుతుందనే నా ఆశ ..''

రాను రాను ఇంగ్లీషుమాటలు వచ్చేస్తున్నాయి ఎంత జాగ్రత్తగా మాటాడినా.

ఇంతలో ఇల్లొచ్చింది. చిన్నప్ప మాటలాపి, కారాపాడు.

000

ఆరాత్రి కామాక్షీ వెంకట్రాముడూ గెస్ట్ రూంలో తీవ్రంగా హోరాహోరీ వాదించుకుంటుండగా,

అదే సమయంలో మాస్టర్ బెడ్‌రూంలో చిన్నప్పకీ దేవికీ మధ్య సంభాషణ ఈవిధంగా సాగింది:

"ఏఁవైంది?"

"కొనేసినట్టే"

"ఆవిడ కూడానా?"

"ఎందుకూ? మనం అనుకున్నది వాడొక్కడిగురించే కదా."

"అవును. నెలకి వంద డాలర్లు కలిసొస్తాయి ఖర్చులు పోనూ."

000

(ఆంధ్రప్రభలో 1976లో తొలి ప్రచురణ. తరవాత ఇంగ్లీషు అనువాదం Encounters: Selected Indian and Australian short Stories (compiled by A. Janakiram and Bruce Bennet) లో ప్రచురించడం జరిగింది.)

(*మరొక గమనిక. ఈకథ వంగూరి ఫౌండేషన్ వారి "20వ శతాబ్దం అమెరికా తెలుగుకథలు"లో ప్రచురించబడింది. రచయిత్రి పేరు నిడదవోలు మాధవి అని ప్రచురించేరు. నిజానికి ఇది నేను రాసిన కథ. నిడదవోలు మాధవి అన్నపేరుతో రచయిత్రి ఉన్నారేమో నాకు తెలీదు. ఈకథ మాత్రం నేనే రాసేను* )

# 2. జమాఖర్చుల పట్టిక

ఆవేళ ఆదివారం.

చిన్నప్ప తన బాస్ టిమ్‌నీ అతని భార్య హాలీని భోజనానికి పిలిచేడు. ఇల్లాలు డెబ్బీ పొద్దుట్నించీ తెగ హడావుడి పడిపోతూంది. మామూలుగా శనాదివారాల్లో ఉండే బజారు పన్లూ, బట్టలుతకడాలూ, దుమ్ము దులుపుకోడాలూ చేస్తూన్నా ఇంకా చెయ్యాల్సిందేదో మిగిలిపోతూనే ఉంది.

చిన్నప్ప అక్క కామాక్షికి ఊపిరాడ్డంలేదు. రెండు కూరలూ, పచ్చళ్ళూ, పులుసూ, చారూ, పులిహోరా, చక్రపొంగలీ … ఎన్ని చేసినా ఏదో తక్కువగానే ఉంది ఆవిడకి.

"వాళ్ళకి మనభోజనమే కొత్త. మన ఉప్పులూ, కారాలూ వాళ్ళు తినలేరు. నువ్వారికే ఇదైపోకు," అంటూనే ఉన్నాడు చిన్నప్ప.

"ఇదుగో, అయిపోయింది, ఇంకేం చెయ్యనులే," అంటూనే ఉంది కామాక్షి పోపులడబ్బాకోసం వెతుకుతూ.

"కనీసం కారం బాగా తగ్గించు. దేవీకి కూడా అట్టే అలవాటు లేదు. లేకపోతే తెనాలి రామలింగడిపిల్లి కథ కాగలదు," అన్నాడు చిన్నప్ప.

"అలాగే కారం వెయ్యనులే," అంది కామాక్షి. అందే కానీ మిరపకాయలడబ్బా మీద చెయ్యేశాక మాత్రం ఆవిడధోరణిలో ఆవిడ చేసుకుంటూ పోయింది. ఆ మిరపకాయలు చూస్తూంటే డెబ్బీకి కళ్ళు మిరిమిట్లు గొలిపేయి. చిన్నప్ప వస్తున్న నవ్వాపుకుంటూ బయటికి వెళ్ళిపోయేడు.

టిమ్, హాలీ అన్న ప్రకారం ఆరుగంటలకి వచ్చేరు. వస్తూ ఓ పూలగుత్తి తీసుకొచ్చేరు.

‘‘అబ్బ ఎంత బావున్నాయో,’’ అంది దేవి ఆ పూలగుత్తి విలాసంగా అందుకుని, వాసన చూస్తూ, థాంక్యూ కూడా చెప్పింది.

‘‘మమ్మల్ని పిలిచినందుకు మీకు థాంక్స్,’’ అంది హాలీ.

చిన్నప్ప వాళ్ళ కోట్లు అందుకుని క్లాజెట్లో పెట్టేడు.

‘‘రండి లోపలికి,’’ అంది దేవి పక్కకి తప్పుకుని వాళ్ళకి దారిస్తూ.

ఆతరవాత లాంఛనప్రాయంగా పరిచయాలు అయేయి, ‘‘ఈవిడ మా ఆడబడుచు. ఆవిడ కొడుకు వెంకు.’’

టిమ్, హాలీ నవ్వు మొహాల్తో ‘‘ఎలా ఉన్నారు?’’ అంటూ పలకరించేరు.

కామాక్షి చిన్నగా నవ్వి ఊరుకుంది. వెంకు హలో అన్నాడు. వాళ్ళిద్దరికీ బెరుగ్గానే ఉంది ఏం మాటాడాలో, ఎలా కూర్చోవాలో, ఎలా నించోవాలో అన్న ఆలోచనలతో.

‘‘తాగడానికేం కావాలి?’’ అని అడిగేడు ఆనవాయితీననుసరిస్తూ.

‘‘ఏదైనా సరే,’’ అన్నాడు టిమ్.

‘‘స్కాచ్? రెడ్ వైన్, షెరీ కూడా ఉన్నాయి,’’

‘‘స్కాచ్ తీసుకుంటాను.’’

‘‘ఐస్‌తో?’’

‘‘యస్ ప్లీజ్.’’

‘‘ఐయాం ఫైన్,’’ అంది హాలీ.

డెబ్బీ షెరీ తీసుకుంటానంది.

వెంకుని అడిగేడు చిన్నప్ప, ‘‘నీకో?’’

‘‘నాకేం వొద్దు,’’ అన్నాడు వెంకు సోఫాలో ఇబ్బందిగా ఓ మూలకి ఒదిగిపోతూ.

కామాక్షిని ఆరెంజి జూస్ తీసుకోమన్నాడు కానీ ఆవిడ తనకేమీ ఒద్దంది.

చిన్నప్ప లోపలికెళ్ళి ఓ ట్రేలో రెండు స్కాచిలూ, ఓ షెరీ, కాయితం రుమాళ్ళూ, చిన్నప్లేటులో వేయించిన వేరుశనగ్గింజలూ తీసుకొచ్చేడు.

''మీ అక్క చాలా అందంగా ఉంది,'' అంది హాలీ చిన్నప్పతో.

చిన్నప్ప చిన్నగా నవ్వి, థాంక్స్ చెప్పి కామాక్షికి హాలీ అన్న మాట తర్జుమా చేశాడు.

ఆవిడ సిగ్గుపడిపోయి సరేలే అంది.

''మీరలా మెచ్చుకుంటుంటే మాఅక్కకి సిగ్గుగా ఉంది,'' అన్నాడు చిన్నప్ప హాలీతో.

''ఎందుకు?''

''మాదేశంలో సాధారణంగా మేం అలా మొహాన వారి అందంగురించి మాటాడం.'' అని వివరించేడు అతను.

''నేను ఊరికే అనడంలేదు. నిజంగానే ఆవిడ చాలా అందంగా ఉన్నారు.''

''ఫరవాలేదులెండి. అయినా పొగడ్తలకి పొంగిపోనివారెవరు కనక?''

''నువ్వు కూడా మీ మామయ్యలాగే బిజినెస్ స్కూలికెళ్తావా?'' అని అడిగేడు టిమ్ వెంకుతో మాట కలుపుతూ.

''తెలీదండీ. నేనింకా ఏం ఆలోచించుకోలేదు,'' అన్నాడు వెంకు తూచి మాటాడుతూ.

కామాక్షికి సౌండ్ బాక్స్ చెడిపోయిన సినిమా చూస్తున్నట్టుంది. ఆవిడకొచ్చిన నాలుగు ఇంగ్లీషుముక్కలూ ఈ ఇద్దరి భాషా అర్థం చేసుకోడానికి పనికిరాలేదు.

భోజనాలబల్ల అమర్చడానికి దేవి లేవడం చూసి, కామాక్షి కూడా లేచి ఆవిడ వెనకే లోపలికెళ్ళింది.

''నేనేదైనా సాయం చెయ్యనా?'' అని హాలీ అడిగింది మర్యాదకి.

అవుసరంలేదంది దేవి. పదినిముషాల్లో అంతా అమర్చడం అయిపోయింది. అందర్నీ భోజనాలకి లెమ్మంది వాళ్ళందర్నీ.

తింటున్నంతసేపూ టిమ్ పిట్టకథలు చెప్తూనే ఉన్నాడు. చిన్నప్ప విరగబడి నవ్వుతూనే ఉన్నాడు. వెంకుకి ఇంగ్లీషు బాగానే వచ్చు కానీ ఈ జోకులు మాత్రం కొరుకుడు పడలేదు.

హాలీ కామాక్షివేపు తిరిగి "మీచీరె బాగుంది," అంది.

ఆవిడ ఉల్లిపాయరంగు గోరంచు జరీ ఉన్న పోచంపాడు చీరె కట్టుకుంది. హాలీమాటకి చిన్నగనవ్వు నవ్వి సరేనన్నట్టు తలూపింది.

"బోలెడు చీరెలు తెచ్చేరు కాబోలు."

ఈసారి దేవిని అడగాల్సివచ్చింది ఆవిడ ఏమిటంటోంది అని. దేవి తెలుగు కామాక్షి ఇంగ్లీషుకంటే మెరుగు కాకపోయినా ఆ రెండు వాక్యాలసంభాషణా సాయం పట్టగలిగింది.

"చాలా చీరెలు మీరు...."

"ఆఁ. మరిక్కడ చాకలాళ్ళు ఉండరు కదాని కొంచెం ఎక్కువే తెచ్చుకున్నాను," అంది కామాక్షి ఫోర్కుతో కుస్తీ పడుతూ.

ఆ తరవాత తమ్ముడితో, "నేను చేత్తో తింటే వాళ్ళేమైనా అనుకుంటారా?" అనడిగింది గొంతు తగ్గించి.

"అనుకోరులే. చేత్తో తిను," అన్నడతను. అలా అక్కకి హామీ ఇచ్చేడే కానీ ఆ మాట అతిథులకి చెప్పకుండా ఉండలేకపోయేడు "మాదేశంలో అన్నం చేత్తో తింటాం. మాఅక్కయ్యకి చేత్తో తినకపోతే అన్నం తిందో లేదో కూడా తెలీదు," అన్నాడు గట్టిగా నవ్వుతూ.

వెంకుకి మేనమామ తమ అలవాట్లగురించి ఆ విధంగా మేలమాడడం మహా అవమానంగా తోచింది.

"నామటుకు నాకు అది సబబుగానే ఉందనిపిస్తోంది," అన్నాడు టిం.

"నిజానికి ఫోర్కుకంటే చేతివేళ్ళే సుళువులా ఉంది. ఈ ఫోర్కులూ అవీ ఎలా వచ్చేయో కానీ," అంది హాలీ తను కూడా తన ఆయుధాలు పక్కన పెట్టేసి, కామాక్షి చేతి ఒడుపు గమనిస్తూ.

అతిథులిద్దరూ వంటకాల్ని తెగ మెచ్చుకున్నారు. అద్భుతం, ఇంతటి రుచి కని విని ఎరగం, జన్మలో ఇలాటి వంటకాలు తినలేదు అంటూ. దేవి కూడా అన్నిసార్లూ లెక్కపెట్టినట్టు "యూఆర్ వెల్కం" చెప్పింది.

కామాక్షి వారిద్దరినీ ఆశ్చర్యంగా చూస్తోంది.

హాలీ అలవాటయిన మనిషిలా చక్కగా ఆ పులుసులూ కారాలూ తింటోంది కానీ టిం మాత్రం అవస్థ పడుతున్నట్టే కనిపించేడు. అతనిమొహం కెంపు వర్ణం తిరిగింది. ముద్ద ముద్దకీ గుక్కెడు నీళ్ళు తాగుతూ ష్ ష్ అని ఊదుకుంటూనే డెలీషస్ అంటూంటే కామాక్షికి అది ఎలా అర్థం చేసుకోవాలో తెలీలేదు. ఆయనకి నచ్చినట్టా? లేనట్టా?

"ఆయనక్కొంచెం పెరుగు వెయ్యి ఆ మంటలు తగ్గుతాయి," అంది చిన్నప్పతో.

చిన్నప్ప పెరుగు ఆయనకి ఇవ్వబోయేడు కానీ "నో, నో, నాకేం అవుసరం లేదు. కారం కొంచెం ఎక్కువే అయినా చాలా బాగున్నాయి," అన్నాడు టిం.

"ఫరవాలేదు వేసుకోండి. రుచిగా కూడా ఉంటుంది."

"మీరు కూడా ఇలాగే తింటారా?"

"యస్ యస్. నిజానికి పెరుగన్నం తినకుండా భోజనం పూర్తి కాదు. అసలు ఈ పులుసులూ, కారలూ తిని, పెరుగు వేసుకోకపోతే కడుపులో మంట కూడాను. పెరుగు యంటీడోట్ కారాలకి,"

సిసలైన తెలుగువాళ్ళు కూడా ఈ తిండికి తట్టుకోలేక పెరుగు తింటారన్న సంగతి టిమ్‌కి తృప్తి కలిగించింది.

అందరూ తినడం అయేక హాల్లోకి వచ్చేరు.

టిం, హాలీ మరోసారి వంటకాల్ని మెచ్చుకున్నారు.

దేవి "వెల్కం" అంది యథోచితంగా.

మడత పడ్డ జరీఅంచు సరి చేసుకుంటూ సోఫాలో కూర్చున్న కామాక్షిని కన్నార్పకుండా చూస్తోంది హాలీ, "నాకలాటి చీరె తెప్పించి పెట్టగలరా? నేను దాని వెల ఈయగలను,"

దేవి ఆ మాట కామాక్షికి తెలియజేసింది. కామాక్షి నవ్వేసి, "అదేమంత భాగ్యం. తప్పకుండా పంపిస్తానని చెప్పు," అంది.

"నువ్వు కూడా ఆ మాట హాస్యానికే అని ఉన్నా, నేను మటుకు చీరెకోసం ఎదురు చూడ్డం ఖాయం," అంది హాలీ కూడా సుతారంగా నవ్వుతూ.

"హా, హా. హఠాత్తుగా నీ చీరె ఎంత హిట్టయిపోయిందీ," అన్నాడు చిన్నప్ప.

"ఆవిడకంత సరదాగా ఉంటే నేనెప్పుడో వెళ్ళి పంపేవరకూ ఆగడం ఎందుకూ? ఆర్నెల్ల పైమాట. ఇది ఇచ్చేస్తాను తీసుకోమను,"

చిన్నప్ప మళ్ళీ దుబాసీతనం నెరిపేడు.

"భలే మనిషి మీ అక్కయ్య."

"హాస్యానికనడం లేదు. నిజంగానే ఇస్తాను."

హాలీ మొదట నమ్మలేదు. ఆ తరవాత ఒప్పుకోలేదు. అది న్యాయం కాదంది. మళ్ళీ ఆవిడకి అచ్చంగా అలాటిది దొరక్కపోతేనో అని సందేహం వెలిబుచ్చింది.

కామాక్షి, చిన్నప్ప పదే పదే చెప్పి ఆవిడని ఒప్పించేరు. అక్కడికీ వాళ్ళు దాని ఖరీదు తీసుకుంటేనే తను చీరె తీసుకుంటానంది హాలీ.

"డబ్బు తీసుకుని ఇచ్చేటంత గొప్పచీరేం కాదండీ," అంటూ కామాక్షి ఒప్పుకోలేదు.

ఈవాదాలతో తనకేం సంబంధం లేదని డెబ్బీ లేచి వంటింట్లోకి వెళ్ళింది గిన్నెలూ కంచాలూ తొలిచి డిష్ వాషర్లో పడెయ్యడానికి.

అది చూసి కామాక్షి లేచింది, "నేనెలాగా వాళ్ళతో మాటాడలేను. గిన్నెలు తొల్చడం ఒక్కటే నాకొచ్చిన విద్య. నువ్వెళ్ళు. నేం చూస్తానివి," అంటూ.

‘‘అంత వంట మీరిద్దరూ చేశారు. ఇవి నావంతు,’’ అంటూ హాలీ కూడా వచ్చింది.

‘‘ఎవరూ అఖ్ఖర్లేదండీ. రెండు నిముషాల్లో అయిపోతుంది. మీరు పదండి,’’ అంది దేవి.

అఖరికి చిన్నప్ప వచ్చి అది తనవంతు పని అని వాళ్ళందర్నీ హాల్లోకి తోలేశాడు. ముగ్గురూ అటుపేపు నడక మొదలెట్టేరు కానీ దేవి మళ్ళీ వెనక్కొచ్చి చిన్న కప్పుల్లో బాసుందీ, చెంచాలూ ఓ ట్రేలో అమర్చి హాల్లోకి తీసుకొచ్చింది.

మరో అరగంట కబుర్లు చెప్పుకుని అతిథులు శలవు తీసుకుంటాం అంటూ లేచారు.

కామాక్షి గబుక్కున లేచి లోపలికెళ్ళి చీరె మార్చుకుని ఓ కాయితపు పొట్లాంతో వచ్చింది.

‘‘మరో అందమైన చీరా!’’ అంది హాలీ కామాక్షిని చూస్తూ.

కామాక్షి చిరునవ్వుతో తనచేతిలోని పొట్లాం ఆమెచేతిలో పెట్టింది.

హాలీ క్షణకాలం ఆశ్చర్యపోయి తరవాత తేరుకుని, ‘‘డబ్బు తీసుకోవాలి మరి,’’ అంది.

కామాక్షి తల అడ్డంగా ఊపింది.

‘‘అనేక ధన్యవాదాలు,’’ అంది హాలీ మరేం అన్లేక.

‘‘రేపు కాకపోతే మరోరోజు వాళ్ళకి ఊరు చూపించకూడదూ, ఆవిడకి కూడా వీలయినపుడు,’’ అన్నాడు టిమ్.

‘‘నిజమే,’’ అంది హాలీ మహదానందంతో, ‘‘రేపు ఆదివారం నాకేం పన్లేదు. వస్తారా?’’ అనడిగింది చిన్నప్పని.

‘‘మీకెందుకు అనవసర శ్రమ. నేనే తరవాతెప్పుడైనా తీసుకెళ్తానులెండి.’’

‘‘శ్రమేం లేదండీ. అవసరమనీ కాదు. నాకూ సరదాగా ఉంటుంది. రేపు పదిగంటలకొస్తాను,’’ అందావిడ.

‘‘సరే, మీకు సరదాగా ఉంటే.’’

కామాక్షి కొంత మొహమాటపడింది, "ఆవిడతో ఎందుకూ మధ్యని," అంటూ.

చిన్నప్ప ఫరవాలేదనీ ఈదేశంలో ఇదేమంత గొప్పవిషయం కాదనీ నచ్చచెప్పేడు. తరవాత హాలీతో వెంకుని కూడా పంపొచ్చా అని అడిగేడు.

"తప్పకుండాను," అంది హాలీ.

000

మర్నాడు సరిగ్గా పది కొట్టేసరికి హాలీ వచ్చింది కారు తీసుకుని కామాక్షినీ వెంకునీ తీసుకెళ్ళడానికి. శామ్ కూడా వస్తానని గొడవ పెట్టేడు. చిన్నప్ప వద్దన్నాడు కానీ హాలీ ఫరవాలేదు పంపమంది.

చిన్నప్ప వెంకుని పక్కకి పిలిచి ఇరవై డాలర్లిచ్చి టికెట్లూ, సోడాలూ ఏం కొన్నా డబ్బు ఇవ్వమని చెప్పేడు.

హాలీ వాళ్ళకి ఊరంతా చూపించింది - యూనివర్సిటీ, ప్లేనిటేరియం, సిటీహాలూ, ఆకాశాన్నంటే మేడలూ ... ఆ తరవాత బాతులచెరువుదగ్గరికి తీసుకెళ్ళింది. చాలామంది జనం చేరేరక్కడ. పిల్లలు బాతులకి రొట్టె ముక్కలూ, పేలాలూ వేస్తున్నారు. శాం కూడా పాప్ కార్న్ కొనమని అడిగేడు బాతులకోసం. హాలీ రెండు పొట్లాలు తీసుకుంది. వెంకు డబ్బు ఇవ్వబోతే ఆవిడ ఇవ్వనివ్వలేదు మై ట్రీట్ అంటూ. ఆ తరవాత ఊరు చివర్న ఉన్న మాల్‌కి వెళ్ళేరు.

ఓ యాభై షాపులున్న మాల్ అది. చాలామటుకు బట్టల దుకాణాలూ, జోళ్ళ షాపులూ, పుస్తకాలూ, రేడియోలూ, బొమ్మలూ, నాలుగు చిరుతిళ్ళ దుకాణాలూ ఉన్నాయి.

రకరకాల వస్తువులు రకరకాల సైజుల్లో రకరకాల రంగుల్లో రకరకాల ధరల్లో విశ్వామిత్ర సృష్టిని తలపింప చేస్తున్నాయి. కాలి చిటికెనవేలైనా కదపకుండా పై అంతస్థుకి మోసుకుపోయే మెట్లూ, చెయ్యెత్తకుండానే ఎదురుగా నిలుచునేసరికి తెరుచుకుని స్వాగతం పలికే తలుపులూ, నియాన్ లైట్లూ, ప్లాస్టిక్ మొక్కలూ

కామాక్షిలో ఏ ఏ భావాలు రేకెత్తించేయో కానీ ఆవిడ పైకి మాత్రం ఏమీ చూపలేదు. వెంకుకి మరోలోకంలో ఉన్నట్టుంది.

ఓ గంటసేపు తిరిగేసరికి కామాక్షికి ఉన్న ఓపికంతా ఊడ్చుకుపోయింది. ఇరుపక్కలా మైలున్నర పరుచుకున్న ఆ మహాభవనం ఆవిడకి ఇరుగ్గా అనిపించి ఊపిరాడ్డంలేదు.

"కాసేపు ఎక్కడైనా కూర్చుందామా?" అనడిగింది వెంకుని.

వెంకు హాలీని అడిగేడు, "మనము కొంచెము సేపు కూర్చొనవచ్చునా?"

"ఓ. అలాగే. అదుగో ఆ కాఫీషాపులో కూర్చుందాం, పదండి," అందావిడ అటు దారి తీస్తూ.

అక్కడ జనం బాగా కిక్కిరిసి ఉన్నారు."గుక్కెడు కాఫీకోసం ఎన్ని పాట్లు," అనిపించింది కామాక్షికి. ఇంటికి పోతే బాగుణ్ణు భగవంతుడా అని కూడా అనుకుంది మనసులోనే.

తినుబండారాలు ఆర్డరు చేసింతరవాత వెంకు మళ్ళీ పర్సు తీశాడు కానీ హాలీ ఈసారి కూడా అతన్ని ఇవ్వనివ్వలేదు. శాం పిన్ బాల్ మెషీను ఆడతానని అడిగేడు. కామాక్షి వెంకుని అడిగింది అదేమిటని. వెంకుకి ఇబ్బందిగా ఉంది. హాలీ తనని ఖర్చు పెట్టనివ్వడంలేదని. తల్లి అది గ్రహించి మరి మాటాడలేదు. శాంకి ఏదో చెప్పి మరోవేపుకి తీసుకుపోయేరు. మొత్తమ్మీద మరోగంట వింతలూ విశేషాలూ చూపించి వాళ్ళని ఇంటికి తీసుకొచ్చింది హాలీ.

కామాక్షీ, శాం బాగా అలిసిపోయేరు. శాం కారులోనే కామాక్షి ఒళ్ళో ఒరిగి నిద్ర పోయేడు.

వెంకు కాలింగ్ బెల్ నొక్కితే చిన్నప్ప వచ్చి తలుపు తీశాడు. హాలీని కూడా లోపలికి ఆహ్వానించేడు. ఆవిడ తనకి "ఇంకా ఏవో పనులున్నాయి, మరోసారి వస్తానులెండి" అని చెప్పి వెళ్ళిపోయింది.

''మావాళ్ళకి ఊరు చూపినందుకు ధన్యవాదాలు'' అని మరోసారి చెప్పేడు చిన్నప్ప.

''యూ ఆర్ వెల్కం'' అందావిడ కారెక్కుతూ.

దేవి శాంని కామాక్షిచేతుల్లోంచి తీసుకుని వాడిగదిలో తీసికెళ్ళింది.

''ఊఁ. ఎలా ఉంది సైట్ సీయింగ్?'' అన్నాడు చిన్నప్ప ఉసూరుమని సోఫాలో కూలబడ్డ అక్కనీ, పక్కనే నిలబడ్డ మేనల్లుడినీ చూస్తూ.

కామాక్షి మాటాడలేదు.

''బావుంది'' అన్నాడు వెంకు.

''నీకేం బావున్నట్టు లేదు ఈ తిరగడం,'' అన్నాడు చిన్నప్ప అక్కని వదిలిపెట్టకుండా.

''ప్చ్'' అంటూ చప్పరించేసిందావిడ. ఓ క్షణం ఊరుకుని మళ్ళీ అంది, ''బహుశా నేనావిడతో వెళ్ళకుండా ఉండాల్సింది,''

చిన్నప్ప నొచ్చుకున్నాడు. ''అదేమిటి అలా అంటావు. నువ్వలా అనుకుంటే నేను పంపేవాణ్ణే కాదు. నువ్వేదో ఆవిడకి చీరె ఇచ్చేవు. అందుకు ప్రతిగా ఆవిడ నీకేదో చెయ్యాలనుకుంది. మీకిద్దరికీ నచ్చిందనే అనుకున్నాను,'' అన్నాడతను నెమ్మదిగా నచ్చచెప్తున్నట్టు.

కామాక్షి తృళ్ళిపడింది, ''ఏంవిటన్నావూ?'' అని మళ్ళీ అడిగింది.

''నువ్వు ఆవిడసరదా తీర్చేవు. ఆవిడ నీకు కూడా సరదాగా ఏదో చెయ్యాలనుకుంది అంటున్నాను.''

''అంటే నేను ఆవిడకి చీరె ఇవ్వకపోతే ఆవిడ నన్ను తీసికెళ్ళేది కాదా? నాకోసం ఖర్చు పెట్టిన డబ్బు ఆ చీరెకి కట్టిన ఖరీదా?''

హాలీ అంత ఆప్యాయత చిలికిస్తూ తమతో తిరగడం స్నేహధర్మంతో కాదన్న సత్యం ఆవిడకి అయోమయంగా ఉంది.

"అది కాదక్కయ్యా. మరీ అంత చాదస్తంగా మాటాడకు. ఇక్కడ ఎవరూ ఏదీ ఊరికే పుచ్చుకోరు. మరి ఆవిడ డబ్బిస్తానంటే నువ్వు పుచ్చుకోనన్నావు కదా."

"కట్టి విడిచిన చీరెకి ఖరీదెలా కట్టమంటావురా?"

"అదే మరి. పోన్లెద్దూ. ఏదో ఒకటి ... అయిపోయింది కదా."

"చూడు చిన్నా, నాకు మాటాడ్డం సరిగ్గా రాదు. కానీ మనసాంప్రదాయాలు నీకు తెలుసు కదా. బజారులెక్కల్లా ఈ ఇచ్చిపుచ్చుకోడాలు అంత ఖచ్చితంగా నిత్యజీవితాల్లో మనకి జరగవు. ఇవ్వవలసినచోట ఇస్తాం. పుచ్చుకోగల చోట పుచ్చుకుంటాం. జీవితంలో అదొక భాగం. అంతే గానీ ఎప్పటికప్పుడు ఇలా అణాపైసలతో ఫైసల్ చేసుకోడానికి అవుతుందా? నువ్వావిడకి ఈ సంగతి వివరంగా చెప్పి ఉంటే ఆవిడ మరో పనికొచ్చే పనేదైనా చేసుకుని ఉండేదేమో ఈ టైంలో హాయిగా ..." కామాక్షి మరో క్షణం ఆగి మళ్ళీ అంది, "ఎంతమంది ఎన్నివిధాల ఆదుకుంటే నువ్వు ఈ స్థితికి వచ్చేవు. అవన్నీ నువ్వూ నేనూ తీర్చగల ఋణాలేనా?"

దేవికి ఆవిడమాటలు పూర్తిగా అర్థం కాకపోయినా, భావం కొంతవరకూ గ్రహించగలిగింది.

"మీకు ఎవరైనా సాయం చేస్తే మీరు తిరిగి ఏమీ చెయ్యకుండా ఊరుకుంటారా?" అంది ఆశ్చర్యంగా.

"నువ్వు కూడా మా అక్కయ్యలాగే చెక్కా ముక్కా చేసి మాటాడుతున్నావు. అది మాటల్లో అంత సులువుగా చెప్పగలిగేది కాదు. ఆవిడ మాటాడుతున్నది ఒక జాతి కొన్ని యుగాల అనుభవాలు సంతరించుకుని మలుచుకున్న జీవనవిధానం. అందులో ఇచ్చి పుచ్చుకోడాలూ, సహాయ సహకారాలూ ఒక భాగంగా సాగిపోతాయి. ఇందాకా ఆవిడ అంది చూడూ ఎంతో మంది సాయం చేస్తేనే నేనీ స్థితికి వచ్చేనని. కానీ తను ఎంతమందికి సాయం చేసిందో చెప్పలేదు," అన్నాడు చిన్నప్ప దేవికి సమాధానంగా.

ఆ క్షణంలో అతడిమనసులో అక్కయ్య అంటే ఎక్కడలేని గర్వమూ పొంగుకొచ్చింది.

000

(ఆంధ్రజ్యోతి మార్చి 26, 1982లో ప్రచురితం.)

# 3. దేవీ పూజ

సీతాపతి భార్యని రెస్టారెంటుకి తీసుకెళ్ళేడు పదహారో యానివర్సరీకి ఆనవాయితీ తప్పకుండా.

సీత చుట్టూ కూర్చున్నవాళ్ళని చూస్తోంది. ఒకో బల్లదగ్గరా ఇద్దరూ ముగ్గురూ కూర్చుని ఉన్నారు - వయసులో ఉన్న పిల్లా పిల్లాడూ, ఓ ముసలాయనా ముసలావిడా, ఓ తండ్రీ ఇద్దరు పిల్లలూ, మరో తల్లీ ఆరుగురు ఆడపిల్లలూ - పుట్టినరోజు పార్టీలా ఉంది. నెత్తిమీద కాయితపు కిరీటాలూ, చేతుల్లో గాలిబుడగలూ - గోలగోలగా సరదాగా కబుర్లు చెప్పుకుంటున్నారు. సినిమాలూ, డాన్సులూ, ఆటలూ, పాటలూ, చదువూ సంధ్యా, అప్పూ ఆస్తీ, ఇల్లూ కారూ, మంచూ, చలీ, సౌతాఫ్రికా, నికరాగ్వా ...

సీత భర్తమొహంలోకి చూసింది. అతనేదో ఆలోచిస్తున్నాడు. ఏమైఉంటుందో?

పెళ్ళయి పదహారేళ్ళయింది. మొదట ఏ రెండు మూడేళ్ళో ... అంతే. ఆ తరవాత అతనిలోకం అతనిదీ, తనలోకం తనదీ.

"హౌ ఆర్యూ టుడే?" వైట్రెస్ వచ్చి చిరునవ్వుతో కుశలప్రశ్నలేసి, పేరు చెప్పుకుని, ఏం కావాలని అడిగింది ఎంతో ఆప్యాయంగా.

సీతాపతి తాము బాగున్నామని ఆ పిల్లకి చెప్పి, సీతని అడిగేడు. "ఏం కావాలి?"

"మీరే చెప్పండి."

"నువ్వు చెప్పు. నీ యానివర్సరీ కదా!"

అతనికదో అలవాటు. ప్రతీదీ ఆవిడకోసమే అన్నట్టు మాటాడతాడు.

"ఏం, పెళ్ళి నాకే గానీ మీకు కాలేదేమిటి?"

సీతాపతి నవ్వేసి, వైట్రెస్‌ని అడిగేడు సలహా. Speciality of the day, speciality of the house, తనకిష్టమయినవి, ఇతరులు మెచ్చుకునేవీ ఓ పనస చదివిందా అమ్మాయి.

సీతాపతి ఏదో చెప్పి ఇద్దరికీ అదే తెమ్మన్నాడు.

తాగడానికేం కావాలని మళ్ళీ అడిగింది వైట్రెస్.

సీతాపతి తనకి వైను తెమ్మన్నాడు. సీత తనకేం వొద్దంది కానీ అతను వదల్లేదు. పిన్యా కొలాడా తెమ్మన్నాడు ఆవిడకి.

"ప్రతిసారీ కీష్ తీసుకుంటావు కదా. ఇవాళ అడగలేదేం?"

"ప్రతిసారీ అదే తింటున్నాను కదా. ఇవాళ మార్చి చూద్దాం అని."

అతను మళ్ళీ ఆలోచన్లో పడ్డాడు.

సీత మళ్ళీ దిక్కులు చూడసాగింది.

నాలుగు రోజులక్రితం అతనికి హఠాత్తుగా గుర్తొచ్చింది తమ యానివర్సరీ సంగతి.

"ఏం కావాలో చెప్పు, కొనిపెడతాను," అన్నాడు ముచ్చట పడిపోతూ.

అంచేత అతను తప్పకుండా ఏదో ఒకటి కొంటాడని గ్రహించింది సీత. అంచేత ఆవిడ కూడా అతనికేదో కొంది. ఈదేశం వచ్చేక దీపావళీ దసరా తెలీడంలేదు కానీ ఈ సంవత్సరీకాలు అలవాటయిపోయేయి.

ప్రతి ఏడూ ఏం కావాలని ఒకళ్లనొకళ్లు అడుక్కోడాలూ, నాకేం వద్దని ప్రొటెస్టులూ, ఆ తరవాత ఏదో ఒకటి తప్పకుండా కొనడం, ఒకరు కొన్నది రెండోవారికి తెలీకుండా దాచుకోడాలూ, మూసుకోడాలూ, రంగురంగుల కాయితప్పొట్లాలూ, పిల్లల్ని పొరుగిళ్ళకి తగిలేసి తాము ఏ ఫ్రెంచి రెస్టారెంటులోనో విందులారగించడం. ...

సీతకి ఈ సరదాలు లేవు.

సీతాపతికి ఆవిడ అర్థం కాదు.

ఆవిడకి ఏమిటి సరదాలో అతనికి ఈ పదహారేళ్ళలోనూ అర్థం కాలేదు. అతను సీతని దేనికీ బలవంతం చెయ్యడు. అసలతను ఎప్పుడూ ఎవర్నీ దేనికోసమూ బలవంతం చెయ్యడు. కనీసం మొహమాట పెట్టడం కూడా చెయ్యడు.

సీతాపతికి భార్య అంటే మాచెడ్డ గౌరవం.

అతనికి మంచి స్నేహితులున్నారు. అతను వాళ్ళని కష్టాల్లో ఆదుకుంటాడు. వాళ్ల సుఖాలకి సంతోషిస్తాడు. వాళ్ళ తెలివితేటల్ని మెచ్చుకుంటాడు. వాళ్ళ ఆస్తిపాస్తుల్ని కూడా మెచ్చుకుంటాడని సీత అభిప్రాయం. అది మూట్ పాయింట్. ఎవరైనా ఆడవాళ్ళని హేళన చేసినా, అవమానించినా సీతాపతి వాళ్ళని పట్టుకు తన్నలేదు కానీ తగువేసుకోకుండా వదల్లేదు. చాలామంది అతన్ని సార్థక నామధేయుడివోయ్ అని హేళన చేసేరు కూడాను. అప్పుడు కూడా అతను నొచ్చుకోలేదు. సీతలాటి భార్యని పొందడం తన అదృష్టం అన్నాడు.

సీతనో మరో సుందరాంగినో కాక మొగాణ్ణి భార్యగా పొందుతావేమిటోయ్ అని మళ్ళీ నవ్వేరు మిత్రులు.

మూర్ఖులారా అనుకుని ఊరుకున్నాడతను.

అతనికి సీత అర్థం కావడం లేదు. ఆవిడకి ఏం కావాలో తెలిస్తేనే కదా తాను పూనుకుని సమకూర్చి పెట్టి ఆవిణ్ణి తృప్తి పరచి తాను ఆనందభరితుడయ్యేది.

వైట్రెస్ ప్లేట్లూ, గ్లాసులూ బల్లమీద పొందిగ్గా అమర్చి, ఒక గ్లాసులో వైను పోసి, పిన్యాకొలాడా గ్లాసు సీతముందు పెట్టి, బ్రెడ్ రోల్సు పక్కన పెట్టి "ఇంకేమైనా కావాలా?" అని అడిగింది.

ఇంకేమీ అక్కర్లేదని ఆ పిల్లకి చెప్పి పంపేసి, అతను బ్రెడ్ ఓముక్క తుంచి తినడం మొదలెట్టాడు.

సీత ఒక్క క్షణం ప్లేటువంక చూసి తనూ ఓ ముక్క తీసుకుంది.

అతను గ్లాసు ఎత్తి పట్టుకుని "టు మెనీ హాపీ యియర్స్," అన్నాడు.

సీత కూడా మెనీ హాపీ రిటర్న్స్ చెప్పింది.

"ఎలా ఉంది?"

"బాగుంది."

"పళ్ళరసమే కదా. కొంచెం రమ్ కలుపుతారు. అంతే."

"ఊఁ."

సీత పక్కకి చూసింది. ఇందాకా కుర్రజంట కూర్చున్న చోట ఇప్పుడు ఇద్దరు నడివయసువారు ఉన్నారు.

ఆవిడ పెదవులమీద లీలగా చిరునవ్వు మెరిసింది.

"ఏమిటి?" భర్త ఆ చిర్నవ్వు గమనించి ప్రశ్నించేడు.

"ఏం లేదు. వాళ్ళని చూస్తుంటే ఇక్కడ ఓ 'తరంసేపు' కూర్చున్నామేమో మనం అనిపించింది."

పక్కబల్లదగ్గర కూర్చున్న దంపతులు శలవులకి ఎక్కడికెళ్ళాలా అన్న విషయం వాదించుకుంటున్నారు. "ఫ్లోరిడా వెళ్దాం" అంటుందావిడ. "కొలరెడో వెళ్దాం" అంటాడాయన. ఫ్లోరిడా వెళ్తే పిల్లల్ని చూడొచ్చు అంటుందావిడ. కొలరెడో వెళ్తే స్నేహితులని చూడొచ్చు అంటాడాయన. ఎవరి వాదనలు వారికి అప్రతిహతంగా ఉన్నాయి.

"తెలుగువాళ్ళని కలిసి చాలా రోజులయింది" అంది సీత.

"ఊఁ." అన్నాడు సీతాపతి.

"వచ్చేవారం వాళ్ళని పిలవనా?"

"నేనూళ్ళో ఉండకపోవచ్చు."

"... ..."

"నేన్లేకపోతే ఏంలే. వాళ్ళందరూ నీతోనే ఎక్కువ స్నేహంగా ఉంటారు. నువ్వు పిలుచుకో."

సీత మాటాడకుండా మరో ముక్క నోట్లో పెట్టుకుంటూ భర్తవేపు చూసింది. ఈయనకి వైట్రెస్ మాటమీద చాలానే గురి ఉండి ఉండాలి. తనకి ముక్క గొంతు దిగడం

లేదు. అతను పరమానందంగా ఆరగిస్తున్నాడు. అసలు ఏం తింటున్నాడో తెలిసే తింటున్నాడా?

వెనక కూచున్నవారి మాటలు వినిపిస్తున్నాయి.

"శుక్రవారం ఏం చేస్తున్నావు?"

"ఏం?"

సీత కాస్త పక్కకి తిరిగి కనుకొలుకుల్లోంచి వాళ్ళని చూసింది. 16, 17 ఏళ్ళ పిల్లలు.

"ఊరుచివర చిన్న రెస్టారెంటుంది. ఎవరూ ఉండరు," బహుశా ఆ అమ్మాయి చిలిపిగా కళ్ళెగరేసి ఉంటుంది. కుర్రాడు కొంటెగా ఆపిల్లవేపు చూసుంటాడు. "నిజం. అక్కడ ఫుడ్ బాగుంటుంది కూడా."

"చూద్దాం."

"తరవాత సినిమాకి వెళ్ళొచ్చు."

"తరవాత చెప్తాను."

"ఏడు గంటలకి కారు తీసుకురానా"

"తరవాత చెప్తానంటున్నాను కదా."

సీత అప్రయత్నంగనే ఓ నిట్టూర్పు విడిచింది.

"ఏమిటి?" అన్నాడు సీతాపతి.

"వెనక కూర్చున్నవాళ్ళ మాటలు."

"ఏమిటిట?"

"ఏం లేదు. మనదేశంలో పెద్దవాళ్ళు పెళ్ళిసంబంధాలు మాటాడుకున్నట్టే ఇక్కడ పిల్లా, పిల్లాడూ ఒకరినొకరు ఇంప్రెస్ చేయడానికి పడే తాపత్రయం."

వైట్రెస్ మళ్ళీ ప్రత్యక్షమయింది. "ఎనీ డెసర్ట్?" అంటూ.

"చెప్పు" అన్నాడు సీతతో.

"నాకేం వొద్దు."

“ఐస్క్రీం నీకు ఇష్టం కదా. తీసుకో.”

“సరే.”

ఇద్దరికీ ఆర్డరు చేసి సీతాపతి మళ్ళీ ఎటో చూస్తూ కూర్చున్నాడు.

Ha…ppy… bi…rth…day to… you…

రెస్టారెంటులో వాళ్ళందరూ ఒక్కసారి పాట వచ్చినవేపు చూశారు. పిల్లలందరూ పుట్టినరోజు పాపాయి చుట్టూ చేరి గొంతెత్తి పాడుతున్నారు. పాట అయిపోయేక ఆ పాపాయి కొవ్వొత్తులు ఊదేసింది ఒక్కగుక్కలో. అందరూ చప్పట్లు కొట్టేరు. సీత కూడా చిన్నగా చప్పట్లు కొట్టి ఇటు తిరిగింది.

సీతాపతి తన ధ్యాసలో తనున్నాడు.

సీతకి ఐస్క్రీం తినాలనిపించలేదు.

“ఏం?” అంటూ సీతాపతి అది కూడా తీసుకుని పూర్తి చేసేశాడు.

సీతకి ఎందుకో పార్వతి జ్ఞాపకం వచ్చింది. పార్వతిని తను అంతకుముందు ఎరగదు.

000

నాలుగేళ్ళ కిందట ఇండియా వెళ్ళబోతూ ఎయిర్పోర్టులో ఆగిపోవాల్సొచ్చింది. పొగమంచు కారణంగా విమానాలు ఆరోజు ఎగరలేదు. కారిడోర్‌లో తెలుగుమొహం కనిపించగానే పార్వతిమొహం మతాబాలా వెలిగింది. ఎవర్నో రిసీవ్ చేసుకోడానికి వచ్చిందిట. ఆ ప్లేనూ రాలేదు. ఇద్దరూ మాటల్లోకి దిగారు. ప్లేను కాన్సిల్ చేసారు కనక సీతని వాళ్ళింటికి రమ్మంది పార్వతి ఆపూటకి.

సీత మొహమాట పడింది కానీ పార్వతి ఒప్పుకోలేదు. వాళ్ళిల్లు చాలా దగ్గరే అనీ ఇంట్లో ఎవరూ లేరనీ బతిమాలింది.

“మనం ఇక్కడ ఎక్కువగా మిస్సయేది ఈ పోచికోలు కబుర్లేనండీ. నేను చిన్న పల్లెటూళ్ళో పెరిగేను. ఇక్కడేమో వీధిగుమ్మంలోనో నీలాటిరేవులోనో నిలబడి ‘ఏం కూర’ అంటూ అడిగే తీరికా ఉండదు. అడగడానికి మనుషులూ ఉండరు.”

సీత అంతవరకూ గమనించలేదు. పార్వతికి ఐదో నెల. ఆవిడ భుజమ్మీద చెయ్యేసి "పదండి" అంది.

ఆ తరవాత కొన్నాళ్ళపాటు ఫోనులో మాటాడుకుంటూ ఉండేవారు కానీ ఈమధ్య అదీ తగ్గిపోయింది. ఓమాటు పిలిచి చూడాలి అనుకుంది సీత.

"అయిందా?"

"ఏమిటి?"

"చుట్టుపక్కల వాళ్ళమాటలు వినడం."

"ఎదురుగా ఉన్న మనిషి మాటాడకపోతే అవే వినిపిస్తాయి మరి."

"సరేలే. పద."

ఇంటికొచ్చి తలుపు తీసేసరికి ఫోను గోల పెడుతోంది.

సీతాపతి ఒక్క ఉదుటున ఎగిరి ఫోనందుకున్నాడు కొంపలంటుకుపోతున్నట్టు. "హలో" అన్నాడు అరుస్తున్నట్టు.

హ్మ్. అయిపోయింది యానివర్సరీ అనుకుంది సీత ఓ నిట్టూర్పు విడిచి. టీవీ ఆన్ చేసి సోఫాలో కూలబడింది.

సీతాపతికి అవతల ఎవరో యానివర్సరీ శుభాకాంక్షలు చెప్పినట్టున్నారు. అతను ధన్యవాదాలు చెప్పుకున్నాడు. అతను ఫోనులో మాటాడ్డం పూర్తి చేసి వచ్చేసరికి సీతకి ఒక సిట్‌కాం అయి రెండోది మొదలయింది.

"ఏమిటి చూస్తున్నావు?"

"ఏదో..."

"ఎందుకా చెత్త. కట్టెయ్."

సీత ఏదో అనబోయింది కానీ ఫోను మళ్ళీ మోగింది. పిట్ట పోరూ పిట్ట పోరూ పిల్లి తీర్చింది. అతను మళ్ళీ తిరిగొచ్చేసరికి ఈ సిట్‌కాం కూడా అయిపోతుంది.

సీతకి అతనితీరు అర్థం కాదు. ఏదో ఒట్టు పెట్టుకున్నట్టు ... తనతో తప్ప ఎవరితోనైనా సరే గంటలతరబడి మాటాడగలడు. ఎంచేతో అర్థం కాదు. తను ఎంత

ప్రయత్నించినా ఉ, ఆ, ఏమిటి తో ముగించేసే ఈ మనిషి ఇంకెవరితోనైనా ఏకధాటిగా మూడు గంటలసేపు మాటాడగలడు - పిన్నల్తో, పెద్దల్తో, ఆడాళ్ళతో, మగాళ్ళతో, తెల్లవాళ్లతో, నల్లవాళ్లతో, పండితులతో, పామరులతో ... అతనిదృష్టిలో తను మాత్రమే ఏకోవకి చెందనిదేమో! ఇంట్లో ఉన్నంతసేపూ ఆ ఫోనుకోసం తహతహ. ''నన్ను ఏ టైములోనైనా సరే పిలవొచ్చునహో'' అంటూ సకలజనులకీ దండోరా వేయించినట్టు. అంచేతేసేమో అందరూ అతన్ని వేళా పాళా లేకుండా ఎప్పుడు పడితే అప్పుడు సమయాసమయాలు చూసుకోకుండా పిలిచి తమరు ధన్యులై ఈయన్ని ధన్యుణ్ణి చేస్తారు.

సీతకి విసుగేసి టీవీ ఆపేసి ఓ పుస్తకం తీసుకుని పడగ్గదిలోకి వెళ్ళిపోయింది. దాదాపు మరో గంట అయేక సీతాపతి గదిలోకి వచ్చేడు. ''పుష్పం సమర్పయామి పత్రం సమర్పయామి'' అన్నట్టుంది అతని వాలకం.

''ఏం? అప్పుడే మాటలయిపోయేయా?'' అంది సీత రవంత కోపంతో.

''తానా కాన్ఫరెన్సులొస్తున్నాయి కదా. ఏవో సలహాలు అడగడానికి పిలుస్తారు. నేనేం చెయ్యను?'' అన్నాడతను మంచంమీదికొరుగుతూ.

''ఏదో ఒకటి. తానా కాకపోతే మరో తానతందాన. లోకేశుడి సంగతెలా ఉన్నా తమరు లేకపోతే లోకాలాగిపోవడం ఖాయం.''

''పదిమందీ పూనుకుంటేనే కదా కార్యం సాగేది.''

000

ఫోను మోగడంతో గాఢనిద్రలో ఉన్న సీత ఉలికిపడి లేచింది.

సీతాపతి ఫోనందుకుని ''ఉండండి. అవతలగదిలోంచి తీసుకుంటాను''అని లేచి వెళ్ళేడు. టైం చూస్తే రెండయింది. ''ఎప్పుడు పిలిచినా ఫరవాలేద''ని ఈయన చెప్తే మాత్రం అవతలివాళ్ళకి ఉండొద్దా బుద్ధి'' అనుకుంది సీత అటువేపుకి ఒత్తిగిలుతూ.

సీతాపతి ఫోనులో అట్టేసేపు మాటాడలేదు. కానీ అతను మళ్ళీ పక్కమీదకి వచ్చేసరికి పావు తక్కువ నాలుగయింది. సీతకి అప్పుడే చిన్న కునుకు పడుతోంది.

“ఎక్కడికెళ్ళేరు?” అంది అతను గదిలోకి రావడం చూసి.

“మెల్లిగా మాటాడు.”

“ఏం?”

“పక్కగదిలో కోమలగారున్నారు.”

సీత ఉలికిపడింది. “ఏమిటీ?”

“ఆవిడకీ భాస్కరంగారికీ కొన్నాళ్ళుగా పడ్డంలేదు.”

“అందుకని అర్ధరాత్రి మీరెళ్ళి ఆవిణ్ణి మనింటికి తీసుకొచ్చేరా?” సీత నమ్మలేనట్టు చూసింది.

“పడుకో. రేపు ఏదో ఓటి ఆలోచిద్దాం.”

సీతకి ఒళ్ళు భగ్గున మండింది. “పడుకోక ఏం చేస్తాను? ఇప్పుడెళ్ళి ఆవిణ్ణి మనింటికి తీసుకురావాల్సినంత ప్రమాదం ఏం వచ్చిందో చెప్పండి ముందు,” అంది సీత నిప్పులెర్రుగుతూ.

సీతాపతికి ఆపదలో ఉన్న ఆడవాళ్ళని ఆదుకోడం సరదాయే కానీ దేనికైనా ఓ హద్దుండొద్దూ?

సీతాపతి మాత్రం చాలా శాంతంగా జవాబు చెప్పేడు, “ఆవేశపడకు. భాస్కరం వాళ్ళ ఆఫీసులో ఓ అమ్మాయితో తిరుగుతున్నాడుట. ఇప్పుడు ఆ అమ్మాయిని యింటికి తీసుకొచ్చేశాడుట పెళ్ళి చేసుకుంటానని.”

సీతకి నవ్వాలో ఏడవాలో అర్థం కాలేదు. “నా మట్టిబుర్రకి తోచడంలేదు కానీ భాస్కరం మరో ఆడదాన్ని ఇంటికి తీసుకొచ్చేడని మీరు భాస్కరంపెళ్ళాన్ని అర్ధరాత్రి మనింటికి తీసుకొచ్చేరా?”

“మరీ సిల్లీగా మాటాడకు. ఆ పరిస్థితి వేరూ, ఈ పరిస్థితి వేరూ. నీకామాత్రం తెలీదా?”

“నాకేం తెలుసో ఏం తెలీదో కూడా మీరే చెప్పాలి. ఇప్పుడు నేనెవరికి ఫోను చెయ్యను మా ఆయన మరో ఆడదాన్ని కొంపకి తీసుకొచ్చేరని?”

''ఆ మాట నువ్వు నిజంగా నమ్మే అంటున్నావా? హాస్యానికంటున్నావా?'' అన్నాడు సీతాపతి విపరీతంగా బాధపడిపోతూ. అతడి సున్నితహృదయం చాలా గాయపడిపోయింది. ''నీకు అలాటి అనుమానమే ఉంటే చెప్పు. ఇప్పుడే ఆవిణ్ణి తీసుకెళ్ళి వాళ్ళింట్లో దిగబెట్టి వచ్చేస్తాను'' అని కూడా అన్నాడు.

సీత మాటాడలేదు. తను ఆమాట హాస్యానికనలేదు. అలాగని అనుమానమూ కాదు. తన భర్తకి ఊళ్ళో వాళ్ళబాధలంటే ఉన్న ఉత్సాహం చూస్తేనే తనకి అసహ్యంగా ఉంది. ''ఇప్పుడేం చేస్తారు?''

''తెల్లారనీ. వాళ్ళన్నయ్య కెనడాలో ఉన్నాడు. రేపతన్తో మాటాడి ప్లేనెక్కించేస్తే మన బాధ్యత తీరిపోతుంది.''

సీతకి హఠాత్తుగా ఇదేదో తనకథ కాదన్న భావన ఏర్పడింది. ఏదో సినిమా చూస్తున్నట్టుంది. ''అసలేమైంది?'' అనడిగింది.

''వాడొట్టి వెధవ. ఈవిడకేం తక్కువనీ. అందం, చదువూ, తెలివితేటలూ...''

''మరి ఆయనగారి బాధేమిటిట?''

''అదే మరి ... తిక్కమేళం. ఆ రెండో ఆవిడకి వీసా కావాలని. ఆ వీసాకోసం ఈవిణ్ణి వదిలేస్తానంటాడు.''

సీతకి ఏమనాలో తోచలేదు. దగ్గరికి జరిగిన భర్తని దూరంగా తోసేసి, అటు తిరిగి పడుకుంది. ఆవిడకి ఆత్మనా మనసంస్కృతిమీద బోలెడు నమ్మకం ఉంది. లతలాగ మన మగాళ్ళకి స్త్రీలంటే గౌరవమేననుకుంది కానీ రంగనాయకమ్మలాగ మొగాళ్ళు స్త్రీలని అణగదొక్కేస్తున్నారు అనుకోలేదు. భర్తకి ఆడవాళ్ళంటే బోలెడు సానుభూతి అని తెలుసు. నిజానికి పెళ్ళికి ముందు ప్రప్రథమంగా సీతాపతిలో తనకి నచ్చిన గుణం కూడా అదే - అతని మంచితనం!

సీతని పుట్టింట్లో తండ్రి గానీ, అన్నదమ్ములు గానీ ''నువ్వాడదానివి'' అంటూ ఎప్పుడూ దెప్పలేదు. చులకనగా చూడలేదు. పెళ్ళయేక భర్త కూడా ఎప్పుడూ ''ఆడదానివి, ఓమూల పడుండు'' అనలేదు. కానీ ... ఈమధ్యే అతని ధోరణి

అగమ్యగోచరంగా ఉంది. సాయం అనే మాటకి అర్థం ఏమిటో? అది ఎప్పుడు శృతి మించి రాగాన పడుతుందో? సహృదయతని కొలిచే మీటర్లెక్కడ దొరుకుతాయో? తెల్లారేక తేల్చుకోవాలి తాడో పేడో అనుకుంటూ పడుకుంది.

000

తెల్లారేక తాడో పేడో తేల్చుకోలేకపోయింది సీత.

కనుచీకటితోనే లేచి, స్నానం చేసి, పూజ చేసుకుని, కాఫీ కప్పుతో బల్లదగ్గర కూచోబోతుంటే కోమల వచ్చింది గదిలోకి అడుగులో అడుగు వేసుకుంటూ. పీక్కు పోయిన కళ్లూ, పాలిపోయిన మొహమూ, నెత్తిమీద నీళ్ళకుండా ...

సీతకి క్షణకాలం నోట మాట రాలేదు. మరుక్షణం తేరుకుని, "రా. కాఫీ తీసుకో," అంటూ చేతిలో ఉన్న కాఫీ కప్పు అందించింది.

"మీరు తాగండి," అంది ఆ అమ్మాయి నీరసంగా.

"నేనూ తెచ్చుకుంటాను," అంది సీత లేచి వంటింట్లోకి నడుస్తూ. ఆపిల్లని చూస్తూంటే పార్వతి జ్ఞాపకం వచ్చింది మళ్ళీ. ఉన్న ఊరూ, కన్నతల్లీ - సమస్తం వదిలేసుకుని పదివేల మైళ్ళదూరం వచ్చేసినతరవాత మన వాళ్ళందరికీ ఒక్కలాటి బాధే అనిపించిందా క్షణంలో.

మధ్యాన్నం కోమలని ప్లేనెక్కించి వచ్చింతరవాత సీతాపతి అతిమామూలుగా "కోపం చల్లారిందా?" అన్నాడు.

"మీకు నాకోపమే తెలిసింది కానీ నాబాధ తెలీలేదు."

"ఏదో పాపం, ఆడపిల్ల బాధ పడుతుంటే చూస్తూ ఎలా ఊరుకోడం చెప్పూ. మాట సాయం చేసినంత మాత్రాన మునిగిపోయిందేమిటి," అన్నాడతను సామరస్యం ఒలకబోస్తూ.

"నేనంటున్నది మీధోరణిగురించి. ఇవాళ పెద్ద విషయమే అయింది. కానీ ఆవిడ కాల్లో ముల్లు విరిగిందన్నా మీరిలాగే పరిగెడతారు కదా?" అంది సీత చిరాగ్గా.

"ఇక మీదట నిన్నడిగే చేస్తాలే ఏ పనైనా."

సీతకి ఏం చెప్పాలో తోచలేదు. అస్త్రసన్యాసం చేసినవాడితో యుద్ధం చెయ్యడం ఎలా?

... .... ....

మరి తరవాతేం జరుగుతుంది?

ఏం జరుగుతుందంటే ..

సీతాపతి భార్యతో ‘‘పద, ఇవాళ బయట తిందాం,’’ అంటాడు.

ఇంతలో ఫోను మోగుతుంది ...

000

(స్వాతి, నవంబరు 1987లో ప్రచురించబడింది.)

# 4. నిజానికీ ఫెమినిజానికీ మధ్య

"మీ బిగికౌగిలిలో నన్ను బంధించారు."

సీతమొగుడు సీతాపతికి గాయత్రి రాసిన ఎనిమిది పేజీల ఉత్తరం పట్టుకుని సీత కూర్చుంది. సీతకి గొంతులో వెగటుగా ఉంది. మొహం పాలిపోయింది.

గత నాలుగు వారాల్లో సీతాపతి ప్రవర్తన సీతకి కొత్తగా ఉంది. అతను హఠాత్తుగా ఇంటి పనుల్లో కల్పించుకోడం మొదలు పెట్టేడు. సామాన్లు సర్దుతున్నాడు. గిన్నెలు కడుగుతున్నాడు. ఉతికిన బట్టలు మడతలు పెడుతున్నాడు. పిల్లల్ని కారులో తిప్పడానికి సిద్ధమవుతున్నాడు. ఎటొచ్చీ పిల్లలిద్దరూ ఎదిగిపోయేరు అప్పటికే. అంచేత "థాంక్స్ బట్ నో డాడీ" అనేసి సైకిళ్ళేసుకు వెళ్ళిపోతున్నారు.

సీత ఆ కాయితాలు విసిరేసింది చిరాగ్గా. ఇలాంటి ఉత్తరాలు చివరంటా చదవక్ఖర్లేదు. కానీ చూపులు అటూ ఇటూ తిరిగి తిరిగి మళ్ళీ వచ్చి ఆ కాయితాలమీదే పడ్డాయి.

"23 ఏళ్ళ తరవాత ఆ ఒక్క రోజూ ..."

"... కి పెళ్ళాం అన్నారు మీరు."

"4, 5, 6 తేదీల్లో రాసిన ఉత్తరాలు ..."

"మీ రహస్యపు ఉత్తరం .."

"మా బాత్రూంలో మీరు మర్చిపోయిన వస్తువు ..."

సీతకి ఒళ్ళు మండిపోతోంది. ఆ కాయితాలు కాళ్ళతో తొక్కిపారేయాలని ఉంది. కానీ కాళ్ళు రాలేదు. కాయితాలు సరస్వతి కదా! ఆ గాయత్రివిషయం దాచడానికేనా ఆయన అన్ని అవస్థలు పడుతున్నది? అతను హఠాత్తుగా ఇంటివిషయాల్లో ఎక్కడ లేని ఉత్సాహం చూపించడం మొదట కొంచెం ఆశ్చర్యం కలిగించినమాట నిజమే. కానీ

తాను తన అలవాట్లు మార్చుకున్నట్టే ఆయన కూడా మార్చుకున్నారనుకుంది. విజిటింగ్ ప్రొఫెసరుగా ఆర్నెల్లు ఇండియాలో ఉండి వచ్చిన సీతాపతి తనతో అంతకుముందు పదిహేడేళ్ళు కాపురం చేసిన సీతాపతి కాడు.

"మీరక్కడ చెప్పిన పాఠాలకన్నా నేర్చుకువచ్చిన పాఠాలే ఎక్కువలా ఉన్నాయే," అని తను వేళాకోళం చేసింది కూడాను ఓ రోజు తను లేవకముందే లేచి కాఫీ పెట్టిన ఆయనతో.

"సరే. ఎప్పుడో ఒకప్పుడు జ్ఞానోదయం కాకపోతుందా?" అన్నాడతను నవ్వి.

సీత కళ్ళు మళ్ళీ ఉత్తరంమీద వాలేయి. "మా బాత్రూంలో మరిచిపోయిన ..." హుమ్. ఏముంటాయి కనక మొగాళ్ళకి ఊడదీసి పక్కన పెట్టడానికి ఏ వాచీయో గోచీయో కాక? గోచీ ఒదిలేసి వీధిలోకి వెళ్ళలేరు కదా. వాచీయే అయుండాలి. సీతాపతి తన వాచీ ఇండియాలో ఉండగా పాడయిపోయిందని చెప్పేడు.

ఒంగి కాయితాలన్నీ తీసింది. ఏమిటి చెయ్యడం? "ఇదుగో మీ ఉత్తరం" అంటూ ఆయనకి మామూలుగా అందించడమా? దాచడమా? పారెయ్యడమా? ఆలోచిస్తూ ఒక్కొక్క కాయితం ముప్ఫై ముక్కలు చేసింది. ఫరవాలేదు. ఈ ఒక్క ఉత్తరం ఆయన చూడకపోతే మునిగిపోయిందేమీ లేదు.

"పదిహేడేళ్ళనించీ బ్రేకు లేకుండా వంట చేస్తున్నావు. ఇవాళ నేను చేస్తాను, చెప్పు," అంటూ హుషారుగా వంటింట్లోకి వచ్చిన సీతాపతి ఆవిడ అక్కడ లేకపోవడం చూసి కొంచెం తికమక పడ్డాడు.

రాణీ, బాబీ ఇంట్లో లేరు.

సీత పడగ్గదిలో ఉంది.

"ఏం పడుకున్నావు? ఒంట్లో బాగులేదా?" అంటూ నుదుటిమీద చెయ్యేశాడు.

"గాయత్రి ఎవరు?" అంది సీత ఆ చెయ్యి తోసేస్తూ.

"ఎప్పుడో చిన్నప్పటి స్నేహంలే, ఏం?" అన్నాడతను తేలిగ్గా.

"కావలించుకుని ముద్దు పెట్టుకునేంత స్నేహమా?"

"ముద్దెవరు పెట్టుకున్నారు?"

ఓ అరగంటసేపు వాదోపవాదాలు అయింతరవాత సీతే వదిలేసింది. అతనిమాటలు నమ్మి కాదు. మాటల్లో అతనితో గెలవలేక.

సీతాపతికి మాత్రం సంతృప్తిగానే ఉంది. తనేం తప్పు చెయ్యలేదు. గాయత్రి ఏదో తన బాధలు చెప్పుకుని పెక్కి పెక్కి ఏడుస్తుంటే మనసు ద్రవించి భజంమీద చెయ్యేశాడు ఓదార్పుగా. తను చిన్నప్పట్నుంచీ అంతే. ఎవరైనా బాధ పడుతుంటే చూడలేడు. ఓ మనిషి మరో మనిషిని కావలించుకున్నంత మాత్రాన ఏంపైపోయింది? తన ఏకపత్నీవ్రతానికి భంగం రాలేదు. ఆవిడ పాతివ్రత్యానికి భంగం రాలేదు. ఇందులో గొడవ చేయాల్సినంత ఏమీ కనిపించలేదతనికి.

"ఇంక రహస్యాలేం లేవు" అనే అనుకుది సీత. ఆ రాత్రి ఇండియానించి ఫోనొస్తే అతను మామూలుగా ఈమధ్య తనకి అన్నీ చెప్తున్నట్టే ఆ కాల్ సంగతి కూడా చెప్తాడనుకుంది. కానీ అతనా విషయమే ఎత్తలేదు. అంత కొంపలంటుకుపోయే విషయం కాకపోతే అర్ధరాత్రి ఎందుకు ఫోను చేస్తారు అవతలివాళ్ళు?

మర్నాడు సీతాపతి మెయిల్ బాక్సులోంచి ఉత్తరాలు తీసి, ఒకటి జేబులో పెట్టుకుని మిగిలినవి ఇంట్లోకి తీసుకొచ్చి సీతముందు పడేశాడు, "నువ్వు చూసేకే చూస్తాలే" అంటూ.

సీతకి ఒళ్ళు భగ్గున మండింది. రంకు నేర్చినమ్మ బొంకు నేర్వదా అన్న సామెత ఆడవాళ్ళపరంగానే ఎందుకంటారో ఆవిడకి అర్థం కాలేదు.

సీతాపతి ఆరోజు రెట్టించిన ఉత్సాహంతో గదులన్నీ వాక్యూం చేశాడు. ఏవో కారణాలు చెప్పి పిల్లలిద్దరికీ బహుమానాలు కొన్నాడు. సీతని సినిమాకి తీసుకెళ్ళేడు. సీత కూడా ఏమీ జరగనట్టే ప్రవర్తిస్తోంది. కానీ కడుపులో బాధ అలాగే ఉంది.

రెండు రోజులతరవాత సీతాపతి ఏదో కాన్ఫరెన్సుకి ఫిలడెల్ఫియా వెళ్ళేడు. ఆరోజు మధ్యాహ్నం టెలిగ్రాం వచ్చింది, "పెద్దవాడు కాలేజీలో చేరేడు." ఆ గాయత్రినించే. సీతకి మహా చిరాకేసింది. ఎవరి పిల్లాడో కాలేజీలో చేరితే

ఈయనకెందుకు టెలిగ్రాం? లేక వాడు "ఎవరి పిల్లాడో" కాదా? సీతకి మళ్ళీ కడుపులో దేవినట్టయింది. తనభర్త తనదగ్గర ఏదో దాస్తున్నాడు. ఎందుకు ఈ దాపరికాలు? విషయం పూర్తిగా తెలిస్తే కానీ తోచదు. అతన్ని అర్థం చేసుకోడానికి గానీ, తన తృప్తికోసం గానీ ఇదేదో కొసకంటా తెలుసుకోవాలి. ఆయన్ని అడిగి లాభం లేదు. గత పదిహేను రోజుల్లోనూ ఏవో అందీ పొందని సమాధానాలు చెప్పి విషయం డొంకదారి పట్టిస్తున్నాడే కానీ తిన్నగా మాటాడ్డం లేదు.

మంచిగా, లాలనగా, దురుసుగా, పొగరుగా, కోపంగా తన నేరు మూయిస్తున్నాడే కానీ నిజం చెప్పడం లేదు. అక్కడకీ ఓసారి సూటిగానే చెప్పింది కూడాను. "నాకు మీమాటలు నమ్మకంగా లేవు. నాకు పైవాళ్ళతో మనవిషయాలు మాటాడడం అంటే అసహ్యం. అందుచేతే మిమ్మల్నే తిన్నగా అడుగుతున్నాను," అని.

ఆ రోజు కూడా సీతాపతి అతనికి అలవాటయిన మాటలే చెప్పేడు, "నాకు అబద్ధాలాడ్డం అసహ్యం" అన్నాడు. "నీకు నామీద అనుమానంగా ఉందంటే నాకు చాలా కష్టంగా ఉంద"న్నాడు. "నలుగురిలో నాపరువేం కావాల"న్నాడు. మట్టిగడ్డలన్నాడు.

సీత చివ్వున లేచింది. బేస్మెంటులో అతనిబల్లదగ్గిర చూసింది. అయిదు నిముషాలు కూడా పట్టలేదు. ఫైళ్ళమధ్య ఓ కట్ట ఉత్తరాలు. పుస్తకాలషెల్ఫులో ఇద్దరు ఆడవాళ్ళ ఫొటోలు. ఓ పక్కన చిన్న కాయితప్ముక్కమీద గిలిగిన టెలిఫోను నెంబర్లూ …

సీత ఉత్తరాలు పట్టుకుని కుర్చీలో కూలబడింది. అవన్నీ ఒకరూ ఇద్దరూ కాదు ముగ్గురు రాసినవి.

"మావారు ఊళ్ళో లేరు. కొత్త చీరె తీసి …"

"మీదగ్గరకొచ్చి ఉండిపోవాలనుంది."

"మీరు మళ్ళీ వచ్చినప్పుడు నాదగ్గరే ఉండాలి."

"ఒంటరితనం, దిగులూ…"

"పగలు మీ ఉత్తరాలకోసం, రాత్రి ఫోన్ కాలుకోసం."

"విమర్శక చక్రవర్తిగారూ కాదు, అనుభూతి చక్రవర్తి ..."

"మీ మెడచుట్టూ చేతులు వేయాలనుంది."

"మీ చెవులు కొరకాలనుంది."

సీత విసుగ్గా వాటిని బల్లమీదికి విసిరేసింది.

మళ్ళీ తీసి తారీఖులు చూసింది. కొన్ని ఇక్కడికి వచ్చినవి, కొన్ని ఆయన అక్కడుండగా అందుకున్నవి.

సీతబుర్రలో ఆలోచనలు కందిరీగల్లా గందరగోళంగా సుళ్ళు తిరుగుతున్నాయి. చిన్న నవ్వొచ్చింది. ఇక్కడ ఎంతోమంది ఇండియాలో ఆడవాళ్ళు అధోగతిలో ఉన్నారని తనతో వాదించేరు. మనవాళ్ళు సంపూర్ణ స్వాతంత్ర్యం సాధించేరనడానికి ఈ ఉత్తరాలే సాక్ష్యం. కానీ ఆ స్వాతంత్ర్యంతో వాళ్ళేం చేస్తున్నారు?

ఈ ఉత్తరాలు చూస్తుంటే, ఈ ఫొటోలు చూస్తుంటే, అవి ఆయన దాచినతీరు చూస్తుంటే వాళ్ళమధ్య ఒట్టి స్నేహమే అనిపించడం లేదు. సీతాపతి చెప్పినట్టు ఒట్టి ఏడుపులూ, ఓదార్పులూ మాత్రమే అనిపించడంలేదు. ... అనుభూతి చక్రవర్తిట! అనుభూతి ముందో? విమర్శ ముందో? అవిడ అనుభూతి ప్రసాదిస్తే ఈయన విమర్శ అనుగ్రహించేరా? ఫరవాలేదు. మరోసారి ఈయన ఇండియా వెళ్ళినప్పుడు "అనుభూతితో కూడిన విమర్శలకి సీతాపతిని సంప్రదించండి," అని ప్రకటించుకోవచ్చు.

మళ్ళీ ఫొటోలు తీసి చూసింది. శోభాకుమారి అయి ఉంటుంది. చిన్నదే. ఈయనకి సకాలంలో పెళ్ళి అయి ఉంటే అంత కూతురుండేది.

సీతకి వెగటుగా ఉంది.

బాధగా ఉంది.

అసహ్యంగా ఉంది.

ఏదో చెయ్యాలని ఉంది.

కారు తీసుకెళ్ళి ఏక్సిడెంటు చెయ్యాలని ఉంది.

ఎవర్నయినా చంపెయ్యాలని ఉంది - తను, ఆయన, పిల్లలు, ఆ ఆడాళ్ళు - ఎవర్ని?

ఎదురు పడి వాళ్ళని నిలదీసి అడగాలనుంది.

కానీ .. ఏమని? ఏముంది అడగడానికి? ఏమని అడుగుతుంది?

అడిగితే తన భర్తనే అడగాలి. ఆయన్ని మాత్రం ఏమని అడుగుతుంది? పెళ్ళయిన ఆడాళ్ళతో ఏమిటనా? పిల్లలతల్లులతో సరసాలేమిటనా? ఇద్దరు పిల్లలతల్లికి రెండో మొగుడుగా ఉండడంలో ఆనందం ఏమిటనా? ... ప్చ్. అడగడానికేమీ లేదు.

సీత ఒక్క క్షణం కళ్ళు మూసుకుంది. అసలు తనబాధ ఏమిటి? తనకే సరిగ్గా తెలీడం లేదు. షా రాసిన **మేజరు బార్బరా**లోలాగ తాను చెక్కు చెదరని గండ్రశిలమీద నిలుచున్నాననుకుంది. క్షణంలో సగంసేపు పట్టలేదు కాళ్ళకింద రాయి కొండచిలువలా కదిలి జారిపోయింది!

సీతాపతికి కొన్ని విలువలు ఉన్నాయనీ, జాతిధర్మం, కులధర్మంలాటివి కాకపోయినా కనీసం కొంతలో కొంతయినా డీసెన్సీ చూపిస్తాడనీ అనుకుంది. తన్ని బాధ పెడుతున్నది అదేలా ఉంది. అతను తనతో అబద్ధాలు చెప్తున్నాడు. ఎందుకు అన్నది అర్థం కావడం లేదు. అందువల్ల అతను సాధిస్తున్నది ఏమిటి?

కారు గరాజులో పెట్టి సీతాపతి ఇంట్లోకి వచ్చేడు.

“ఆ ఉత్తరాలు చూసేను,” అంది సీత.

“ఏ ఉత్తరాలు?”

“మీ జనానా రాసినవి.”

“మళ్ళీనా? ఓమాటు చెప్పేను కదా.”

“ఉత్తరాలు చూస్తే మీరు చెప్పినట్టు లేవు.”

కథ మళ్ళీ మొదటికొచ్చింది.

‘‘వాళ్ళు నాకోసం పడి కొట్టుకుంటున్నారు కానీ నేను వాళ్ళని పట్టించుకోడం లేదు కదా,’’ అన్నాడు. ‘‘ఇప్పుడేం మునిగిపోయింద’’న్నాడు. ‘‘నువ్వనుకున్నంత ప్రమాదం ఏమీ జరగలేద’’న్నాడు.

ఇంకా ‘‘ఏదో ఘోరమైన తప్పు జరిగి గాయత్రికి మతి చలించింద’’నీ, తను మళ్ళీ ఆవిడకి ఆత్మవిశ్వాసం కలిగించడానికి ప్రయత్నిస్తున్నాననీ చెప్పేడు. శోభ రచయిత్రి అనీ ‘‘తెలుగు రచయిత్రులు అలాగే రాస్తార’’నీ అన్నాడు. ‘‘వాళ్ళు రాస్తే నేనేం చెయ్యను?’’ అన్నాడు. ‘‘అలా రాయొద్దని వాళ్ళకి రాస్తాలే’’ అన్నాడు.

సీతకి నమ్మకం కలగలేదు కానీ ఊరుకుంది.

‘‘పిచ్చి పిచ్చి ఆలోచనలు మాని పద అలా వెళ్ళొద్దాం,’’ అన్నాడు సీతాపతి.

‘‘నేను రాను. పిల్లలొచ్చే వేళయింది,’’ అంది సీత విసుక్కుంటూ.

‘‘మరేం ఫరవాలేదులే. వాళ్ళేం పాలు తాగే పసిపిల్లలు కారు కదా. వస్తే వాళ్ళే ఉంటారు.’’

సీత మాటాడకుండా లేచి గదిలోంచి వెళ్ళిపోయింది.

000

బేస్మెంటులో సీతాపతి పని చేసుకుంటున్నాడు. పడగ్గదిలో సీతకి ఆలోచనలతో తల పగిలిపోయేలా ఉంది.

ఎందుకిలా జరిగింది? తనకి ఓపిక ఉన్నంతవరకూ సర్దుకుపోడానికే ప్రయత్నించింది. ‘‘నా’’ అన్నవాళ్ళు లేని ఈ దిక్కుమాలిన దేశంలో తన బతుకు ఏమిటి? పొద్దున్న లేచింది మొదలు కాఫీలు పెట్టడం, బ్రేక్ ఫాస్టు, లంచి మూటలు కట్టడం, పిల్లల్ని స్కూళ్ళలో దిగబెట్టి తనపనికి వెళ్ళడం, మళ్ళీ వాళ్ళని తీసుకురాడం, బజారు పన్లు, అంట్లగిన్నెలు, మాసినబట్టలు, చలికాలంలో మంచు ఎత్తిపోసుకోడం, ఎండాకాలంలో గడ్డి కోసుకోడం, ఆకులేరుకోడం - ఒళ్ళలిసిపోయే పని కాకపోయినా రోజంతా ఈ పనులతోనే తెల్లారిపోతుంది. వీటన్నిటిమధ్యా ఓ క్షణం తీరిక దొరికితే ఊరికే కూచోవాలనుంటుంది కానీ ఓ ఉత్తరమ్ముక్కేనా రాద్దాం అనిపించదు. ప్రతి చిన్నపనికీ

మిషన్లున్న ఈ సంపన్నదేశంలో ఓ కప్పు కాఫీ కావాలంటే తను పెట్టుకుంటే ఉంది లేకపోతే లేదు. వెధవది ఓ కప్పు కాఫీ పెట్టుకుంటే మూడు గిన్నెలు కడుక్కోవాలని కాఫీ మానేసినరోజులు చాలానే ఉన్నాయి. తనకి రెండు రోజులకోసారయినా మన కూరలు తినకపోతే అన్నం తిన్నట్టుండదు. పిల్లలిద్దరికీ ముప్పూటలా అమెరికా తిళ్ళే. ఆయన ఒప్పుకోరు కానీ ఆయన ఇష్టాయిష్టాలు ఆయనకీ ఉన్నాయి.

వీటన్నిటిమధ్యా కుక్కకీ పనీ లేదు, తీరుబడీ లేదన్నట్టు ఉంది తనబతుకు. ఇవి చాలనట్టు సీతాపతి ఇంకే ఆచారాలూ పాటించకపోయినా అతిథిసేవలో ఏ పూర్వులకీ తీసిపోడు. తాను ఈవిషయంలో ఆయనకి ''సహధర్మచారిణి''గా చరించలేదనా ఈ కక్ష?

అదేనా ఆయన పైవాళ్ళదగ్గరికి చేరడానికి కారణం? సీతకి ఎక్కళ్ళేని నీరసం వచ్చింది. చిన్న నవ్వూ కూడా వచ్చింది. సీతాపతి గాయత్రిలో ఆత్మవిశ్వాసం కలిగించేడో లేదో కానీ తన ఆత్మవిశ్వాసం పాతాళాన్నంటింది. ఏడుపొచ్చినట్టుంది కానీ రావడంలేదు. ఎవరితోనేనా మాటాడాలనిపించింది. కానీ ఎవరితో? తను వాళ్ళబాధలు వింది కానీ తనబాధ ఎప్పుడూ ఎవరితోనూ చెప్పుకోలేదు. అసలు ఎవరున్నారిక్కడ? ఒక్కొక్కళ్ళనే జ్ఞాపకం తెచ్చుకుంది. ఉహు. లాభం లేదు. జరిగేపని కాదు. మనూళ్ళలోలా ఎప్పుడు పడితే అప్పుడు ఎవరింటికి పడితే వాళ్ళింటికి - మనవాళ్ళయినా సరే - వెళ్ళిపోడానికి వీల్లేదిక్కడ. ''మాకు ప్లానులున్నాయం''టారు. ''మాకు కంపెనీ వస్తుందం''టారు. ''మేం మిమ్మల్ని ఎక్స్‌పెక్టు చెయ్యలేదం''టారు. ''నెక్స్‌టైం కొంచెం ముందు ఫోను చెయ్యండం''టారు.

పోనీ ఏద్దైనా సినిమాకి వెళ్తే? కూర్చున్నచోటునించి లేవాలని లేదు. టీవీ ఆన్ చేసింది. ఏదో డ్రామా. ఆఫ్ చెయ్యబోయి ఆగిపోయింది. కథలో ఏమవుతుందో చూడాలనిపించి. జీవితంలో సినిమాల్లోలాగ జరక్కపోయినా అదో ఓదార్పు! టీవీభార్య బాధలు మరిచిపోడానికి తాగడం మొదలెట్టింది. తను కూడా అలా చేస్తే? అందులో బాధ ఏమిటంటే బాధ మరిచిపోయేవరకూ తాగాలి. అంత తాగినతరవాత తనేం చేస్తోందో

తనకే తెలీదు. తనకి కావలిసిన జవాబు దొరికిందో లేదో కూడా తెలీదు. పిల్లలు జడుసుకుంటారు. అయ్యవారిని చెయ్యబోయి కోతిని చేసినట్టు!

సీతకి పిచ్చెక్కిపోతోంది. ఏదో చెయ్యాలని ఉంది. కాని ఏం చెయ్యడమో తెలీడంలేదు. ఆఖరికి ఫోను తీసి కామాక్షిని పిలిచింది. ఆవిడ ఈదేశం వచ్చి పాతికేళ్ళయింది.

"హలో."

"నేనేనండీ."

"ఓ, సీతగారు. ఏమిటి విశేషాలు?"

"ఏం లేవండీ. ఏం కూర?"

అవతల్నించి చిన్న నవ్వు వినిపించింది. "గుత్తొంకాయ చేస్తున్నాను. వస్తారా భోజనానికి?"

"మీరేదో హాస్యానికంటున్నట్టుంది. నేను నిజంగానే వచ్చేయగలను."

"లేదండీ నేను హాస్యానికనడంలేదు. నిజంగానే రండి."

పది నిముషాల్లో వస్తున్నానని చెప్పి సీత ఫోను పెట్టేసింది.

000

"నేనాయింట్లో ఉండలేనండీ."

కామాక్షి సీతవేపు నిదానంగా చూసి, "కాఫీ పెట్టనా?" అంది.

సీత సరేనన్నట్టు తలూపి, తన బాధా, అనుమానాలూ వీలయినంత క్లుప్తంగా వివరించింది.

"ఆయన్తో మాటాడలేకపోయావా?"

"మాటాడేను. ఎన్నిరకాలుగా చెప్పొచ్చో అన్ని రకాలుగానూ చెప్పి చూసేను. వేరే వాళ్ళతో మాటాడ్డం నాకిష్టం లేదనీ అందుకే ఆయన్నే తిన్నగా అడుగుతున్నాననీ కూడా చెప్పేను. ఏవో సోదికబుర్లు చెప్పేరు. అప్పటికి సబబుగానే అనిపిస్తాయి కానీ

రెండు రోజులు తిరిగేసరికి మరో ఉత్తరమో కాయితమో కనిపిస్తుంది ఆయనబుర్ర నిండా వాళ్ళగురించిన ఆలోచనలే అనుకోడానికి.''

కామాక్షికి ఏమనడానికీ తోచలేదు. ఆవిడకి తెలిసినంతవరకూ భార్యాభర్తలిద్దరూ మంచీ చెడ్డా తెలిసినవాళ్ళే మరి.

''నిజానికి ఆలోచిస్తుంటే ఇప్పుడనిపిస్తోంది ఆయన ఇవాళ ఓ సుబ్బమ్మతో పడుకున్నారా లేదా అన్నదానికంటే పదేళ్ళనించీ ఈయన వ్యాపకాలెప్పుడూ ఊరివాళ్ళతోనే కదా అని. ఎంతసేపూ వాళ్ళ కష్టాలూ, కన్నీళ్లూ, సమస్యలూ, ఆశలూ, అవసరాలూ, ఆరోగ్యాలూ, వాళ్ళపిల్లల చదువులూ, పెళ్ళిళ్ళూ - ఇదే ఆయన లోకం. ఇప్పుడు అబద్ధాలూ, కావలించుకోడాల్లోకి దిగింతరవాత నేను మాత్రం ఏవో విలువలు అనుకుంటూ కూచోడం దేనికనిపిస్తోంది. ఇప్పుడు ఈయనగారి స్త్రీజనోద్ధరణ పతాకదశకి చేరుకున్నట్టుంది,'' అంది సీత.

''వీరేశలింగంగారిలాగా?'' అంది కామాక్షి హాస్యంగా, వాతావరణం తేలిక పరిచే యత్నం చేస్తూ.

''మరే,'' అని సీత నవ్వి, ''లేదులెండి. చిన్న తేడా ఉంది. వీరేశలింగంగారు విధవలకి పెళ్ళిళ్ళు చేసి ఉద్ధరిస్తే, ఈయన పెళ్ళయినవాళ్ళని పట్టుకుని, వాళ్ళ మొగుళ్ళని వెధవల్ని చేస్తున్నారు,'' అంది.

ఈసారి కామాక్షికి నిజంగానే నవ్వొచ్చింది.

సీత మరో పావుగంట కూచుని, ''వెళ్ళొస్తానండీ'' అంటూ లేచింది.

ఎక్కువగా బాధ పడొద్దనీ, తొందర పడొద్దనీ మరీ మరీ చెప్పి పంపిందావిడ సీతని.

000

సీతకి మనసు కాస్త తేలిక పడ్డట్టనిపించినా బాధ అలాగే ఉంది. మనసు ఓ రకంగా మొద్దు బారిపోయింది. ఇండియాలో ఆడవాళ్ళ పరిస్థితిగురించి చాలామాట్లే

వాదనలు జరిగేయి. అమెరికన్లతోనే కాక సీతాపతితో కూడా చాలాసార్లు వాదించింది. అసలు తెలుగుదేశంలో ఆడవాళ్ళకి చాలామంది మొగవాళ్ళే సపోర్టిచ్చేరంది.

సీతాపతి ఒప్పుకోలేదు. "వీరేశలింగంగారు వయసులో ఉన్న ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు చేశారు. లేకపోతే వాళ్ళు మాగాళ్లందరివెంటా బడి కుటుంబాలని నాశనం చేస్తారనీ, ఆడవాళ్ళ చదువులు కూడా వాళ్ళని మంచి భార్యలుగా చెయ్యడానికేననీ. వాదించేడు. చలం కూడా అంతేనన్నాడు. చలం చెప్పిన స్త్రీస్వాతంత్ర్యం మగాళ్ళకి ఆడవాళ్ళు సెక్స్ అందించడానికే కదా అన్నాడు. ఐరనీ ఎక్కడ అంటే ఈనాడు సీతాపతి చేస్తున్నది అదే ఆడవాళ్ళని తన సరదాలకి ఉపయోగించుకోడం!

"నామొగుడు నన్ను విలాసవస్తువుగా చూస్తున్నాడ"ని మొత్తుకుంటున్న ఆడదాన్నీ "నాకు మావారు పరిపూర్ణ స్వాతంత్ర్యం ఇచ్చేరు అన్న ఆడదాన్నీ" ఆయన సానుభూతి పేరుతోనో అనుభూతి పేరుతోనో సాహిత్యచర్చల పేరుతోనో పక్కలోకే చేర్చేరు!

సీతకి తల బద్దలు కొట్టుకోవాలనిపించింది.

మల్లయుద్ధంలో మరో రౌండు - ఇద్దరూ అరగంట వాదించుకుని పోతే ఫొమ్మనుకుని బేస్మెంటులోకొకరూ బెడ్రూంలోకొకరూ వెళ్ళిపోయేరు.

సీతకి భర్తమాటలు నమ్మాలని ఉంది. పదిహేడేళ్ళలో అతను ఎప్పుడూ మరీ అంత నీతిమాలినవాడిలా ప్రవర్తించలేదు. పైగా అతను కావాలనుకుంటే ఇక్కడ మాత్రం లేవా అవకాశాలు? ఎందుకు ఇన్నాళ్ళు ఆగడం? ఎందుకు ఎక్కడో ఇండియా వెళ్ళి వెయ్యడం వేషాలు? పైగా ఇదేం దాపరికం? నిజంగా వెధవపనులు చెయ్యదల్చుకుంటే ఇంత మరీ తనకి తెలిసేలాగా? ఏమనుకోడం? అతి తెలివా? తెలివి మాలినతనమా?

000

వారం రోజులు గడిచేయి. సీత ఏదో పుస్తకం కోసం బేస్మెంటులోకి వెళ్ళి చూస్తుంటే ఒక పుస్తకంలోంచి ఓ ఉత్తరం కింద పడింది. "ప్రియమైన గాయత్రికి ..."

సీత తుళ్ళిపడింది. ఇది మూడోసారి ఇలా జరగడం. రాణి తొమ్మిదేళ్ళప్పుడు రాసిన రెండు వాక్యాలు గుర్తొచ్చేయి.

Believe me they say, trust me they say. Then, just when I am convinced, all of a sudden something goes wrong.

చిన్నపిల్లయినా ఎంత తెలివిగా రాసింది! లేకపోతే ఇదేమిటి? సరీష్టా .. తనని తాను నమ్మించుకోడానికి ప్రయత్నిస్తున్న సమయంలోనే ఈ ఉత్తరం.... దానితోపాటు మరో మూడు.. సీతాపతి గాయత్రికి రాసింది, గాయత్రి సీతాపతికి రాసింది, సీతాపతి శోభకి రాసింది, శోభ సీతాపతికి రాసింది ...

సీతకి కళ్ళు తిరుగుతున్నట్టయి పక్కనున్న కుర్చీలో కూలబడింది. ఆ నాలుగు ఉత్తరాలూ చూసిన ఎంతటి వెర్రిదానికైనా స్పష్టంగా సుస్పష్టంగా తెలుస్తుంది సీతాపతి ఇంతవరకూ చెప్పినవన్నీ కల్లబొల్లి కబుర్లేనని.

"మిమ్మల్ని కౌగలించుకోవాలని ఉంది."

"ముద్దు పెట్టుకోవాలని ఉంది."

"మీతో ఖుజురహో చూడాలనుంది."

"పుట్టుమచ్చలగురించి మీకు ఇంత ఎలా తెలుసా అని ఆశ్చర్యంగా ఉంది."

"ఇల్లు ఖాళీ అయింది. ఈసారి ఫరవాలేదు."

"సైజు 34 బ్రాలు తెండి. బంగారం తెండి. నైలాన్ కోకలు తెండి."

సీత అర్థం చేసుకోడానికి ప్రయత్నం చేస్తున్నట్టు కొంచెంసేపు ఆగి మళ్ళీ చదవసాగింది. సీతని గుండెల్లో సూటిగా పొడిచింది తనభర్త శోభకి రాసిన ఉత్తరం. "నీకు నన్ను కావిలించుకోడానికి హక్కుంది. ముద్దు పెట్టుకోడానికి హక్కుంది ...."

సీతకి ఊపిరాడనట్టుగా ఉంది. ఆ కాయితాలలాగే పట్టుకుని మెల్లిగా పైకొచ్చింది. సోఫాలో కూచుని చూస్తుంటే బయట మంచు ఉప్పుపొడిలా కనిపిస్తోంది.

"కావిలించుకుని ముద్దు పెట్టుకోడానికి హక్కుంది."

మరి తనకున్న హక్కులేమిటి? చలిలో మంచు ఎత్తి పోసుకోడమూ, ఎండల్లో లాను మో చేసుకోడమూ, బట్టలుతుక్కోడమూ, బజార్లు చేసుకోడమూనా?

ఒకసారి వాదన వచ్చినప్పుడు సీత చెప్పింది భర్తతో, ''సరదాలకి వాళ్ళూ, సంసారానికీ సంఘంలో పరువుకీ నేనూ అంటే మాత్రం నేనీ ఇంట్లో ఉండన''ని.

సరిగ్గా ఇప్పుడదే జరిగింది. సీతకి అక్కడ ఒక్క క్షణం కూడా ఉండలేననిపించింది. అలా అనుకున్నతరవాత మనసు తేలిక పడింది. ఇన్నాళ్ళకి ఆకలి తెలిసింది. గబగబా వంట చెయ్యడం మొదలెట్టింది.

''నన్ను అర్థం చేసుకున్నదానివి నువ్వొక్కదానివే. ...''

''ఈసారి ఎక్కువ రోజులుండడం పడదు. ...''

ఉత్తరాల్లో వాక్యాలు వేటకుక్కల్లా తరుముతున్నాయి.

హఠాత్తుగా సీతకి పెళ్ళయిన కొత్తలో తను ఆయనకి రాసిన ఉత్తరాలు జ్ఞాపకం వచ్చేయి. అవెక్కడున్నాయో తనకి తెలుసు. గబగబా వెళ్ళి తీసుకొచ్చి ఒక్కొక్కటే చూడసాగింది.

''కన్ను మూసి తెరిచేలోగా పెళ్ళయిపోయింది.''

''ఇక్కడ కూడా ఆకాశం నీలంగానూ వాతావరణం చల్లగానూ ఉంది.''

''తమరితో సప్తపాదాలు తొక్కి సాధించిన కొత్తహోదాతో ...''

''ఏం కావాలని రాస్తే నువ్వొస్తే చాలని రాసిన ఉత్తరం ..''

''ఏదో రాయాలని ఉంది కానీ ఏం రాయాలో తెలీడం లేదు.''

''ఊరికి దూరంగా ... solitude is sweet అంటూ రహస్యాలు చెప్పగల స్నేహితునిపక్కన నడుస్తూ ...''

''ప్రతి మనిషికీ ఎన్నో పొరలుంటాయి. మీరు నన్ను మా ఆఫీసులో చూసిఉంటే.''

ఆవిడకి ఎక్కలేని నీరసం వచ్చింది. తొలిసారిగా కళ్ళలో నీళ్ళు చిప్పిల్లేయి. పదిహేడేళ్ళలో ఏం జరిగింది? ఎందుకిలా జరిగింది? ఆయన తననెప్పుడూ కొట్టలేదు. తిట్టలేదు. తనేం చేసినా అడ్డు చెప్పలేదు. పైగా ''నీకేం కావలిస్తే అదే చెయ్యి'' అంటూనే ఉన్నారు. ఎటొచ్చీ తనకి తెలివొచ్చి, తనకి ఏం కావలిస్తే అది చేసుకోడానికి ఆయన

సరదాలూ, పనులూ, ఉద్యోగమూ అడ్డొస్తున్నాయని తెలిసేసరికి ఆరేళ్ళు గడిచిపోయేయి. సీతాపతి తనకిచ్చిన స్వాతంత్ర్యంలో బోలెడు బాధ్యతలున్నాయి - డబ్బు బాధ్యత, పిల్లల బాధ్యత, వచ్చే పోయే చుట్టాలబాధ్యత, ఇంటిబాధ్యత ... "నువ్వే బాగా చేస్తావు" అంటూ అన్నీ తనమీద వదిలేసి నిష్పూచీగా స్నేహితులతో కాలక్షేపం చెయ్యడం అలవాటు చేసుకున్నాడతను.

సీత ఆయన వాదనలు మరోసారి మననం చేసుకుంది. - పొద్దున్న ఏడున్నరకి ఇంట్లో బయల్దేరితే సాయంత్రం ఐదున్నరకి వస్తాడు. మధ్యలో ఉద్యోగం నిలబెట్టుకోడంకోసం, ప్రమోషన్లకోసం, తన విలువ ఋజువు చేసుకోడంకోసం, అడ్డమైన వాళ్ళనీ ఇరవైనాలుగ్గంటలూ హుషారు చేస్తుండాలి. ఇంత కష్టపడి ఇంటికి వస్తే పెళ్ళాం కాస్త చిర్నవ్వుతో కనిపించాలనుకోడమూ తప్పేనా? పిల్లలేరీ అనడిగితే తప్పా? ఫోన్ కాల్సొచ్చాయా అంటే ఎందుకంత కోపం? ఊళ్ళోవాళ్ళతో ఉన్నట్టు కట్టుకున్న పెళ్ళాంతో కూడా ఉండాలంటే పెళ్ళెందుకు చేసుకోడం? అమెరికా పెళ్ళాలు మొగుళ్ళకి బట్టలు కొంటారు. సీత తనకి కొనదు సరి కదా బజారుకి వెళ్తే తను ఎంచిన బట్టలు బాగులేవంటుంది. తనకి చిన్నప్పటినుంచీ సృష్టిలో అందాలంటే పరవశం. ఆవిడేమో అందంగా ఉన్నావంటే విసుక్కుంటుంది.... ఇవీ సీతాపతి అభిప్రాయాలు.

సీత నిట్టూర్చింది. ఆయన అలా అనుకున్నందుకు కాదు తాను తప్పు పడుతున్నది. ఆయన ఆలోచనల్లో, కలల్లో తను రోజు చేసే వెట్టి చాకిరీ లెక్కలోకి రాదు. అమెరికా పెళ్ళాల్లా తను ఉండలేదని దెప్పుతారు కానీ అమెరికామొగుళ్ళు చేసే పనుల్లో పదోవంతు కూడా పట్టించుకోరు. అసలాయన ఇద్దరు ముగ్గురితో వ్యవహారాలు నడుపుతున్నారంటేనే తెలుస్తోంది ఆయనగారి స్వప్నసుందరి ఒక్కమూసలోంచి వచ్చే అచ్చు కాదని!

మూడేళ్ళకిందట ఇలాటివాదనే వచ్చినప్పుడు "మీక్కావలసిన ఆడవాళ్ళు వేరే ఉంటారు చూసుకోండి" అని తనంటే, "వేరే ఆడవాళ్ళని నేను చూసుకుంటానని నువ్వు అనుకుంటే నీకు నాగురించి ఏమీ తెలీదన్నమాట" అన్నాడతను.

ఇది మూడేళ్లకిందటి మాట. ఇప్పుడు?

జీవితం ఇంతేనేమో. రోజులూ, నెలలూ గడిచిపోతాయి. మనుషులు తమకి తెలీకుండానే మారిపోతారు. ఆలోచనలూ, అభిప్రాయాలూ మారిపోతాయి.

గణగణగణ .. ఫైరలారం మోతతో సీతకి తెలివొచ్చింది. వంటింట్లో కూర మాడి బొగ్గులై పొగలొచ్చి ఫైరలారం తగులుకుంది పొలోమంటూ.

సీత స్టౌ ఆఫ్ చేసి, పడగ్గదిలోకి వెళ్ళింది బట్టలు తీసుకోడానికి. వంగి సూట్‌కేస్ తియ్యబోతుంటే చీరపొరల్లో మంగళసూత్రాలు చిన్న చప్పుడు చేశాయి - ఎద్దు మెళ్ళో గంటల్లా, అంతే మరి. సీతాపతి మారిపోయేడు. అతని విలువలు మారిపోయేయి. అతను ఇవాళ పెళ్ళికి కొత్త నిర్వచనం చెప్తున్నాడు. సీత మెళ్ళోంచి మంగళసూత్రాలు తీసి పెట్టెలో పడేసింది.

గరాజి తీసినచప్పుడయింది. అతను వచ్చేడు. ముందుగదిలో సీత కనిపించకపోవడంతో పడ్గదిలోకి వచ్చేడు.

''మళ్ళీ ఏమయింది?''

''నేను వేరే అపార్ట్‌మెంటులోకి మారిపోతున్నాను.''

సీతాపతి నవ్వేడు. ''మళ్లీ ఏమయింది?'' అన్నాడు దగ్గరకొచ్చి ఆమె తలమీద చెయ్యి వెయ్యబోతూ.

సీత విదిలించుకుంది, ''ఇంతవరకూ నెత్తిన చెయ్యి పెట్టింది చాలు,'' అంటూ.

''అసలేమయిందంటుంటే ...''

''మీముండల్లో ఓ ముండగా నేనుండనని మీకు ముందే చెప్పేను.''

సీతాపతి షాకు తిన్నట్టు చూశాడు, ''వ్హాట్?''

సీత నిదానంగా సమాధానమిచ్చింది, చిలక్కి చెప్పినంత నిదానంగా, ''ఇంతకుముందు నేనెప్పుడూ ఎవర్నీ అంతమాట అనలేదు. ఎంచేతో ఇవాళ నాకది సహజంగా వచ్చేసింది.''

సీతాపతి మళ్లీ నవ్వేడు, ''హఠాత్తుగా వీర ఫెమినిస్టువయిపోయేమిటి?''

''లేదండీ. మీలాంటి మేధావులు బృహద్గ్రంథాలు చదివీ, రాసీ, మళ్ళీ మళ్ళీ అవే వల్లె వేసుకుంటూ కాలం గడుపుకు పోతుంటారు. మరోపక్క శోభలూ, గాయత్రులూ అనుభూతులూ సానుభూతులూ అంటూ ఒళ్ళు కొవ్వెక్కి కొట్టుకుంటూంటారు. వాళ్ళు ఆర్తులు. మీరు ఆర్తత్రాణపరాయణులు. మీకు వాళ్ళూ, వాళ్ళకి మీరూ చాలా అవసరం. మీజాతికీ వాళ్ళ జాతికీ చెందని, నూటికి తొంభైతొమ్మిది మందిలో నేనొక మామూలు ఆడదాన్ని. నెమ్మదిగా సావకాశంగా నాటుబండిలా రోజులూ వారాలూ గడుపుకుంటూ బతుకుతాన్నేను. మీరందరూ హడావుడిగా ప్రపంచాన్నంతా మీ చర్చలతో ఉద్ధరిస్తూండండి. మీదృష్టిలో నేను మనిషిని కాను. అంతమాత్రంచేత నాకు తరిగిపోయింది కూడా ఏమీ లేదు. తాబేలు తారే బతుకుతుంది. లేడి దూకే బతుకుతుంది అన్న సామెత విన్లేదూ?'' అంది సీత నిర్వికారంగా.

ooo

(సెప్టెంబరు 9, 1987లో ఆంధ్రప్రభ వారపత్రికలో తొలిసారి ప్రచురితం. ఆ తరవాత చాలా సంకలనాల్లో చేర్చుకున్నారు, నన్ను అడిగీ, అడక్కుండానూ.)

# 5. ఆనందో బ్రహ్మ!

ఇండియా వెళ్తే మనవాళ్లతో కన్నా రైళ్లలో గడిపేకాలం ఎక్కువ. ఆ మూలొకరూ, ఈ మూలోకరూ వుండి ఎంతో ఆప్యాయంగా పిలిచేస్తూంటారు రారమ్మంటూ. పదివేలమైళ్ల దూరంలో ఉన్న మనకి కావల్సింది అదే కనక కాదనలేం. ఆపైన కులదేవతలమాట సరేసరి.

నేను దక్షిణాది తిరుగుళ్లు ముగించుకని తూర్పు జైత్రయాత్రకి బయల్దేరేను జీటీలో. ఈ స్లీపరుకోచీలు పడ్డాక ప్రయాణం బాగానే ఉంటోంది. బెర్తుమీద తువాలు పరుచుకుని ఒళ్లో ఇండియా టుడే పడేసుకుని కాళ్లు ముడుచుకుని కిటికీలోంచి చూస్తూ కూర్చున్నాను.

హఠాత్తుగా నామోకాలిమీద ఏదో తగిలినట్టయి, ఇటు తిరిగేను. నామీదకి వాలి నామొహంలోకి ఓ చిన్నపాప చూస్తోంది కౌతుకంతో. అయిదారేళ్లుంటాయేమో.

నేను చిన్నగా నవ్వేను,

"నాపేరు సినీమాతార," అంది కళ్లు తిప్పుతూ.

"ఆఁహా," అన్నాను.

ఆ పిల్లవెనకున్న పిల్లాడు, రెండేళ్లుంటాయేమో, సీటుమీదికెక్కడానికి నానా తంటాలూ పడుతున్నాడు. నేను చేతులు పుచ్చుకు పైకి లాగేను. సీటెక్కగానే నాఒళ్లోకి వచ్చేశాడు కుర్రాడు. ఇద్దరూ నామొంలోకి చూస్తూ కబుర్లు మొదలు పెట్టేరు. వాళ్లమాటలు నాకట్టే అర్థం కాకపోయినా హావభావాలు చూసి ఆనందిస్తున్నాను.

"అయ్యయ్యో" అంటూ అవతలిసీటులో కూచుని పుస్తకం చదువుకుంటున్న తల్లి గబగబా వచ్చింది. అంతవరకూ చూడలేదేమో మరి.

‘‘ఏఁవనుకోకండి. పిల్లలకి బొత్తిగా కొత్తా పాతా లేదు,’’ అంది క్షమాపణలు చెప్పుకుంటూ.

‘‘ఫరవాలేదులెండి. పిల్లలంతే మరి,’’అన్నాన్నేను.

ఆవిడ నామొహంలోకి పరీక్షగా చూస్తూ, ‘‘యీయస్ మొహాలు ఇట్టే పట్టేస్తారు మాపిల్లలు వేటకుక్కల్లా,’’ అంది.

ఆ ఉపమానానికి నవ్వొచ్చింది నాకు. పిలల్లకంత చొరవెలా వచ్చిందో కూడా విశదమైంది.

పిల్లాడిని నాఒడిలోనుండి తీసుకోబోతే వాడు మరీ బల్లిలా అంటుకుపోయేడు నాఎదన.

ఆ తల్లిమొహంలో కించిదరుణిమ. తను కూడా నాకెదురుగా కూచుంటూ, నెమ్మదిగా మాట కలిపింది, ‘‘మాఅమ్మదగ్గర చేరిక,’’ అని, ఓక్షణం ఆగి, ‘‘మీకు కొంచెం మాఅమ్మ పోలికలున్నాయి.’’ అంది.

ఆవిడ పోయి ఆరునెలలయిందిట. పిల్లాడు అమ్మమ్మకోసం బెంగ పెట్టుకున్నాడు. చెల్లెలిపెళ్లికి వెళ్తోంది. ఆ అమ్మాయి తనచేతికింద పని చేస్తున్న అబ్బాయిని చేసుకుంటానని రెండేళ్లుగా పట్టు పట్టుక్కూచుంది. ఇంట్లోవాళ్లు ఇంతకాలం ఒప్పుకోలేదు. ఇప్పుడు తల్లి పోవడంతో, హడావుడిగా లగ్నం పెట్టేశారు. ఏడాదిలోపున కన్యాదానం చేస్తే ఆ తల్లికి పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయని.

మళ్లీ పిల్లాడిని అందుకోబోయింది. ‘‘ఫరవాలేదు లెండి,’’ అన్నాను బాబు వెన్ను నిమురుతూ.

‘‘మాఅమ్మపేరు కరుణ’’ అంది తార.

‘‘తమ్ముడిపేరేమిటి,’’ అన్నాను మాట కలుపుతూ.

‘‘వాడి అసలుపేరు చాలా పె … ద్ద …పేరు. కాని మేం శాంబాబు అంటాం,’’ అని, నామీదికి వొంగి, రహస్యం చెబుతున్నట్టు, ‘‘నేను చీంబాబు అంటాను,’’ అంది.

నేను చిన్నగా నవ్వి తలాడించాను అర్థమయినట్టు.

''వాగుడుకాయ. మీరు పొమ్మనాలి కానీ దానికి అదయి ఆపడం జరగదు,'' అంది కరుణ.

తార నాచేతిలో ఇండియా టుడే చూపిస్తూ, ''డాడీ,'' అంది.

నాకు తికమకయింది. నేను కరుణవేపు చూశాను. ఆ బొమ్మలో వ్యక్తికి తండ్రి పోలికలున్నాయేమో, నాకు వాళ్లమ్మ పోలికలున్నట్టు.

కరుణకి నా అనుమానం అర్థమయింది. ''లేదులెండి. వాళ్లనాన్నే,'' అంది నవ్వి.

బొమ్మ మళ్లీ చూశాను. ఆజానుబాహుడూ, ఆయతోరస్కుడూ, రావిశాస్త్రిగారు మందులభీముడిగురించి చెప్పినట్టు ఆరుగురు ఆడవాళ్లు హాయిగా నిద్రపోవచ్చు ఆ ఛాతిమీద. ఆపైన సహృదయుడూ, సంస్కారీ, ... ఎటెసెటరా .. అని చెబుతోంది అతనిమీద రాయబడిన ఆ వ్యాసం!

''మీకు తెలీదా?'' అనడిగింది కరుణ.

''తెలీదు'' అన్నాను.

మళ్లీ తనే అందుకుంది, ''ఆహ్, అమెరికాలో ఆయన్ని తెలీనివాళ్లు వుంటారనుకోలేదు.''

''మీ తిరుగు ప్రయాణం ఎప్పుడు?'' అనడిగేను మాట మారుస్తూ.

''ఎక్కడికి?''

''అదే ... అమెరికాకి?''

''నేనూ, పిల్లలూ ఇక్కడే వుంటాం,'' అంది మామూలు గొంతుతో, ''డిస్టెంటు రిలేషన్షిప్పులు మీఅమెరికాలో మామూలే కదా.''

రాష్ట్రాలు దాటిన సంబంధాలు విన్నాను కానీ సముద్రాలు దాటిన సంసారం చూడ్డం నాకు ఇదే మొదలు. ఆ ముగ్గుర్నీ మళ్లీ పరీక్షగా చూసేను. పట్టుమని ముప్పయ్యేళ్లుంటాయో ఉండవో! ఆయనక్కడ పొడసుత్తితో లోకం మరమ్మత్ చేస్తుంటే ఈవిడిక్కడ ఇద్దరు పిల్లలతో, ఓ చిన్నస్కూల్లో పంతులమ్మగా జీవనం సాగిస్తూంది.

నిదానంగా, తనలో తాను మాటాడుకుంటున్నట్టు చెప్పసాగింది, "పొరపాటు పడకండి. మమ్మల్ని చాలా ప్రేమగా చూసుకుంటారు. ఏడాదికోమారు తప్పకుండా వస్తారు. లేకపోతే పిల్లలు మరీ నాన్న అంటే గోడమీద బొమ్మ కాబోలు అనుకునే ప్రమాదం వుంది కదా. వచ్చినప్పుడల్లా వారంరోజులు తప్పనిసరిగా పిల్లలతో గడుపుతారు. ప్రతిసెలా తప్పకుండా కావలసినంత, నిజానికి కావలసిన దానికంటే ఎక్కువే పంపిస్తారు ..."

"నయమే," అన్నాను అంతకన్నా ఏమనడానికీ తోచక.

కరుణ లేచి వెళ్లి బుట్టలోంచి రెండు బత్తాయిపళ్లు పట్టుకొచ్చింది. ఒకటి నాచేతిలో పెట్టి, రెండోది ఒలిచి, పిల్లలకి తొనలు పెడుతూ, మళ్లీ కొనసాగించింది, "మొదట్లో నాకర్థం కాలేదు. అంతా అయోమయం. నాలుగుసెలలు తిరిగేసరికి తెలిసింది ఆయన జీవనసరళి. ఆ దేశంలో అడుగెట్టగానే మనవాళ్లు ఎవరెవరు ఎక్కడెక్కడ ఉన్నారో కనుక్కున్నారు. వాళ్ళేం చేస్తున్నారో కనుక్కున్నారు. వారి అవసరాలేమిటో, అంతస్థులేమిటో, ఆంతర్యాలేమిటో, ఇష్టాయిష్టాలేమిటో .. ఒకటేమిటి ... అడక్కండి, మొత్తం యూయస్‌లో తెలుగు తెరగులెల్ల వారికి కరతలామలకము."

నామొహంకేసి చూసి నవ్వింది, "హాఁ, హాఁ, నిజంగా కాదండీ. ఆయన పడే అవస్థలూ, చేసే ఆర్భాటాలూ చూస్తే అలా అనిపిస్తుంది ఎవరికైనా. పొద్దు పొడిచింది మొదలు అర్ధరాత్రివరాకూ ఫోనుమీదో, కారుమీదో, బారులోనో, సమావేశాల్లోనో సరిపోతుంది వారికి. త్రివిక్రముడి అష్టబాహువుల్లా సెల్ఫోనూ, వాల్ఫోనూ, కాల్ ఫార్వర్డూ,, కాల్ వెయిటింగూ, కాలరైడీ, బీపరూ, పేజరూ, ... ఇంకా ఏఁవొచ్చాయో ఈమధ్యకాలంలో మరి."

నాకు గందరగోళంగా అనిపించింది ఆ అమ్మాయిధోరణి. నిజం చెబుతూందా, నన్నూ, నా (అమెరికా) జాతినీ హేళన చేస్తూందా?

"మీరసలు అమెరికా వెళ్లలేదా?" అనడిగేను. ఆవిడ మమ్మల్నలా వెక్కిరించడం నాకు నచ్చలేదు.

అయ్యో, వెళ్లకపోతే ఎలా? ఆబోరు దక్కునా? కులంలోంచి వెలి కాదూ? వెళ్లేను. ఆరునెలలున్నాను. ఒల్లమాలిన సుఖాలు. కళ్లు తిరగేయి. మొహం మొత్తింది,"

"ఓపలేక వచ్చేసేరేమిటి?"

"లేదండీ. సుఖాలు వద్దనేవారెవరు? సుఖంగా ఉన్నంతసేపు బాగానే వుంటుంది."

కరుణ ఆగిపోయింది ఏదో ఆలోచిస్తున్నట్టు. నేనూ నిశ్శబ్దంగా చూస్తున్నాను గతసంచిక తరువాయి కోసం.

కరుణ అనంతాల్లోకి దృష్టి సారించి, తనకథ సాగించింది. అప్పటికింకా శాంబాబు పుట్టలేదు. తార ఒక్కతే సంతానం. ఆనందు తన వుద్యోగంతోనూ, తదితర వ్యాపకాలతోనూ తలమునకలై తిరుగుతూంటే, కరుణ ఇంటినీ, పిల్లనీ, వచ్చేపోయేవారినీ, చూసుకుంటూ కాలం గడుపుకుంటూండగా, ...

ఒకనాడు ...

అలవాటుగా మధ్యాహ్నంవేళ పాపని తోపుడుబండిలో వేసుకుని షికారుకి వెళ్లింది పార్కువేపు. పార్కులో ఉయ్యాలలూ, కొయ్యగుర్రాలూ అవీ వున్నాయి. ఆ చుట్టుపక్కలున్న మరో నాలుగైదు యిళ్లల్లో తల్లులు తమ పిల్లల్ని కూడా అక్కడికి తీసుకొస్తారు తరుచూ. ఆ కబురూ ఈ కబురూ చెప్పుకుంటారు. మన పల్లెల్లో నీలాటిరేవుదగ్గరో వీధివసారాలోనో నిలబడి మాటాడుకుంటున్నట్టు ఉంటుంది. అవే కబుర్లు టీవీలో అయితే మల్టీమిలియన్ డాలర్ బిజినెస్." కరుణ ఊపిరి తీసుకోడానికి క్షణం ఆగింది. "ఆ రోజు కూడా మామూలుగానే ఏవో కబుర్లు చెప్పుకుంటున్నాం పిల్లల్ని ఉయ్యాల్లో కూచోబెట్టి ఊపుతూ. అంతలో ధన్‌మని పెద్ద చప్పుడు. .. మొదట ఫ్లాట్ టైర్ కాబోలనుకుని అటు చూశాం అందరం. ... ధన్ ...

ఢామ్ .. ఢామ్... ఒక్క వుదుటున పిల్లనందుకుని .. ఉరుకులూ పరుగులూ .. హుటాహుటీ ... ఏమైంది .. అమ్మో ... రక్తం .. అయ్యో చిందరవందర .. ఎగిరిపడుతున్నవి అవేమిటి ... తొడతొక్కిడి ... పరుగో పరుగు .. పద .. పద .. గో ..

గో .. రన్ రన్ .. ఏడుపులు, పెడబొబ్బలు .. అయ్యో .. ఎవరది అక్కడ ఉమ్మచుట్టుకు .. రామా .. ఎవరు, ఎందుకిలా .. గంగవెర్రులెత్తినట్టు ... నలుగురు కుర్రాళ్లు ... పేల్చేస్తున్నారు తుపాకులతో ఏ కారణమూ లేకుండా .. విరగబడి నవ్వుతూ ... మారణహోమం ... దక్షయజ్ఞం .. నల్దిక్కులా .. ఏదీ సరిగ్గా కంటికానడం లేదు ...

కరుణ ఇంటికెలా వచ్చి పడిందో తెలీదు. తలుపెలా తీసిందో తెలీదు. మెదడుకందడంలేదు జరిగిన ఘోరం. .. భగవంతుడా! ఎక్కడున్నావు? ఏవండీ! ఆనందూ! ఎక్కడున్నారు? మనపిల్ల! ఏరీ ... అమ్మా .. నాన్నా .. అన్నయ్యా, చిన్నప్పటి సుందరీ, పక్కింటి రమణ, ఎక్కడున్నారర్రా మీరంతా .. ఇంతబతుకూ ఇందుకా?

గడగడ ఒణికిపోతూ ఓమూలకి నక్కి కూచుంది కరుణ పాపని గుండెల్లోకి పొదువుకుని.

ఎంతసేపో! .. ఆఖరికి, కొన్ని యుగాల అనంతరం ఆనందు వచ్చేడు. కారురేడియోలో విన్నాడుట విషయం. ఆవేళప్పుడు కరుణ పాపని తీసుకుని పార్కుకి వెళ్తుందని అతనికి తెలుసు. అంచేత హడావుడిగా ఇంటికొచ్చేడు.

“హమ్మయ్య, మీరిద్దరూ బాగానే వున్నారు కదా. ఎంత భయపడిపోయేనో తెలుసా?” అన్నాడు.

కరుణ అయోమయంగా చూసింది అతడివేపు.

“నీకేం అవలేదు కదా. పాపకేం దెబ్బలు తగల్లేదు కదా. అయినా ట్రోమా వుంటుంది. సైకియాట్రిస్టుతో అపాయింటుమెంటు తీసుకో. నేను వెళ్లాలి. అంగోలాలో ఆర్తులకోసం నిధులు వసూలు చేస్తున్నాం. మధ్యలో వచ్చేశాను. నేనక్కడ లేకపోతే ఆరునెలలుగా పడ్డ పాటు గాలిక్కొట్టుకుపోతుంది,” పాఠం ఒప్పచెప్పినట్టు గబగబా నాలుగుముక్కలు వల్లించేసి, వెళ్లిపోయాడతను.

కరుణకి ఆ క్షణంలో తెలివొచ్చింది. సకల సౌకర్యాలూ, అష్టయిశ్వర్యాలతో తులతూగే ఈ సంపన్నదేశంలో తమకి తక్కువయిందేమిటో అర్థమయింది అప్పుడు!

‘‘నేనిక్కడ వుండలేను. పదండి. ఇండియా పోదాం,’’ అంది కరుణ ఆనందుతో.

కొంతకాలం వాదోపవాదాలు అయింతరవాత, ‘‘సరే, నువ్వు ముందెళ్లు. నేను ఇక్కడ పనులు ముగించుకుని, మరో వుద్యోగం అక్కడ చూసుకుని వస్తాను,’’ అన్నాడతను.

తాను నెగ్గలేనని తెలుసుకుని ఆవిడ వచ్చేసింది. అయిదేళ్లయింది. అతనింకా తనపనులు ముగించుకుంటూనే వున్నాడు అమెరికాలో ....

‘‘ఇంట్లో భార్యనీ బిడ్డనీ పట్టించుకోకుండా అంగోలాలో ఆర్తులసేవా?’’ అన్నాను, నా చిరాకును దాచుకుంటూ.

‘‘మీరింకా పెరటిదోవనే వున్నారు ఆంటీ.  వీళ్లకేదో హృదయం వుందనీ, దానితో వాళ్లు సదసద్వివేచన చేస్తారనీ మీ ఆశ,’’ అంది కరుణ నా అమాయకత్వానికి జాలిపడుతున్నట్టు.

‘‘అంతేనంటావా?’’

‘‘హయ్యో రామా! ఆయనే వుంటే ... అని ఏదో సామెత చెప్పినట్టు .. కొందరికి హృదయం వుండాల్సినచోట వొట్టి డొల్లండీ. వారికి కావల్సిందంతా ఆడంబరం. అంతే.’’

‘‘అందరూ అంతేనంటావా?’’

‘‘అందరూ అననులెండి. ఉంటారు నూటికో కోటికో ఒకరు నిస్వార్థపరులు. చాలామందిది మాత్రం బుట్టబొమ్మల అట్టహాసమే. నిజం చెప్పాలంటే వీరి అభిమానాలూ, ఆత్మీయతలూ కూడా నాలుకచివరన ఉంటాయంతే. తియ్యగా మాటాడతారు. ఆ తీపికి చుట్టూ చేరే చీమలూ, భజనసంఘాలూ, ..అదుగో అలాటి భజన రాతలూను.’’ అంది నాచేతిలో పత్రికని కొనకళ్ల చూపిస్తూ.

అమాయకంగా కనిపించినా ఘటికురాలే అనిపించింది, ‘‘అయితే అలాటివాళ్లు పెళ్లెందుకు చేసుకుంటారూ?’’ అన్నాను ఏం చెప్తుందోనని.

‘‘అదొక లాంఛనం అనుకోండి. కుస్తీపట్లకి ముందు కరచాలనం చేసుకున్నట్టే. కుటుంబం కూడా శ్రీవారిముద్రలాటిదే.  ... కుటుంబరావుగారనుకుంటా అన్నట్టు

జ్ఞాపకం - స్త్రీజాతిని ఉద్ధరించడానికి సిద్ధాంతరీత్యా ఆసక్తిగలవారిలో కూడా కొందరికి స్త్రీలపట్ల నిరసన వుండవచ్చు అని.[1] ముఖ్యంగా ఇంట్లో ఆడవారిపట్ల. ఆడగొంతుల పట్ల ఆసక్తి ముదిరితే ఈడ గొంతులు వినిపించవు. ఈ సంఘసేవకులంతా అటు లోకంలో ఆడవాళ్లందర్నీ ఉద్ధరించే హుషారులో ఉండి, అదే సమయంలో తమ సొంత కొంపలు గుణ్ణం అయిపోతున్నాయని గ్రహించుకోరు.''

ఆ అమ్మాయి చతురతకి అబ్బురపడక తప్పదు.

``గోదావరి వస్తూంది. వంతెనమీద బండి పోతూంటే నండూరివారు చెప్పినట్టు గుండె గొంతుకలోన కొట్లాడతాది. ఎన్నిసారులు చూసినా తనివి తీరదు. ఆనందు గోదావరిలో దిగమంటాడు. మీరు చెప్పండి గోదావరిలో దిగనా? రాజమండ్రిలో దిగనా?'' అంది నావేపు చిలిపిగా చూస్తూ. కళ్లలో చమకులు, అధరాల దరహాసం. నవ్వేవారిని చూసి నవ్వుతోందా? నేనే నా పైత్యం ముదిరి వెర్రిఆలోచనలు చేస్తున్నానా? కకామ్మ కథలు అల్లుకుంటున్నానా?

``యూ స్టుపిడ్.''

ఇద్దరం ఒకేసారి ఉలికిపడి అటు తిరిగి చూశాం. ఎదటిబెర్తుమీద ఆవిడని మేం ఇంతవరకూ గమనించనేలేదు. ఆవిడ మాత్రం మామాటలు వింటోంది అని ఇప్పుడే అర్థమయింది మా ఇద్దరికీను.

``అతనలా నాటకాలాడుతూంటే నువ్విక్కడిలా నోరు మూసుక్కూచున్నావా?'' అంది ఆవిడే మళ్లీ.

``ఏమిటి మీరనేది?'' అనడిగింది కరుణ.

``నిన్నూ పిల్లలనీ ఇక్కడ గాలికొదిలేసి అతనక్కడ జల్సాలు చేస్తూంటే నువ్వెలా వూరుకున్నావూ అని. నేనయితే అతగాణ్ణి కోర్టుకీడ్చి ముప్పతిప్పలూ పెట్టి మూడు చెరువులనీళ్లు తాగించేదాన్ని,''

---

[1] కొడవటిగంటి కుటుంబరావు. స్త్రీనిరసనపట్ల వ్యాఖ్య. ఆంధ్రజ్యోతి వారపత్రిక. లోకాభిప్రాయం. 28 జనవరి 1977 పుట 2.

కరుణ మాటాడలేదు. ఆ మనసులోమథన ఏమిటో పోల్చుకోడం కష్టం.

నేను ఆ ఎదటిమనిషివేపు ఆసక్తిగా చూస్తున్నాను. నలభైకి పైనే ఉండొచ్చు, కట్టిన కంచి పట్టుచీరా, నిలువెల్లా వజ్రవైఢూర్యాలూ ఆమె ఐశ్వర్యాన్ని చాటుతున్నాయి. కనకమహాలక్ష్మిలా సుఖాసీనరాలై తన ఔన్నత్యాన్ని చాటుకుంటోంది.

"నీలాటి మెతకమనుషులు ఉండబట్టే మొగాళ్ల ఆటలు చెల్లుతున్నాయి. అతనేం చేస్తున్నాడన్నావూ? ఇంజినీరా? ఎంత సంపాదిస్తున్నాడో తెలుసా?"

"మీకు తెలుసా?"

"నాకేమిటీ, ఎవరినడిగినా చెబుతారు. ఖచ్చితంగా కాకపోయినా అజ్జాయింపుగా చెప్పగలను,"

"నేను ఖచ్చితంగానే చెప్పగలను," అంది కరుణ సీదాగా.

"ఇంకేంమరి. నాకు తెలిసిన లాయరొకాయన వున్నారు. పిలిచి మాటాడు. రాస్కెల్ని అంత తేలిగ్గా వదలకు. అతనిసంపాదనలో నీకెంత హక్కుందో తెలుసా?"

మేం ఇద్దరం తెల్లబోయాం. పెద్దయుద్ధానికే సిద్ధమవుతోందావిడ. కరుణకి అదేమంత రుచికరంగా లేదన్నది తేటతెల్లమే!

"మాకు డబ్బుకేం కొదవ లేదండీ. బాగానే పంపిస్తారు," అంది కరుణ.

కనకమహాలక్ష్మి వదిలిపెట్టేట్టు లేదు. "నొల్లుకబుర్లు కట్టిపెట్టు. నువ్వు అమెరికాలోనే ఎంతవుతుందో, ఆ ఖర్చులో అర్థ కూడా నీకు ముట్టడంలేదు తెలుసా. అక్కడి సౌకర్యాలు ఇక్కడేవీ? హుమ్. డబ్బిస్తున్నాడు ఉంపుడుకత్తెకి ఇచ్చినట్టు."

తుళ్లిపడ్డాన్నేను. గుండెలు దడదడ కొట్టుకున్నాయి రైలుచక్రాలతో సమంగా.

ఆదమరిచి రాయి విసిరింది మూర్ఖురాలు.

తగలరాని చోట తగిలింది ఆ చిన్నదానికి.

నా ప్రాణం చివుక్కుమంది.

కరుణ మౌనంగా లేచి, చీరెకుచ్చిళ్లు సరిచేసుకోసాగింది.

ఎదటిసీటులో ఆడమనిషి అంతటితో పోనివ్వలేదు. "కన్నబిడ్డల్ని దిక్కుమాలినాళ్లలా ఒదిలేసి, వూరివారిని సాకుతూంటే చూస్తూ వూరుకుంది పిచ్చిమొహం."

కరుణ చివ్వున తలెత్తి చురుగ్గా చూసింది ఆవిడవేపు. "నేనుండగా నాపిల్లలు దిక్కుమాలినవాళ్లెలా అవుతారు?"

ఆ మహాఇల్లాలు ఏమనుకుందో మరి మాటాడలేదు.

"స్టేషనొస్తోంది. సామాను దింపుకోవాలి," అంది కరుణ నా ఒడిలోనించి బాబుని అందుకుంటూ. "దా. మామయ్య వస్తాడు." మామయ్యపేరు వినగానే శాంబాబు తల్లిచేతుల్లోకి ఇట్టే మారిపోయాడు గూడు చేరబోయే గువ్వపిట్టలా.

"స్టేషనుకెవరైనా వస్తారా?" అనడిగేను. నాకు ఎలాగైనా మళ్లీ మాట కలపాలని తహతహగా వుంది. సామాను అట్టే లేకపోయినా పిల్లలతో దిగాలికదా.

"మాఅన్నయ్య వస్తాడండీ," అంది ఉత్సాహంగా కరుణ కూడా అదే అవకాశంకోసం చూస్తున్నట్టు.

రాజమండ్రిలో రైలాగింది. అన్నగారు వీళ్లకోసం ఎదురుచూస్తున్నాడు. ముందు పిల్లల్ని అందించి, తరవాత సామాను అందించి, తనూ దిగింది, వెళ్లొస్తానని నాకు చెప్పి.

ప్లాట్‌ఫారంమీద నాలుగడుగులు వేసి, గిరుక్కున వెనుదిరిగి, నా కిటికీదగ్గరకొచ్చి, "మీరడగలేదేం?" అంది.

"ఏమని?"

"నాకూ ఉంచుకున్న మనిషికీ తేడా ఏమిటని?"

ఛెళ్లున కొరడాతో కొట్టినట్టు తుళ్లిపడ్డాను. రైలు కదుల్తోంది. "నీతత్త్వాన్నిబట్టీ, నీసంస్కారన్నిబట్టీ నీకూ నీ పిల్లలకీ తగిన నిర్ణయం నువ్వు తీసుకున్నావు. ఆవిడసంస్కారానికి తగ్గట్టు ఆవిడ మాటాడింది. ఒడ్డున కూచుని ఈతమీద ఉపన్యాసాలు ఇవ్వడమంత తేలిక మరోటి లేదు," అన్నాను.

‘‘ప్రయాణం బాగానే జరిగిందా? కుంకలిద్దరూ వేపుకు తిన్లేదు కదా నిన్ను’’ అంటూ కుశలప్రశ్నలేస్తున్న ఆ అన్నగారినీ, ఆ కుటుంబాన్నీ కనిపించినంత మేరా చూశాను, కిటికీవూచలకి నుదురు కొట్టుకుంటుంటే.

మొత్తమ్మీద దేశాటన ముగించుకుని కొంప చేరుకున్నాను మూడువారాల తరవాత. ఇంటికొచ్చేసరికి ఆన్సరింగ్ మెషీనుమీద పదిహేను మెసేజీలున్నాయి. అందులో నాలుగు సురేఖనుంచే. ముందు ఇంట్లో పనులు చూసుకుని, పిలుద్దాం అనుకుంటుండగానే, మళ్లీ ఫోను మోగింది. మళ్లీ సురేఖే!

‘‘బావున్నావా?’’ అన్నాను యదాలాపంగా.

‘‘బాగానే వున్నానండీ,’’ అంది నీరసంగా. అందులో బాగానే ఉన్నధ్వని లేదు.

‘‘నిజం చెప్పు. మళ్లీ ఏమైనా గొడవలు జరిగేయా?’’ అన్నాను నాపెద్దరికం నిలబెట్టుకుంటూ.

‘‘మీరెప్పుడొస్తారాంటీ?’’ అంది దాదాపు ఏడుపుగొంతుతో.

కొంపలు మునిగినట్టే వుంది. ఏంచెప్పను? తెల్లారితే ఆఫీసు. ఉన్న శలవంతా ఇండియా ప్రయాణానికి అయిపోయింది.

‘‘నాలుగురోజులు ఓపిక పట్టు. శనివారం తప్పకుండా వస్తాను’’ అన్నాను.

‘‘సరేనండీ.’’

‘‘మునుపోసారి ఎవరో బ్రహ్మంగారు వస్తూ ఉండేవారన్నావు. ఆయన రావడం లేదేమిటి ఇప్పుడు?’’

‘‘ఈమధ్య ఆయన కూడా రావడం తగ్గించేశారు. నాలుగుసార్లు పిలిస్తే ఒకసారి కనిపిస్తారండీ మొక్కుబడిలాగ. ఆయన ఎదురుగా వున్నంతసేపూ ఈయన కుదురుగానే వుంటారు. అయినా తాటిచెట్టు ఎక్కేవాణ్ణి ఎంతకని ఎగసన తోస్తాం?’’

అనుకున్నట్టుగానే శనివారం పొద్దున్నే లేచి బయల్దేరేను. కారులో వెళ్తే నాలుగ్గంటలు, విమానం ఎక్కితే రెండువందల డాలర్లు. అంచేత నాకు కారులో వెళ్లడమే తేలిక. అక్కడికి చేరేవేళకి వీరన్న కూడా ఇంట్లోనే వున్నాడు.

సురేఖా, వీరన్నా ఇద్దరుపిల్లల్తో ఈ దేశం వచ్చి ఏడాదవుతోంది. రాగానే అందరు తెలుగువారిలాగే, మనవాళ్ల గురించి వాకబు చేస్తుంటే గాలివాటుగా నేను తగిలేను. మామధ్య పెద్ద చుట్టరికమేమీలేదు. వంశక్రమం తిరగతోడితే, ఏ బీరకాయపీచు సంబంధమో దొరుకునేమో. నేనంతగా పట్టించుకోలేదు. పుట్టినరోజులకీ, పండుకలకీ పబ్బాలకీ పిలుస్తూంటుంది. ఆ అమ్మాయి పిలిచినప్పుడు వెళ్లి నాలుగు మంచిమాటలు చెప్పి కాలక్షేపం చేసి వచ్చేస్తుంటానంతే.

వాళ్ళు వచ్చి నాలుగునెలలయినా తిరక్కముందే కలతలు ప్రారంభమయేయి. ఇంతా చేస్తే పెద్ద తగువులేమీ కాదు. వడ్లగింజలో బియ్యపుగింజ. దేశం కానీ దేశం. తెలుగు తప్ప మరోభాష రాదు సురేఖకి. పెద్దకుటుంబంలో మసలిన పడచు. బిక్కుబిక్కుమంటూ రోజంతా ఇంట్లో ఒక్కత్తీ కూచోడం విసుగు. వీధిలోకెళ్లడానికి భయం. వీరన్న ఏమంత అభ్యుదయ భావాలు కలవాడు కాడు.

‘‘ఇంట్లో ఊరికే కూచుంటే నాకేమీ తోచడంలేదు. డ్రైవింగ్ నేర్చుకుంటాను,’’ అంది సురేఖ.

‘‘ఎందుకూ? నేను తీసుకెళ్తాను కదా ఎక్కడికి కావలిస్తే అక్కడికి. బోలెడు ఇన్సూరెన్సు. అదో ఖర్చు ఎందుకూ, దండగ,’’ అన్నాడతను. ఇల్లూ, పిల్లలూ, ఇంట్లో టీవీ, ఎడతెగకుండా వచ్చే పోయే అతగాడి స్నేహబృందం - ఇన్ని వుండగా ఆడదానికి తోచకపోవడం ఏమిటి అని అతనికి ఆశ్చర్యం.

‘‘సిగపూవు వాడకుండా, కడుపులో చల్ల కదలకుండా, ఇంట్లో కూచోమంటే నీక్కష్టంగా వుందా? నేనైతే రాజెవరికొడుకన్నంత ధీమాగా కూచుంటాను. వీధిలోకెళ్లి అడ్డమైనవాళ్లకీ ఒంగి ఒంగి సలాములు కొట్టుకుంటూ ప్రతి క్షణం ఉంటుందో ఊడుతుందో తెలీని ఉద్యోగంకోసం వెంపర్లాడుతూ గడుపుకురావడం ఎందుకోసం? నీకోసం, నీపిల్లలకోసం కాదూ? బుద్ధి గడ్డితిని మీ భారం నెత్తినేసుకున్నట్టున్నాను,’’ అన్నాడోసారి విసుక్కుంటూ. ఆ పైన, అంతగా తోచకపోతే పక్కింటి పిల్లల్ని బేబీసిట్ చెయ్యమన్నాడు. కాలక్షేపంగానూ వుంటుంది, నాలుగురాళ్లు కళ్ల చూస్తాం కూడాను

అని చెప్పేడు. అదీ కాకపోతే మరో పాపనో బాబునో మనమే కందాం అన్నాడు ముచ్చట పడిపోతూ.

సురేఖ మరి మాటాడలేదు.

ఆ రోజుల్లోనే బ్రహ్మంగారితో పరిచయమయింది. కొత్తలో నెలకోమారుగా మొదలయి, క్రమంగా వారానికోమారు, నాలుగురోజులకోమారు ... ఇంచుమించు రోజూ కనిపించడం, వీళ్లింట్లోనే భోజనాలూ అయిపోయింది అనతికాలంలోనే. అదే సమయంలో వీరన్నకి ఉద్యోగం పోవడం, మరొకటి దొరక్క మనశ్శాంతి లోపించడం, దాంతో ఇల్లాలిమీదా, పిల్లలమీదా కసుర్లూ, విసుర్లూ - వీటన్నిటిమధ్యా బ్రహ్మంగారి రాక ఒక వరమే అయింది ఆ దంపతులకి. వీరన్న బయట ఉద్యోగంకోసం పడే అవస్థలు సురేఖకీ, సురేఖఅశాంతికి కారణాలు వీరన్నకీ వివరంగా బోధిస్తూ, సమయానికి తగుమాటలాడుతూ వారికాపురం నిలబెట్టి ఒక సత్కార్యం సాధించేరు బ్రహ్మంగారు. వారిద్దరికీ ఆయన తల్లీ, తండ్రీ, గురువూ, దైవం, హితుడూ, సఖుడూ కూడా అయిపోయారు.

ఏదో మాటలసందర్భంలో సురేఖ నాకు ఈ సంగతులన్నీ చెప్పినప్పుడు నాకెందుకో చిత్రంగా అనిపించింది.

''ఆయనకేం ఇల్లూ, వాకిలీ, పెళ్లాం, పిల్లలూ లేరేమిటి?'' అన్నాను.

''ఉన్నార్ట,'' అంది సురేఖ. ఎక్క డ? అని తనూ అడగలేదు, నేనూ అడగలేదు!

సురేఖతో కొంచెసేపు మాటాడి, పిల్లలు గోల చేస్తున్నారని మాల్‌కి బయల్దేరేం. అక్కడ తిరుగుతుండగా, పిల్లలు, ''బామా అంకుల్'' అంటూ అరిచేరు. నేనూ, సురేఖా అటుతిరిగి చూసేం.

పిల్లలిద్దరూ ఆయనకాళ్ల చుట్టేశారు. వాళ్లకి ఆయనదగ్గిర బాగా చనువున్నట్టే కనిపించింది. ఆయన మాత్రం అంతగా ఆనందించినట్టు కనిపించలేదు.

''ఏమిటి అంకుల్! మీరసలు కనిపించడమే లేదు. మాకేం బాగులేదు,'' అంది సురేఖ.

“లేదమ్మా. ఈమధ్య పనులతో తీరడంలేదు. వస్తాను. వీరన్న బావున్నాడా? ఉద్యోగం దొరికిందా?” అని, పక్కనున్న అమ్మాయివేపు తిరిగి, “మనవాళ్లే. నీ తరవాత, అంతటి ఆప్తురాలనుకో సురేఖ,” అన్నారాయన.

నాకెందుకో ఈ సంభాషణ అంతా తెచ్చిపెట్టుకున్నట్టుగా అనిపించసాగింది. బ్రహ్మంగారు కూడా ఎప్పుడెప్పుడా అని దిక్కులు చూస్తున్నారు.

సురేఖ అది గమనించిందేమో, “వీలయినప్పుడు రండోమారు,” అని ఆయనతోనూ, “పోదామా” అని నాతోనూ ఒకేవాక్యంలో స్వస్తి చెప్పేసింది ఆ సంభాషణకి, ఇంక భరించలేనట్టు.

దారిపొడుగునా ముభావంగానే వుంది. ఇంటికి చేరగానే ఫ్రిజ్‌లో వున్నవి మైక్రొవేవ్‌లో వెచ్చబెట్టుకుని భోజనాలు అయిందనిపించేం. పిల్లలు వాళ్ల గదుల్లోకి వెళ్లిపోయినతరవాత, “ఇప్పుడు చెప్పు,” అన్నాను సురేఖతో.

“ఏం చెప్పను?”

“ఏదో ఆలోచిస్తున్నట్టు వున్నావు. ఏమిటదనీ?”

“ఏం లేదాంటీ. బ్రహ్మంగారిమాటే ఆలోచిస్తున్నాను.”

“అదే, ఏమిటని?”

“అదే .. ఇందాకా మాల్లో - ‘నీతరవాత నీ అంతటి ఆప్తురాలు’ అన్నారే .. అది”

నేను నవ్వేశాను. “ఈర్ష్యా?” అంటూ.

సురేఖ నవ్వలేదు. “అది కాదండీ. మేం ఆయన్ని కలుసుకున్న తొలిరోజుల్లో సరీగ్గా ఇలాటిసంఘటనే జరిగింది. అప్పట్లో ఆయనప్రక్కన వున్నది నేనూ,” అంది సాలోచనగా.

సురేఖ ఆలోచిస్తున్నది ఎవరు ఆయనకి ఎక్కువ అని కాదు. బ్రహ్మంగారితత్త్వంగురించే అన్నమాట.

మరో పదినిముషాలు ఆ మాటా ఈ మాటా చెప్పి తనగదికి వెళ్లిపోయింది, పడుకోండి అంటూ.

నేను మాత్రం ఆ బ్రహ్మంగారి తత్త్వంగురించే ఆలోచిస్తూ వుండిపోయాను చాలాసేపు.

కొందరు ప్రతివారితోనూ ఆప్యాయంగానే, ప్రాణం పెట్టినట్టే మాటాడతారు, నిజంగా ప్రాణం పెడతారా అంటే ఏమో! ఒకరి తరవాత మరొకరిని - కష్టాల్లో వున్నవారిని ఆదుకోడమే వారి ఉద్యోగంగా - క్రెడిట్‌కార్డుమీద బతికినట్టు. అలా ఆదుకుంటూ పోవడంలో కొన్ని సదుపాయాలున్నాయి. మోకాటిలోతు నీటిలో ఈతలాగ. గట్టిగా భవబంధాలు చుట్టుకోవు. అలాటి బంధనలు ఏర్పడే సూచనలు కనిపించగానే విదిలించుకు లేచిపోతారు. అది ఒకవిధమైన పిరికితనం కావచ్చు. పొరిగిళ్ల సరదాగా కాలక్షేపం చేస్తూ తిరిగే నిక్షేపరాయుళ్లని ఎవరినయినా చూడండి. అక్కడ వారు చూపే హుషారు అంతా ఇంతా కాదు. ...

హుషారనగానే గుర్తుకొచ్చింది ఇండియాలో ఆనందుసంగతి. ఆ ఆనందే ఈ బ్రహ్మం కాదు కదా?! కావచ్చు.

కరుణ చెప్పినకథకీ సురేఖ చెప్పినకథకీ చాలా సామ్యం వుంది. ఆ పత్రికలో బొమ్మ నేనంతగా పట్టి చూడలేదు కానీ వాళ్లు ఏ పాతబొమ్మో ప్రచురించి వుండవచ్చు. జె.బి. ఆనంద్ అని చూసినట్టు గుర్తు. అది జొన్న బ్రహ్మానందం కావచ్చు!

ప్రాణి కోరేది సుఖమూ, శాంతీ .. వాటికోసమే నానా తాపత్రయాలూను. ఓపక్క తనసుఖం, మరోపక్క పక్కవాడిఅండా కూడా కావాలి. ఈ రెంటికీ చుక్కెదురైతే?

వ్యవస్థ ఏర్పడినప్పుడే నియమాలూ ఏర్పడ్డాయి. పొరుగువాడు సుఖంగా ఉంటేనే మనకీ సుఖం అన్న నీతి కావచ్చు. మతంపేరుతో పరలోక సుఖాలు ఎర చూపినా, ప్రజాస్వామ్యం పేరుతో ఇహలోక సుఖాలు అందించినా రెండిటి ఆంతర్యం ఒకటే. ఆ మతమూ, ఈ ప్రజాస్వామ్యమూ చేసిన కట్టడికీ సొంత సుఖాలకీ పొంతన కుదరకపోతే అడ్డదారులూ, చుట్టుదారులే శరణ్యం. ఎలా చూసినా తన సుఖంకోసమే నానా అవస్థలూ అనిపిస్తోంది ...

అక్కడ కరుణా, ఇక్కడ సురేఖా, వీరన్నా, ఆనందూ, బ్రహ్మంగారూ లేక బ్రహ్మానందం - వీరందరిలో ఎవరు ఎవరికి ఆలంబన అంటే ఆ పరబ్రహ్మమే చెప్పాలి.

ఆహా! ఆనందో బ్రహ్మ!

OOO

(ఏప్రిల్ 2003. తొలిసారిగా వార్త ఆదివారం అనుబంధంలో ప్రచురించబడింది.)

# 6. చివురుకొమ్మ చేవ

‘‘మామ్మీ,’’ అంటూ పరిగెట్టుకుంటూ వచ్చింది కింజల్క స్కూలినించి

‘‘అబ్బ ఎందుకలా మీద పడతావు,’’ అని విసుక్కుని మళ్ళీ చిన్నబోయిన ఆ మొహం చూసి, ‘‘దా’’ అంటూ దగ్గరకి తీసుకుంది శారద.

అవును మరి. దానికెలా తెలుస్తుంది తన మనోవేదన! తను మాత్రం ఎలా చెప్పగలదు

‘‘నీకోసం వేశా చూడు,’’ అంటూ స్కూల్లో వేసిన బొమ్మ చూపించింది.

‘‘అబ్బో, చాలా బాగుంది. ఫ్రిజ్ మీద పెడతాను,’’ అంది శారద కింజుని గుండెలకి హత్తుకుని.

కింజల్క మొహం విరిసిన దిరిసెనపూవులా విప్పారింది.

పిల్లలకేముంది బావుందన్న ఒక్క మాట చాలు. ఏ వస్తువాహనాలూ ఇవ్వలేని ఆనందానికి ఆ ఒక్కమాటా చాలు.

‘‘మీ అమ్మ టెలిగ్రాం ఇచ్చారు,’’ అంటూ మురారి లోపలికి వచ్చేడు.

‘‘టెలిగ్రామా?’’

ఇద్దరికీ వింతే ఉరుము లేని పిడుగులా.

‘‘నెలాఖరికి వస్తున్నారుట.’’

శారద మాటాడలేదు.

‘‘రావొద్దని చెప్పు.’’

‘‘ఆఁ?’’ అంది శారద తెల్లబోయి.

‘‘అది కాదు ...’’ అతను మాట పూర్తి కాలేదు.

శారధ అందుకుంది, "పదేళ్ళయింది. ఇల్లు రాదారి బంగళా. వారాలబ్బాయిల్లా మీ స్నేహితులు. మూడో విస్తరి వెయ్యని శనివారం లేదు. ఈనాటికి నావంక మనిషి, అందునా మా అమ్మ వస్తానంటే రావొద్దని రాయనా?"

"మీ అమ్మగారని కాదు. ఈ పరిస్థితుల్లో ఆవిడకి మాత్రం ఏం బాగుంటుందని?"

"అమ్మమ్మ వస్తోందిట," అంది శారద పాపతో.

"నిజింగ. ఎప్డు?" అంది ఉత్సాహంగా కింజు. అమ్మమ్మతో గడిపిన రోజులు తక్కువే అయినా వచ్చే పోయేవారిద్వారా ఆవిడ పంపే కానుకలమూలంగా సుపరిచితమే.

"ఏం? నువ్విస్తావా, నేనివ్వనా టెలిగ్రాం?" అన్నాడతను రొక్కిస్తూ.

"ఇవ్వను" అంది శారద కింజల్కమొహంలోకి చూస్తూ. ఆ పిల్లమొహం వన్నె తరిగింది. ఓ క్షణం ఊరుకుని "కింజు వేసింది," అంది బొమ్మ చూపుతూ.

"చాలా బాగుంది. నువ్వు గొప్ప ఆర్టిస్టువి అవుతావు. మావంశంలోనే ఉంది కళ. మా పినతాతగారి బావమరిది గొప్ప కళాకారుడు," అన్నాడు మురారి మురిసిపోతూ.

"నీకు రేపు వేస్తాను డాడీ," అంది కింజల్క తనకి పక్షపాతం లేదని తండ్రికి తెలిసేట్టు.

"ఫ్రిజ్ మీద పెడతాను కదా. అది అందరికీను." అంది శారద.

"దా. బజారుకెళ్దాం."

ఇప్పుడెందుకంటే పుట్టింరోజు వస్తోంది కదా అన్నాడు.

"ఇప్పుడే కాదు యూ సిల్లీ," అంది కింజల్క కళ్ళు చిట్లించి.

"నాకూ తెలుసులే. మరి అప్పుడు నేను ఊళ్ళో ఉండనేమోనని."

శారద నిట్టూర్చి అక్కడినించి లేచిపోయింది.

000

అమ్మ అనుకున్న రోజుకి వచ్చింది. శారదే ఎయిర్పోర్టుకి వెళ్ళి తీసుకొచ్చింది.

తలుపు తీస్తూనే "అముమా" అంటూ కాళ్ళ చుట్టేసింది కింజల్క.

అమ్మమ్మమొహంలో దీప్తి. అలాటి క్షణంకోసం ఆవిడ ఎన్నివేల మైళ్ళయినా పయనించగలదేమో!

"ఇలా చిక్కిపోయేవేమిటే? ఏం పెడుతోంది మీ అమ్మ నీకు?" అందావిడ ఆప్యాయంగా పిల్లదాని చెంపలు నిమురుతూ.

కింజల్క కిలకిలా నవ్వింది, "ఐ టోల్యూ."

అమ్మ దానిగడ్డం పుచ్చుకుని, "ఇదుగో ఈ కీసరబాసర బాస నాకు తెలీదు. నాతో చక్కగా తెలుగులోనే మాటాడాలి తెలిసిందా?" అంది.

"ఓకే" అంది పాప భుజాలు కుదిపి.

శారద నవ్వుతూ, "మనవాళ్ళు అస్తమానం చిక్కిపోయేవు చిక్కిపోయేవు అంటారని నవ్వు దానికి," అని వివరణ ఇచ్చి, "పద బాత్రూం చూపిస్తాను" అంది లోపలికి నడుస్తూ.

అమ్మ స్నానం చేసి వచ్చేసరికి శారద కాఫీ సిద్ధం చేసింది.

అమ్మ కాఫీ తాగి, పెట్టె తెరిచి, చీరా, పంచెలచాపూ, పిల్లకి పట్టు పరికిణీ, గాజులూ గొలుసులూ ఒక్కొక్కటే తీస్తుంటే పిల్లదాని మోమున ఉత్తుంగతరంగాలు ... శారద ఎదలో పోట్లు. ..

"ఇప్పుడివన్నీ ఎందుకమ్మా?" అంది నొప్పిని అణుచుకుంటూ.

మురారి చిటపటలాడుతూ లేచి వెళ్ళిపోయేడు.

అమ్మ మాటాడలేదు.

000

అమ్మ వచ్చిందగ్గర్నుంచీ కింజల్క ఆటలూ, పాటలూ, తిండీ, తిప్పలూ అన్నీ ఆవిడే చూసుకుంటోంది.

ముందుగదిలో శారద కూచుని పేపరు చూస్తోంది.

అమ్మ పిల్లకి పాట నేర్పుతోంది.

*చిట్టీ చిలకమ్మా! అమ్మ కొట్టిందా?*

*తోటకెళ్ళేవా? పండు తెచ్చేవా?*

*గూట్లో పెట్టేవా? గుటుక్కు మింగేవా?*

కింజల్కకి పాట బాగా నచ్చింది. త్వరగానే నోటికొచ్చేసింది. మరికొంత తన కవిత్వం కూడా జోడించి ఇల్లంతా తిరుగుతూ పాడుతోంది.

***చిట్టీ చిల్కమా కింజల్కమా*** అంటూ పాడుతుంటే అమ్మమ్మ దాన్ని సరిదిద్దబోయింది అది కాదే అంటూ ...

"నాకిదే బాంది. మామీ నో కొత్తుతూ ..." అంది కింజల్క బుంగమూతి పెట్టి.

"దానితో వాదించి నువ్వు గెలవలేవులే," అంది శారద గోల పెడుతున్న ఫోను తీసుకుని.

అట్నుంచి ఫోనులో రేవతిగారు శనివారం భోజనానికి రమ్మని పిలిచారు. "అమ్మగారు వచ్చేరుట కదా. ప్రయాణం సుఖంగానే జరిగిందా?" అంటూ కుశలప్రశ్నలేసి ఆవిణ్ణి కూడా తీసుకు రమ్మని మరీ మరీ చెప్పేరావిడ.

రాత్రి భోజనాలదగ్గర ఆ మాట చెప్తే, "నాకు పనుంది, మీరెళ్ళండి," అన్నాడు మురారి.

"రా డాడీ. బాంతుంది. యూ లైక్ విస్నూ అంకుల్ టూ" అంది కింజల్క.

అతను అసలే అంతంత మాత్రం. అమ్మ వచ్చిందగ్గరినించీ మరీ అధ్వాన్నం అయిపోయింది. దోబూచులాడతున్నట్టు తప్పించుకు తిరుగుతున్నాడు.

"నువ్ చెప్పు," అంది కింజల్క తల్లితో.

"రాకూడదూ? పిల్లలందరూ వాళ్ళ తల్లిదండ్రులతో వస్తారు."

"పనుందంటుంటే ... మరోసారి చూస్తాలే."

శారద లేస్తూ, "నీబట్టలియ్యి. వాషర్లో పడేస్తాను," అంది.

కింజల్క చిట్టీ చిల్కమా, కింజల్కమా అంటూ పాడుకోసాగింది.

"అమ్మ కొట్టిందా?" అంది అమ్మమ్మ చరణం అందిస్తూ.

‘‘మామీ నో కొత్తూతూ’’ అంది కింజు.

‘‘మీ అమ్మ కాదే.. పాట అదీ,’’

శారద నవ్వుకుంటూ జేబులు తడుముతుంటే కింజు జేబులో సిగరెట్ పెట్టె చేతికి తగిలింది. తెల్లబోతూ పైకి లాగింది దాన్ని.

‘‘నాది కాదు,’’ అందా పిల్ల అతి మామూలుగా.

మరి ‘‘నీజేబులోకి ఎలా వచ్చింది’’ అంటే మాటాడదు.

‘‘గట్టిగా ఎనిమిదేళ్ళు లేవు. ఇప్పట్నించీ ఇవేం పోకళ్ళే?’’ అంది అమ్మ కళ్ళింత చేసుకుని.

‘‘నువ్వూరుకో అమ్మా. నేను మాటాడతున్నాను కదా.’’

‘‘బాగానే ఉంది పెంపకం.’’

‘‘ఏంటయింది?’’ అంటూ ప్రవేశించేడు మురారి.

అవాల్సినంత రభసా అయింది. సిగరెట్లు నీజేబులోకి ఎలా వచ్చేయి అంటూ ఎంత అరిచినా కింజల్క చెప్పలేదు.

మురారి శారదమీద విరుచుకుపడ్డాడు. ‘‘పిల్లదాని ఆలనా పాలనా తల్లి చూసుకోనక్కర్లేదా? తల్లి కాకపోతే పిల్లకి బుద్ధులు ఎవరు నేర్పుతారు? ఇవాళ సిగరెట్లూ, రేపు రౌడీ వేషాలూ వేస్తుంటే నీకేం పట్టనట్టు చూస్తూ ఊరుకుంటావా? ...’’

‘‘అవును. సద్బుద్ధులొస్తే వంశలక్షణం. తప్పులయితే తల్లి పెంపకమూను,’’ అంది శారద తలొంచుకుని తనలో తనే మాటాడుకుంటున్నట్టు.

‘‘స్టాపిట్ డాడీ. మామీ ఏం చెయ్యలేదులే.’’ అందాఖరికి ఆ పసిది అరుస్తూ శారద కాళ్ళు చుట్టేసి.

‘‘అయితే చెప్పు. అవి నీకెలా వచ్చేయి?’’ అన్నాడు మురారి ఇంకా పైస్థాయిలో.

పైక్లాసులో కుర్రాడు ఇచ్చేడుట దాచమని. వాళ్ళమ్మ చూస్తే కొడుతుందిట.

‘‘మాబావుంది. మీఅమ్మయితే ముద్దెట్టుకుంటుందేమిటి?’’ అంది అమ్మమ్మ. ఆవిడకి ఇదంతా అయోమయంగా ఉంది.

''నువ్వ్వారుకో అమ్మా,'' అంది శారద నీరసంగా.

ఈ వాదనలు ఇప్పట్లో అయేలా లేవని కింజల్కని రెక్క పుచ్చుకు పక్కగదిలోకి లాక్కుపోయింది అమ్మమ్మ.

ఆ రాత్రి పిల్లని పక్కలో వేసుకుని పడుకుంది శారద. ఏం అడగాలో, ఎలా అడగాలో తెలీడం లేదు. ఈ దేశంలో టాక్, టాకంటారు కానీ తను అలా పెరగలేదు. ఈ టాకులేమిటో, ఎలా సాగించాలో తనకి తెలీడం లేదు. మురారికి ఆ దృష్టి ఉన్నట్టు కూడా లేదు.

''నామీద నీకు కోపం వచ్చిందా?'' అంది శారద ఆఖరికి నెమ్మదిగా.

''లేదు మామీ'' అంది పాప.

''పోనీ ఇంకెవరితోనైనా మాటాడతావా?'' అంది మళ్ళీ గుండెలు చిక్క బట్టుకుని.

''మాటాడొచ్చా?'' కింజల్క ఇంచుమించు ఎగిరిపడినట్టు అడిగింది.

శారదకి కమ్చీతో ఛెళ్ళున కొట్టినట్టయింది.

''ఏమీతో మాటాడతావా?'' అంది శారద ఆలోచిస్తూ. ఏమీకీ కింజూకి వారి జీవితకాలం స్నేహం.

''ఉహుఁ'' కింజు తల అడ్డంగా ఊపింది.

''ఏం? మీరిద్దరూ చిన్నప్పట్నుంచీ స్నేహితులు కదా.''

''వాళ్ళమ్మ అస్తమానం నువ్వెల్పోతావంటుంది.''

శారద గబుక్కున పిల్లదాన్ని గుండెల్లో పొదువుకుంది. తొలిసారిగా దుఃఖం ఉప్పెనగా పొంగుకొచ్చింది. సాటి పిల్లలు అల్లరి చేస్తారనుకుందే గానీ తల్లులు కూడా అనుకోలేదు. తనెంతసేపూ తనబాధ గురించే ఆలోచిస్తోంది గానీ పాపం పిల్లది ఎంత తపన పడతోందో, దానిమనసెంత గాయపడిందో, దాని ఆలోచనలేమిటో ... తనకే కాదు ఎవరికీ తోచినట్టు లేదు. అందరూ తనకి సలహాలు చెప్పేవారే కానీ అదెలా ఉందని అడిగినవాళ్ళు లేరు. అడుగుతారు ఎలా ఉందని. కానీ నిజంగా ఎవరికీ తెలీదు ఆ పిల్ల మనసులో ఘోష ఏమిటో!

‘‘సారీ మామీ’’ అంది కింజూ.

‘‘ఎందుకూ సారీ?’’ అని, మరో అరగంటసేపు కథలు చెప్పి పడుకోమని పంపేసింది.

మర్నాడు శారద చీకటితోనే లేచి కాఫీ పెడుతూంటే అమ్మ వచ్చింది ‘‘రాత్రి నీదగ్గరయినా సరిగా పడుకుందా?’’ అంటూ.

‘‘ఏమిటీ? ఎవరిమాట?’’

అర్ధరాత్రి లేచి అమ్మదగ్గర పడుకుంటానని చెప్పి లేచి వచ్చేసిందిట ఆవిడపక్కలోనించి. కానీ అమ్మదగ్గరికి పోలేదు. ఇద్దరూ ఒక్క ఉదుటున గదులన్నీ కలియతిరిగేరు. మురారి కూడా గాభరా పడిపోతూ ఏమయిందేమయిందంటూ లేచేడు. ముగ్గురూ మళ్ళీ నాలుగ్గదులూ వెతికేరు. మంచాలకిందా, క్లాజెట్లలోనూ, కాదు కాదనుకుంటూనే ఇరుగిళ్ళా పొరుగిళ్ళా కూడా వాకబు చేశారు. పోలీసులకి రిపోర్టిస్తే ఏమవుతుందన్న మీమాంసలో ఉండగానే ఫోనొచ్చింది.

జానెట్ అవతలిపక్కనించి పిలిచి ‘‘అమ్మగారికెలా ఉంది? ఇవాళ కూడా కింజుని నాదగ్గరే ఉంచుకోనా?’’ అని అడగడానికి పిలిచింది ఆవిడ.

జానెట్‌కీ వీళ్ళకీ ప్రాణస్నేహం చాలాకాలంగా. వాళ్ళిల్లు కాలిబాటన ఇళ్ళమధ్యనించి వెళ్తే అయిదు నిముషాలు, కార్లో వెళ్తే పది నిముషాలు పడుతుంది.

శారద పిల్ల క్షేమంగా ఉందని ఇటు ఇంట్లో వాళ్ళకి చెప్పి, ‘‘నేనే వస్తున్నాన’’ని అటు జానెట్‌కి చెప్పి, గబగబ బయల్దేరింది శారద పిల్లని తీసుకురావడానికి.

అర్ధరాత్రి అమ్మదగ్గర పడుకుంటానన్న కింజల్క లేచి చేతికందిన చొక్కా వేసుకుని తలుపు తీసుకుని తిన్నగా జానెట్ ఇంటికెళ్ళి తలుపు తట్టిందిట. అమ్మమ్మని హఠాత్తుగా హాస్పిటల్కి తీసుకెళ్ళాలని, తనని ఇక్కడ దింపేశారనీ చెప్పిందిట.

ఇంటికి రాగానే మురారి కేకలేశాడు ఇల్లదిరిపోయేలా. తండ్రికి రావాల్సినంత కోపం వచ్చిందతడికి. ఊరుకున్న కొద్దీ మితి మీరిపోతోందన్నాడు. అర్ధరాత్రి ఇల్లు వదిలి

పోడానికెన్ని గుండెలు అన్నాడు. ... సిగరెట్లు, .. అబద్ధాలూ ... ఇల్లు వదిలి పారిపోడాలు .. తల్లి ఆమాత్రం చూసుకోనఖ్ఖర్లేదా ... అన్నాడు.

"మీరిద్దరూ మీ తిప్పలేవో మీరు పడండి. నేను పిల్లని ఇండియా తీసుకుపోతాను," అంది అమ్మ.

"నేనెకడ్కీ వెల్లను," అంది కింజల్క మూతి ముడుచుకుని.

"అసలెందుకు అలా పారిపోయేవు? అది ముందు చెప్పు," అన్నాడు మురారి.

"నేనేం పారిపోలేదు. జానెట్ ఇంటికెల్లాను."

మురారి ఒక క్షణం మాటాడలేదు గుక్క తిప్పుకోడానికన్నట్టు. తరవాత అడిగేడు, "చెప్పకుండా ఎందుకెళ్ళేవు?"

"నాయిష్టం."

"నీ యిష్టం కాదు. ఈ ఇంట్లో నేనూ అమ్మా చెప్పినట్టు వినాలి. తెలిసిందా?"

"ఎందుకు వినాలి?"

"ఎందుకంటే నేను నీ డాడీని కనక. గాటిట్?" అని అరిచి, శారదతో, "రేపట్నుంచీ ఆ స్కూలికి పంపకు. ప్రైవేటు స్కూల్లో చేర్పిద్దాం. దారికొస్తుంది."

"నేను అడిగేనా నాకు ఈ మామీ డాడీ కావాలని? ఐ హేట్యూ."

శారద చటుక్కున పిల్లని ఎత్తుకుని పడగ్గదిలోకి తీసుకుపోయింది.

అమ్మ లేని పని కల్పించుకుని వంటగదిలోకి వెళ్ళిపోయింది.

మురారి తన ఆఫీసుగదిలోకి నిష్క్రమించేడు.

OOO

శారద ఆ రోజంతా ఆలోచిస్తూనే ఉంది. Choices - ఈదేశంలో గొప్ప buzz word అదీ. పెళ్ళీ, విడాకులూ కూడా తమ అభిష్టానుసారమే ... ఎవరేం చేసినా తమ ఎంపికే! పిల్లలు మాత్రం పెద్దలో కోర్టువారో నిర్ణయించినదాన్ని బట్టి ఎక్కడో పడతారు - ఫుట్బాల్ తన్నినిట్టే.

పిల్ల బాగానే అడిగింది. ఎప్పుడు ఏ బిడ్డ కావాలో నిర్ణయించుకుని కనగల ఈ రోజుల్లో ఆ బిడ్డ అభీష్టాలు ఎవరడిగేరు? నిజంగా పసివాళ్ళని వాళ్ళ ఛాయిస్‌కి వదిలేస్తే ఎంతమంది ఈ కుళ్ళులోకి రావడానికి ఇష్టపడతారు? ఈ హింస, అక్రమాలూ, స్వార్థం ఎవరు కోరి నెత్తికెత్తుకుంటారు?

000

శనివారం రేవతిగారింటికి వెళ్ళబోయేముందు కింజల్క, శారద కూడా మరోసారి అడిగేరు కానీ మురారి పని నెపంమీద ఇంట్లోనే ఉండిపోయేడు.

శారద తల్లినీ కూతుర్నీ తీసుకుని బయల్దేరింది.

దాదాపు ముప్పైమంది ఉంటారు ఆ రోజు వచ్చినవాళ్ళు. పేరుకి తెలుగువారే అయినా తెలుగూ, హిందీ, తమిళం, ఇంగ్లీషూ కలగలపుగా కలిసిన ఒక సంకరభాషలో సంభాషణలు సాగుతున్నాయి పంచపళ్ళ కషాయంలా, ఉగాది పచ్చడిలా ఉంది అక్కడి వాతావరణం. అమ్మకి కొంతలో కొంత ఇంగ్లీషు అర్థం అవుతుంది కానీ ఈ వాగ్ధోరణి మాత్రం గందరగోళంగానే ఉంది.

రేవతిగారి మామగారు క్రిష్ణయ్యగారు ఇక్కడే ఉంటున్నారు. ఆయన భార్య పోయినతరవాత కొడుకు విష్ణు రారమ్మని తీసుకొచ్చేశాడు అమెరికాకి.

"ఎలా ఉంటున్నారండీ ఈ అడవిలో? వచ్చి వారం రోజులయింది. ఆకసాన తలకిందులుగా వేలాడే చాతకపక్షిలా కడగొట్టుకుపోతోంది ప్రాణం. మనవాళ్ళు ఇక్కడ ఏం చూస్తున్నారో నాకర్థం కాలేదు," అంది అమ్మ.

క్రిష్ణయ్యగారు చిరునవ్వుతో "ఆవరణ తల్లీ. ఏదయినా మనం మల్చుకోడంలోనే ఉంది. హృదంతరాళాల కానగల వారిని ఈ బాహ్యమైన ఆధరువులు అంతగా బాధించవు" అన్నారు.

"అవున్లెండి," అంది అమ్మ.

ఆయనే మళ్ళీ "ఇటు రండమ్మా ఒకసారి," అని నాలుగో పడగ్గదివేపు నడిచేరు. శారదా, అమ్మా ఆయన్ని అనుసరించేరు.

ఆ చిన్నగది ముగ్గులతో, పసుపూ కుంకుమలతో పచ్చని తోరణాలతో కళకళలాడుతోంది. గదంతా కాయితప్పూలూ, ప్లాస్టిక్ అలంకరణలే అయినా ఎంచేతో ఎబ్బెట్టుగా అనిపించలేదు. తూర్పుదిక్కున గోడవార ప్రత్యేకంగా చేయించిన దారు మండపంలో అమర్చిన శ్యామలాదేవి విగ్రహం పీతాంబరంతో నానావిధ ఆభరణాలతో కన్నులపండువుగా ఉంది.

క్రిష్ణయ్యగారు మౌనంగా ఊదొత్తి వెలిగించి ఒక్క క్షణం కళ్ళు మూసుకున్నారు.

*మాణిక్యవీణాముపలాలయంతీం మదాలసాం మంజుల వాగ్విలాసాం ...*

ఆయన తన్మయత్వంతో మధురాతిమధురంగా గళమెత్తి దండకం చదవసాగేరు..

*మాతా మరకతశ్యామా మాతంగీ మదశాలినీ ...*

శారదతనువు పులకరించింది. అమ్మ కనులు చెమ్మగిల్లేయి.

*సాగరారబ్ధ సంగీత సంభ్రమాలోల ..*

ఎప్పుడొచ్చిందో కింజల్క వచ్చి శారదని ఆనుకుని కూర్చుని కృష్ణయ్యగారినీ, శ్యామలాదేవి విగ్రహాన్నీ తదేకంగా చూస్తోంది.

పక్కగదిలో రణగొణ ధ్వనులు కూడా మందరస్థాయికి దిగేయి.

క్రిష్ణయ్యగారు దండకం పూర్తి చేసి మరొక్క క్షణం మనసులోనే ధ్యానించుకుని, ఎండు ద్రాక్షపళ్ళు ప్రసాదం పంచిపెట్టేరు. కింజల్క రెండు చేతులా దోసిలి పట్టి, ప్రసాదం పుచ్చుకుని తల్లివేపు చూసింది. శారధ చిన్నగా కనుసౌంజ్ఞ చేసింది మెచ్చుకోలుగా. కింజల్క ప్రసాదం కళ్ళకద్దుకుని నోట్లో వేసుకుంది.

క్రిష్ణయ్యగారు ఆ పిల్ల చెంపమీద చిటిక వేసి, “ఆ దేవి కూడా నీలాగే మహా సౌందర్యవతి” అన్నారు.

“నాకు తెలుసు,” అంది కింజల్క చిలిపికనులతో.

శారద నవ్వి “మాకు వినయంపాలు కొంచెం తక్కువలెండి,” అంది.

క్రిష్ణయ్యగారు నవ్వలేదు. గంభీరంగా తల పంకించి, ''ఉండాలమ్మా ఆత్మవిశ్వాసం. అదే మనుగడకి మూలాధారం,'' అన్నారు.

మరో అరగంట ఆ కబురూ ఈ కబురూ చెప్పి బయల్దేరుతుంటే కాలేజీ కుర్రాడు రాఘవ ''నేను కూడా మీతో రావచ్చాండీ, వచ్చేటప్పుడు విష్ణుగారే తీసుకొచ్చేరు,'' అన్నాడు. అతనిగది ఆ దారిలోనేట.

శారద ''తప్పకుండానూ, రండి. ఎక్కండి,'' అంది వెనక తలుపు తీస్తూ, రాఘవ కింజల్క పక్కన కూర్చున్నాడు

''ఏమిటో మనం మనవాళ్ళూను. ఇక్కడ వీళ్ళు స్వర్గానికి నిచ్చెనలేస్తూంటే మనం ఇంకా రాళ్ళకీ రప్పలకీ చెట్లకీ పుట్లకీ పూజలు చేస్తున్నాం. నీటిలో మునిగిపోయేవాడు గరికపోచలు పట్టుకున్నట్టు. వీళ్ళు మేధాసంపత్తితో టెక్నాలజీ వృద్ధి చేస్తుంటే మనం మంత్రాలకి చింతకాయలు రాల్తాయని భజనలు చేస్తున్నాం. ఆయనే చూడండి. మహా మేధావిలా ఉన్నారు చూస్తే. రేషనల్ థింకింగ్ మాత్రం లేదు.''

''పోన్లే బాబూ. ఎవరిపెర్రి వారికానందం..''

''అది కాదండీ. మనం సైంటిఫిగ్గా ఆలోచించడం ఎప్పుడు నేర్చుకుంటాం? మనవాళ్ళకి తెలివితేటలు లేవనడం లేదు నేను. క్రిష్ణయ్యగారికి అద్భుతమైన కంఠం ఉంది. ఒప్పుకుంటాను. కచేరీలు చేసుకోమనండి. అంతేగానీ దేవి సాక్షాత్కరించడం ఏమిటి? The man is deluded.''.

''No, he is not.''

రాఘవ ఉలికిపడి కింజల్కవేపు చూశాడు.

శారద అద్దంలోంచి క్షణంకాలం ఇద్దరిమొహాలూ చూసి అమ్మవేపు చూసింది. ఆవిడ వదనం నిశ్చలంగా ఉంది.

''నేను చూశాను. బూటిఫుల్.'' అంది కింజల్క మళ్ళీ.

రాఘవ ఏమనుకున్నాడో మరి మాటాడలేదు. అతన్ని అతనిగది దగ్గర దింపేసి ఇంటికి వచ్చేసరికి తొమ్మిదిన్నర అయింది.

హాల్లో మురారి స్నేహితులతో పేకాడుతున్నాడు.

“డాడీ, పనుందన్నావు?” అంది కింజల్క.

“ఇంతసేపూ పని చేసుకుంటూనే ఉన్నాను. ఇప్పుడే వచ్చారు వీళ్ళు. మీరు తొరగా వచ్చేశారేం?”

“అమ్మకి అలవాటు లేదు కదా. నిద్ర ఆచుకోలేదని వచ్చేశాం,” అని చెప్పి శారద లేపలికి వెళ్ళిపోయింది. తనచిరాకు అమ్మముందు చూపలేక.

బట్టలు మార్చుకుని మంచినీళ్ళకోసం వంటింటిలోకి వెళ్ళబోతుంటే అమ్మమాటలు వినిపించి, గుమ్మందగ్గర ఆగిపోయింది. “నాతో ఇండియా వచ్చేస్తావా? అక్కడ తాతగారూ, మామయ్యలూ, రాంబాబూ, చిన్నక్కా, అందరూ ఉన్నారు. చక్కగా బోలెడు పాటలూ కథలూ నేర్చుకుందువు గానీ.”

“నేను రాను అమ్మమ్మా. పరవాలేదులే. మామీ, డాడీ నీడ్ మీ. ఆ లిటిల్ గర్ల్ కేర్ చేస్తుందిలే.”

శారద గుండె గొంతుకలో కొట్లాడింది. శ్యామలాదండకం పరిపూర్ణ యౌవనవతి అయిన దేవి స్తోత్రం. కింజల్కకి ఆవిడ లిటిల్ గర్ల్‌గా స్ఫురించడం శారదకి వింతగా అనిపించలేదు.

“మామీ, డాడీ నీడ్ మీ,” అన్నమాట మాత్రం రాత్రంతా తలుచుకుంటూనే ఉంది.

000

(ఇ-పత్రిక లో ఫిబ్రవరి 2002లో తొలిసారి ప్రచురితం.)

# 7. పెంపకం

హవామహల్ దగ్గర బీచికి పార్వతి ఆరేళ్ల కూతురు మల్లికని తీసుకొచ్చింది. కనుచూపు దూరంలో ప్రదీపు కనిపించాడు. కొడుకు మహార్ణవ్ చెయ్యి పుచ్చుకుని నడుస్తూ వాడికేదో చెబుతున్నాడు దూరంగా ఏరాడకొండా, కొండమీద సెర్చిలైటు చూపిస్తూ. వాళ్లిద్దరినీ చూస్తుంటే పార్వతికి ఏటికొప్పాక ఏబట్టలదుకాణంలోంచో షోకేసులో వుండే తండ్రీకొడుకుల బొమ్మలు ప్రాణం పోసుకుని నడిచి వచ్చేస్తున్నట్టుంది.

ఆవిడ వాళ్లవేపు నాలుగడుగులేసి వాళ్లు దగ్గరికి వచ్చేవరకూ ఆగి నవ్వుతూ పలకరించింది.

పార్వతీ, ప్రదీపూ అన్నదమ్ముల పిల్లలు. ప్రదీపు ఉద్యోగరీత్యా ఢిల్లీ వెళ్లి మూడేళ్లవుతోంది. స్నేహితుడిపెళ్లికి వచ్చేడు కొడుకుని తీసుకుని. కొడుక్కి విశాఖపట్నం వూరూ, సముద్రమూ చూపించాలని అతనికి మహా ఉత్సాహంగా వుంది. అతనికి సముద్రం అనంతం, గంభీరం, అఖాతం - ఎంతో అర్థవంతంగా కనిపిస్తుంది. సముద్రపు ఒడ్డున పెరిగినవారు జీవితాన్ని అర్థం చేసుకోగలరని నమ్ముతాడు ఇదమిత్థమని కారణాలు వివరించలేకపోయినా. కొడుక్కి మహార్ణవ్ అని పేరు పెట్టుకున్నాడు. అతని భార్యకి కూడా ఆపేరు నచ్చింది.

''రా, ఇక్కడ కూర్చుందాం,'' అంది పార్వతి. విశాఖపట్నం బీచికి పరిశుభ్రమైన గాలికోసం రావడం అక్కడిజనాల జీవితాల్లో ఒక ద్వంద్వం. వున్నంతలోనే కాస్త శుభ్రంగా వున్నట్టు అనిపించిన జాగా చూసి. ఇద్దరూ కూర్చున్నారు పిల్లలమీద ఓ కన్నేసి వుంచి.

మల్లిక ''హా, రావణాసురుడి తల'' అంటూ సిమెంటు దిమ్మల వారనున్న ముళ్లబంతిలాటి ఎండుగుత్తిని అందుకుంది.

''ఏంటదీ'' అన్నాడు మహార్ణవ్ కదలకుండా.

“రావణాసురుడితల. ఇలా గాలిలో వదిల్తే అలా అలా దొర్లుకుంటూ పోతుంది” అంటూ ఇసకలో కొంచెందూరం వెళ్లి దాన్ని వదిలింది. అది మునివేళ్లమీద నడుస్తున్నట్టు గాలిలో దొర్లుతూ పోసాగింది.

మల్లిక మహార్ణవ్ చెయ్యి పుచ్చుకుని రా, రా అంటూ దానివెంట పరుగెత్తసాగింది.

వాళ్లు పదడుగులయినా వేశారో లేదో, ప్రదీపు కేకేసేడు, “అర్ణవ్, ఆగాగు. చాలు, వెనక్కొచ్చేయండి ఇద్దరూ” అంటూ.

పార్వతి “ఫరవాలేదులే. దూరం వెళ్లరు,” అంది శాంతంగా.

పిల్లలిద్దరూ వచ్చేశారు వెనక్కి తిరిగి, తిరిగి చూస్తూ. ఆ రావణాసురుడితల ఎంతదూరం వెళ్తుందో చూడాలని వుంది కానీ ప్రదీపు కేకతో మహార్ణవూ, వాడివెంటే మల్లికా వెనక్కి వచ్చేశారు.

తిరిగొచ్చి మల్లిక తల్లితో “నేను నీళ్లలోకి వెళ్తాను” అంది.

“పద” అంటూ పార్వతి కూడా లేచి, “నువ్వు ఇక్కడే వుంటావా?” అనడిగింది ప్రదీపుని.

“పద. నేనూ వస్తాలే.” అంటూ అతనూ లేచేడు.

మల్లిక ఇసకలో కూరుకుపోతున్న కాళ్లు కూడదీసుకుంటూ నడకలాటి పరుగుతో ఒడ్డుకి వచ్చింది. ఆ వెనకే మహార్ణవ్ కూడా నడుస్తున్నాడు నెమ్మదిగా. వాడికి నీళ్లలో దిగాలన్న సరదా లేదు.

మల్లిక జరజర పాకుతూ వస్తున్న నీళ్లని చూస్తూ ముందుకి సాగింది.

“మరీ లోపలికి వెళ్లిపోకు. ఈ అలల్ని నమ్మలేం.” అంది పార్వతి కూతుర్ని హెచ్చరిస్తూ..

ఆతరవాత ప్రదీపువేపు తిరిగి “ఏమిటి ఆలోచిస్తున్నావు?” అని అడిగింది.

“ఏం లేదు. వీళ్లు ఎప్పుడు పెరిగి పెద్దవాళ్లవుతారా, ఎలా తయారవుతారా అనీ,” అన్నాడు.

‘‘ఎప్పుడో ఏమిటి? పెరుగుతూనే వున్నారు కదా పుట్టిందగ్గర్నుంచీ. ఎలా తయారవుతారంటే ఏమో.’’ అంది పార్వతి తేలిగ్గా.

‘‘అదేమిటి అలా అంటావు? మనమే వాళ్లని తీర్చి దిద్దాలి. వాళ్లకి మనం నేర్పాల్సినవి చాలా వున్నాయి. మనం కలగజేసుకోకపోతే ముళ్లడొంకలా పెరుగుతారు అడ్డూ అదుపూ లేకుండా. అప్పుడు ఆ తప్పు ఎవరిది?’’

‘‘Survival skills. పరిస్థితులనిబట్టి వాళ్లకి అదే ఒంట బడుతుంది అని నా అభిప్రాయం.’’ అంది పార్వతి మల్లికమీద ఓ కన్నేసి వుంచి.

మల్లిక ఉవ్వెత్తున లేచి పడుతున్న తరంగాల్లో నిల్చుని అరికాళ్లకింద తొలిచేస్తున్నట్టు జారిపోతున్న నీళ్లని చూస్తూ గలగల నవ్వుతోంది హాయిగా.

మహార్ణవ్ మాత్రం అలలకి నాలుగు గజాల దూరంలో ఆగిపోయేడు హోరుమంటూ మీది మీదికి వస్తున్న అలలని అందులో గెంతులేస్తున్న మల్లికనీ చూస్తూ.

‘‘రా, అలలు ష్‌ష్‌ష్ మని .. రా, ..రా… ’’ అంది హడావుడి చేసేస్తూ.

మహార్ణవ్ అడ్డంగా తలూపేడు. పెదిమలు బిగబట్టి ‘‘రాను’’ అన్నాడు ఆగకుండా ఒకటి తరవాత ఒకటిగా వచ్చి పడుతున్న అలలు చూస్తూ.

పెద్ద కెరటం వచ్చేస్తోంది. ‘‘ఏయ్ చూడు, చూడు’’ అన్నాడు బెదిరిపోతూ.

మల్లిక అటు తిరిగేసరికి అప్పటికే పెద్ద తరంగం ఒకటి దగ్గరకొచ్చేసి ఒక్క వూపున విరుచుకు పడింది. తుంపరలు మొహంమీద పడకుండా మల్లిక పక్కకి తిరిగి చేతులు అడ్డు పెట్టుకుంది మొహానికి. నడుంవరకూ బట్టలు తడిసిపోయేయి. మళ్లీ కిలకిలా నవ్వింది.

మహార్ణవ్ తుళ్లిపడి మరో అడుగు వెనక్కి జరిగేడు. ‘‘నీపరికిణీ తడిసిపోయింది. ఛీ’’ అన్నాడు మొహమంతా వికృతంగా పెట్టి.

హీహీహీ అంటూ నవ్వింది మల్లిక, ‘‘నాకేం బయ్యంలేదు,’’ అంటూ గబగబా వచ్చి మహార్ణవు చెయ్యి పట్టుకుని, ‘‘రా, రా’’ అంటూ లాగింది.

‘‘నేన్రాను’’ అంటూ చెయ్యి విదిలించుకుని మరో అడుగు వెనక్కి వేశాడు వాడు.

పార్వతి మల్లికని కేకలేసింది, ‘‘వాడు రానంటూంటే, ఎందుకలా లాగుతావు. వూరుకో’’ అంది.

మల్లిక మహార్ణవు చెయ్యి వదిలేసింది. కాని తన పంతం వదల్లేదు, ‘‘ఎందుకు రావూ’’ అంది.

పార్వతి, ‘‘ఇంక చాల్లే నీళ్లలో ఆటలు. పద. ఇద్దరూ గవ్వలేరుకు రండి’’ అంది సీను మార్చడానికి.

ప్రదీపుకి ఆమాటలు మరోలా వినిపించేయి. తన కొడుకు నీళ్లలోకి దిగడని పార్వతి నిర్ణయించేసినట్టు అనిపించింది. ‘‘వాడికేం భయం లేదు. పదరా. బాగుంటుంది. కాళ్లకింద నీళ్లు కదులుతుంటే కితకితలు పెడుతున్నట్టు బావుంటుంది’’ అన్నాడు కొడుకుతో.

పార్వతి నవ్వింది. ‘‘బాగుంది నీ మార్కెటింగు చాకచక్యం. వాడికా సరదా వుంటే వాడే వెళ్తాడు కదా.’’ అంది.

ప్రదీపు తీక్షణంగా చూశాడు పార్వతివేపు. ‘‘నువ్వు మొదట్నించీ ఇంతే. మీ నాన్నగారు ఏం చెయ్యమంటే అదే. చదువు అంటే చదవడం, లిటరేచరంటే లిటరేచరు. నీకో బుర్ర వుందనీ, దాన్ని నువ్వు ఉపయోగించుకోవచ్చనీ ఎప్పుడయినా తట్టిందా నీకసలు?’’ రూక్షణంగా అన్నాడు. కొడుకుమీంచి కళ్లు తిప్పకుండానే.

పార్వతి తెల్లబోయింది. ప్రదీపు మాటలు అర్థం చేసుకోడానికి రెండు క్షణాలు పట్టింది.

తరవాత నెమ్మదిగా, ‘‘నీకెందుకలా అనిపించిందో కానీ మా నాన్నగారెప్పుడూ నాఇష్టమే అనేవారు.’’

‘‘నువ్వే అన్నావు మీనాన్నగారు లిటరేచరు చదవమన్నారని’’ అని గుర్తు చేసేడు ప్రదీపు.

‘‘అవును. ’అన్నారు’ అన్నాను కానీ ‘నాకు అది ఇష్టంలేదు’ అనలేదు కదా. పెద్దవాళ్లు వాళ్లకి తోచిన సలహాలు వాళ్లు ఇస్తారు. అది కూడా తప్పేనా?’’

‘‘ఏమో నువ్వు అలా అంటున్నట్టు అనిపించలేదు అప్పట్లో నాకు.’’

పార్వతి మళ్లీ చూసింది అతనివేపు. ఎప్పుడూ లేనిది ఈ వాదనలు ఇప్పుడు ఎక్కడినించి వస్తున్నాయి అన్నట్టుంది ఆ చూపు. ఓ క్షణం ఊరుకుని, ‘‘మీనాన్నగారు నిన్ను బిజినెస్ చెయ్యమన్నారని నువ్వూ చెప్పేవు కదా,’’ అంది.

ప్రదీపు ఉలిక్కిపడ్డాడు. కొంచెంసేపు ఆలోచించి, ‘‘మేం ఇద్దరం చర్చించుకున్నాం ఏ సబ్జెక్టు మంచిది అన్న విషయం’’ అన్నాడు.

మాటలతో వచ్చిన చిక్కే ఇది. ఏదో మాటలసందర్భంలో ఓమాట అంటాం. దానికి ఎదుటివారు ఎలాటి టిప్పణి ఇచ్చుకుంటారో మనకి తెలీదు. తెలీదు కనక మనకి వివరణలు ఇచ్చుకునే అవకాశం కూడా లేదు. ఇదుగో ఇలా ఏ పదేళ్లకో వస్తే రావచ్చు. పార్వతి కళ్లలో సన్నని హాసరేఖ తృటికాలం మెరిసి మాయమయింది. అది ప్రదీపు దృష్టి దాటిపోలేదు. ఇహ అట్టే పొడిగించడం ఇష్టంలేక ఊరుకున్నాడు.

ఎడ తెగకుండా వచ్చి పడుతున్న అలలదగ్గర తడి ఇసకలో నిల్చున్న మల్లిక అంటోంది, ‘‘పోనీ, కొంచెందూరం ,, ఇక్కడికి రా.’’

మహార్ణవ్ కదల్లేదు, ‘‘ఛీ, నేన్రాను ఆ వుప్పునీళ్లలోకి. నాకసయ్యం,’’ అన్నాడు.

ఇహ వాడు నీళ్లలోకి రాడని నిర్ధారణ అయిపోయింది ఆ పిల్లకి.

‘‘పోనీ. పిచిక గూళ్లు కడదామా? ఇక్కడికి అలలు రావు’’ అంది.

‘‘వస్తాయి. ఇసక తడిగా వుంది కద.’’

‘‘ఎప్పుడో చాలా పే..ద్ధ ... అల .. ఇప్పుడు కాదులే .. నిన్నో ఎప్పుడో వచ్చింది.’’ అంది ఆరిందాలా చేతులూ, కళ్లూ తిప్పుతూ.

’’ఊఁహూ. నేను రాను. .. తడిఇసక .. ఛీ నాకసయ్యం.’’ మహార్ణవ్ మొహం చిట్లించాడు మరో అడుగు వెనక్కేసి.

‘‘రాత్రులు పిచికలు వచ్చి పడుకుంటాయి తెలుసా?’’

‘‘ఏం కాదు ... పిచికలు చెట్లమీద వుంటాయి. నీకేం తెలీదు.,’’ అన్నాడు మహార్ణవ్.

ఆ మాట అన్నతరవాత వాడికి కొంచెం తృప్తిగా వుంది. లేకపోతే ఏమిటి అన్నీ తనకే తెలుసన్నట్టు మాటాడుతుంది. గంటసేపయి చూస్తున్నాడు దాని వాలకం. వాడికి చాలా కోపం వచ్చింది.

ప్రదీపు చూశాడు. ముందుకి వెళ్లాల్సిన కొడుకు మరో అడుగూ మరో అడుగూ వెనక్కి వేస్తూ పోతున్నాడు. పార్వతికి కూడా అలాగే తోచివుంటుంది అనుకోడం మరీ కంటకప్రాయంగా వుంది అతడికి. పార్వతి కూతురికున్నపాటి గుండెబలం తనకొడుక్కి లేదా?

తన విసుగు కప్పిపుంచుకుంటూ, ‘‘వెళ్లరా. నీళ్లలో వెళ్లి ఆడుకోడానికేఁవిటి కష్టం? దాన్ని చూసయినా నేర్చుకోరాదూ?’’ అన్నాడు.

‘‘ఊరుకుందూ. అదేదో ఘనకార్యం అయినట్టు ఏఁవిటా సతాయింపు? ఇవేమేనా అంతర్జాతీయ పోటీలా ఏమిటి? వాడు బంగాళాఖాతంలో పాదం మోపితే గానీ జన్మ ధన్యం కానట్టు దెప్పుతావేమిటి?’’ అంది పార్వతి.

‘‘మనం పిల్లలకి ధైర్యం నేర్పాలి కానీ భయాలు మప్పడం ఏమిటి? ఇవాళ నీళ్లంటే భయం, మనం ఊరుకుంటే రేపు తాడుని చూసినా తుళ్లిపడతారు,’’ అంటూ పాంటు పైకి లాక్కుంటూ కొడుకు దగ్గరకొచ్చి, జబ్బ పుచ్చుకుని, ‘‘రా, నేను కూడా వస్తాను. భయంలేదులే. నాచెయ్యి పుచ్చుకో.’’ అంటూ నీళ్లవేపు లాక్కుపోయేడు.

మహార్ణవ్ ‘‘నేను రాను’’ అంటూ గింజుకుంటున్నాడు.

‘‘అదుగో, అటు చూడు. చి...న్న.. అల వస్తోంది. మన బాత్రూంలో తూము నీళ్ల పాటి లేదు. అయినా అలల్లో దిగితేనే కదా తెలిసేది ఆ అనుభవం ఎలా వుంటుందో, అది నీకు బాగుందో లేదో. దాన్ని చూడరాదూ. దానికున్నపాటి కలేజా లేదూ నీకు?’’ అన్నాడు.

ఆ కుర్రకుంక బుల్లి గుండెల్లో పౌరుషం రెచ్చగొట్టడానికి అతను పడే తాపత్రయం చూస్తూంటే పార్వతికి ఎబ్బెట్టుగా అనిపించింది.

మల్లికకి అంతసేపూ వున్న సరదా అంతా ఎగిరిపోయింది ఈ తండ్రీకొడుకుల సీనుతో. మహార్ణవ్‌ని వాళ్లనాన్న అలా లాక్కురావడం మల్లికకి అస్సలు బావోలేదు.

హోరుమంటూ ఆకాశంవేపు నిలువెత్తు లేచి విరుచుకుపడి ఒడ్డున చాపచుట్టలా పరుచుకుంటున్న తరంగాలని చూస్తుంటే మహార్ణవ్‌గుండెల్లో చిన్న వణుకు వస్తోంది. ప్రతి తరంగం తనని మింగేయడానికే తనమీదకే వచ్చేస్తున్నట్టుగా వుంది. మల్లిక 'ఇంక చాలు పోదాం' అంటే బాగుండును అని వుంది వాడికి.

అసలు అలా అలల్లో నిలబడి, కాళ్లకింద మన్ను తొలిచేస్తుంటే కలిగే ఆనందం ఏమిటో ఎంత తన్నుకున్నా అర్థం కావడంలేదు వాడికి. దారిపక్కన దాలిగుంటలో ముడుచుకు పడుకున్న ఊరకుక్కని తంతే ఇంకా ఎక్కువ అనందం కదా. అదే అన్నాడు రెండురోజుల కిందట మహార్ణవ్ మల్లికతో.

000

ఆరోజు ప్రదీపూ, మహార్ణవ్ పార్వతిఇంటికి వచ్చారు చుట్టపుచూపుగా. పెద్దవాళ్లు నడవలో కూర్చుని మాటాడుకుంటుంటే, పిల్లలిద్దరూ వీధిలో ఆడుకుంటున్నారు. రోడ్డువార ముడుచుకు పడుకున్న వూరకుక్కని చూసి ''దాన్ని తన్ననా?'' అన్నాడు మహార్ణవ్ దానివేపే చూస్తూ.

''ఎందుకూ దాన్ని తన్నడం?'' అంది మల్లిక.

''ఊరికే.''

''అది కరిస్తే?''

''అదేం కరవదు'' అన్నాడు మహార్ణవ్ అమితోత్సాహంతో. తాను కుక్కని తన్నగల శూరుడని మల్లికకి ఋజువు చేయాలి.

''కుక్క కరిస్తే నలభై ఇంజీషనులు తీసుకోవాలిట బొడ్డుచుట్టూ'' అంది మల్లిక.

వాళ్ల స్కూల్లో ఓ అబ్బాయి కుక్కని తంతే అంతే అయింది. మహార్ణవ్ కుక్కని తన్నకుండా చేయరా దేవుడా అని మనసులో కోరుకుంది అర్జంటుగా.

దేవుడు మల్లిక మాట విన్నాడో, మహార్ణవుడు ఇంజక్షనుమాట విన్నాడో కానీ ఆపూట వాడు కుక్కని తన్నడం జరగలేదు.

నిన్న వాడు కుక్కని తన్నలేదు. ఈరోజు వాడు ఈ సముద్రపు ఒడ్డున నీటిలో కాలు పెట్టడం జరగదు.

000

ప్రదీపు తటాలున లేచి, "పిల్లలకి అలాటి భయాలు వుండకూడదు. చిన్నప్పుడే పోవాలి." అన్నాడు.

రెండంగల్లో ప్రదీపు కొడుకుని నీళ్లలోకి ఈడ్చుకు వెళ్లి అలల్లో నిలబెట్టేడు. మల్లిక బెదిరిపోయి వెనక్కి జరిగి తల్లిపక్కన ఒదిగి నిలబడిపోయింది.

పార్వతి ఊరుకోలేకపోయింది, "ప్రదీప్, ఏమిటా దౌర్జన్యం! ఊరుకో," అంటూ గబగబా వచ్చి అతని గుప్పిటిలోనుండి కుర్రవాడి జబ్బ విడిపించింది, "నీకు మతి పోయింది " అంది విసుక్కుంటూ.

మహార్ణవ్ బావురుమంటూ ఏడవడం మొదలు పెట్టేడు, పార్వతిని చుట్టేసుకుని.

ప్రదీపు అచేతనంగా నిలబడిపోయేడు తనెందుకు అలా చేసేడో తనకే తెలీనట్టు.

"పదండి. చీకటి పడుతోంది. ఇంటికెళ్దాం." అంది పార్వతి.

బీచికొచ్చేం అన్న సరదా పోయింది. అందరూ మౌనంగా నడుస్తున్నారు.

ప్రదీపు కొంచెంసేపు అయింతరవాత నెమ్మదిగా, "దానికి అలా అంత ఏ భయాలు లేకుండా ఎలా చేయగలిగేవు?" అన్నాడు అనంత దూరాల్లోకి దృష్టి సారించి.

"నేనేమీ చెయ్యలేదు. దానిష్టానికే వదిలేస్తాను అంతే." అంది. మళ్లీ అతను చిన్నబుచ్చుకుంటాడేమో అనిపించి, "అయినా చిన్నప్పటినించీ రోజూ సముద్రం చూస్తూ పెరిగింది కదా. అంచేత భయం లేదేమో" అని జోడించింది.

సముద్రం హోరు పెడుతున్నా వారిద్దరిమధ్య నిశ్శబ్దం ఒత్తుగా తిష్ఠ వేసుకుంది. ఇద్దరూ ఎవరి ఆలోచనల్లో వారు మునిగి నడుస్తున్నారు బీచిరోడ్డుమీద. వాళ్లకి కొంచెం ఎడంగా మల్లికా, మహార్ణవ్ నడుస్తున్నారు.

"భయాలు అందరికీ వుంటాయి. ఏదో ఓ రకం. ఒహటి కాపోతే మరోటి. నీకు మాత్రం లేవూ భయాలూ?" అంది భావగర్భితంగా.

ప్రదీపుకి అర్థం అయింది పార్వతి ఏ విషయంగురించి అందో ఆమాట.

"అవును. అప్పుడు నాకు బహుశా మహార్ణవ్ వయసే అనుకుంటాను. నాకు చీకటి అంటే భయం. నాభయం పోగొట్టడానికి అంటూ మా నాన్నగారు నన్ను చీకటిగదిలో పెట్టి తలుపేసేరు."

"మరి నీకు భయం పోయిందా?"

ప్రదీపు నవ్వేడు నిర్మలంగా, "పోయింది ముప్ఫై యేళ్లు దాటేక".

హమ్మయ్య అనుకుంది పార్వతి మనసులోనే. వాతావరణం కాస్త తేలిక పడింది.

రెండు నిముషాలు ఊరుకుని అంది, "అదే మరి. వాళ్లకాలంలో వాళ్లకి తోచినట్టు వాళ్లు పెంచేరు మనల్ని. మనకాలంలో మనం మనకి చేతనయినట్టు పెంచుతాం. నువ్వూ నేనూ బాగానే కాకలు తీరేం కదా."

ప్రదీపు ఆలోచనలో పడ్డాడు. "చలంనించీ స్పాక్ వరకూ ఎన్ని పుస్తకాలు చదివేనో,"

"నేనూ చదివేను. కాని ఆవే వేదవాక్యాలు అనుకోలేదు.."

"పిల్లలు instruction manual తో రారంటావు,"

""నేనేమీ అనడంలేదు. నాక్కూడా తెలీదనే అంటున్నాను. నామటుకు నాకు ప్రతిరోజూ ఓ చిన్న యుద్ధం అనే అనిపిస్తుంది. ఎప్పటికప్పుడు ఆక్షణానికి తోచినట్టు వ్యూహరచన చేసుకుంటానంతే. గెలుపూ, ఓటమీ - రెంటికీ సిద్ధమే నేను," అంది పార్వతి.

(జనవరి 2009 ఈమాట.కాంలో ప్రచురితం.)

# 8. అమ్మ తపన

పైకి వెళ్ళే ఎలివేటరుకోసం ఎదురు చూస్తున్నాను. నాకంటె ముందొచ్చి, నొక్కిన బటనే మరోసారి నొక్కి గోడమీద ఉన్న అంకెని చూస్తున్నాడొకతను.

మూడు.

మూడో అంతస్థులో ఎవరో ఎలివేటరుని పట్టుకు్కూర్చున్నారులా ఉంది ఎంతకీ దిగి రావడంలేదు. మరో గళ్లచొక్కా కుర్రాడు గబగబా వచ్చి ఆ బటనే మళ్ళీ నొక్కి హడావుడిగా అటూ ఇటూ చూడ్డం మొదలెట్టాడు. వారంరోజులనించీ చూస్తున్నాను ఈ వరస. ఇంతా చేస్తే మూడో అంతస్థుకి వెళ్తాడు. అంత తొందరైతే మెట్లెక్కి పోకూడదూ? అతను మళ్ళీ బటను నొక్కేడు.

నాకు నవ్వొచ్చింది ఈ ఎలివేటరు మనస్తత్త్వం.

‘‘ఈ యంత్రాంగం అంతా మనకాలం వృథా కాకుండా ఉండడానికి,’’ అన్నాడతను నావేపు చూసి.

‘‘తాబేలు గెలిచినకథ ఇందుకే వచ్చింది,’’ అన్నాను.

‘‘దూరంగా కారిడర్‌లో జూలీ కనిపించింది, గబగబా నడుస్తూ దూరంనించే చెయ్యూపింది.

అప్రయత్నంగా ఎలివేటరు ముల్లు చూశాను. ఇంకా మూడుమీదే ఉంది!

‘‘మెట్లమీంచి పోతే బావుణ్ణేమో,’’ అన్నాడు గళ్ళచొక్కా కుర్రాడు ఎవరితోనో తెలీకుండా.

జూలీ దగ్గరకొచ్చేస్తోంది.

మెట్లు … అనుకుంటూ మళ్ళీ గోడమీద ముల్లువేపు చూశాను. రథం కదిలింది. అన్యాయం .. రెండు … ఒకటి … ఆగింది.

జూలీ ఇంకొంచెం దగ్గరయింది.

నేను ఎలివేటరులోకి అడుగేసి, ఓమూలకి నక్కి నిల్చున్నాను. గళ్ళచొక్కా కుర్రాడు క్లోజ్ బటను నాలుగుసార్లు నొక్కేడు గబగబ. సగం మూసుకున్న తలుపుని ఓ చేత్తో ఆపి తోసుకుంటూ జూలీ ఒక్క పెట్టున వచ్చి ఎలివేటరులో పడి, వగరుస్తూ హమ్మయ్య అంది.

“బావున్నావా?” అంది నావేపు తిరిగి.

“బాగానే ఉన్నాను. నువ్వు?”

“బ్రహ్మాండం అనుకో.”

“ఏం? ఏమిటి విశేషం?” యదాలాపంగానే అడిగేను.

“హాఁ” అంది కళ్ళెగరేస్తూ.

నాకాశ్చర్యం వేసింది. ఆవిడెప్పుడూ అంత తేలిగ్గా ఒక్క “హాఁ”తో పోనివ్వలేదు.

తొమ్మిదో అంతస్థు వచ్చింది. ఇద్దరం ఎలివేటరులోంచి బయటపడి మా బల్లలవేపు నడిచేం. సర్దుకుని మా సీట్లలో కూర్చునేవేళకి జూలీబల్లమీద ఫోను మోగింది. ఆర్నెల్లనించీ చూస్తున్నాను. రోజుకు పన్నెండు కాల్సు వస్తాయి. ప్రతి కాలూ ముప్పావుగంట సాగుతుంది. ఫోన్ కాకపోతే ముఖాముఖీ మాటాడ్డానికి ఎవరో ఒకరు వస్తారు. టామ్, డిక్, హారీ … ఎవడో ఒకడు. … ఇన్నిటిమధ్య నన్ను వేధించుకు తినడానికి టైముంటుంది ఆవిడకి!

“ఇందిరాగాంధీ కిరాతకురాలిలా ఉంది. నీ అభిప్రాయం ఏమిటి?”

“మీదేశంలో అంత జనాభాని ఎలా భరిస్తున్నారు?”

“దారిద్ర్యం ఎక్కువ కదా?”

ఆఖరికి విసుగేసి చెప్పేను, “ఆ రాజకీయాలన్నీ నాకు పట్టవు. పైగా నాకిక్కడ చచ్చే పనుంది.”

జూలీ సిగరెట్ తీసి, నోట బెట్టుకోబోతూ, "అభ్యంతరమా?" అంది.

నిస్సందేహంగా నాకు అభ్యంతరమే. "లేదు" అన్నాను ఆవిడవేపు చూడకుండా.

"చూశావా ఎవరో మహాయిల్లాలు కోళ్ళు నరికేకత్తితో మొగుణ్ణి పొడిచేసిందిట. బతికున్నన్నాళ్ళూ నానాహింసా పెట్టేట్ట ... మీదేశంలో మొగాళ్ళు ఆడవాళ్ళని కొడతారా? వాళ్ళు కొట్టినా తిట్టినా ఆడవాళ్ళు కిక్కురుమనకుండా పడివుంటారుట నిజమేనా?"

ఆవిడ ప్రశ్నలతో, సందేహాలతో, తలా తోకా లేని అభిప్రాయాలతో నాకు తల తిరిగిపోతుంది. ... ఆడవాళ్ళ అధ్వాన్నస్థితి ... దరిద్రం ... బానిసత్వం ... మొగాళ్ళ నిరంకుశత్వం ...

"ఇవాళ ఉత్తరాలు ఒచ్చేయా?" అంటాను మాట మార్చడానికి. ఇవాళా అదే అడిగేను.

"నాకు తెలీదు." ఇదీ ఆనవాయితీగా వచ్చే జవాబే.

"చూసొస్తాను" అంటూ లేవబోయాను. నిజానికి కొంచెంసేపుంటే నాబల్లదగ్గరికే వస్తాయి. నేను వెళ్ళవలసిన అవుసరం లేదు.

"ఏం? అర్జెంటుగా రావలసినవేమైనా ఉన్నాయా?" జూలీ అడిగింది. అంతలో ఆవిడబల్లమీద ఫోను మోగింది. ఆవిడ ఫోను తీసి హలో అంది. నాకు మరో ముప్పావుగంటవరకూ ఇబ్బంది లేదు. నేను ఉత్తరాలమాట ఒదిలేసి, ఫైళ్ళు తీసుకున్నాను.

మనసు ఫైళ్ళమీదికెళ్ళడం కష్టంగా ఉంది. ఎంత కూడదనుకున్నా జూలీ తత్త్వం చిరాకు పెడుతోంది నన్ను. ... మీదేశం, మీనాయకులూ, ఇందిరాగాంధీ, ఆడజాతీ, దిక్కులేని పిల్లలూ, కూడులేని బతుకులూ ... ఏమిటో ఈ అమ్మాయి తాపత్ర.యం! మహా అయితే ముప్ఫై ఏళ్లుంటాయేమో. క్షణం తీరికలేని జన్మ. గుక్క తిప్పుకోడానికి లేని బతుకు. ఎనలేని వ్యాపకాలు. చేస్తున్న ఉద్యోగంమీద ధ్యాస లేదేం? ధ్యాసలేని ఉద్యోగం చేయనేల?

జూలీ ఫోన్ పెట్టేసి, కిటికీలోంచి చూస్తూ అంది, ''ఎండ అద్భుతంగా ఉంది కదూ!''

''ఆఁ'' అన్నాను ఆలోచిస్తూ. నేను పుట్టినదేశంలో ఎండలు అద్భుతంగా ఉన్నాయని మురిసిపోతూ చెప్పుకోం. మాడి ఛస్తున్నాం అని ఏడుస్తాం.

''మీకు ఎండలు చాలా ఎక్కువ కదూ?''

ఉత్తరాలొచ్చేయి. కావలసినవేం లేవు. ఓ రెండు కేటలాగులూ, మౌత్ వాష్ శాంపిల్ బాటిలూ, భీమా లేకుండా ఛస్తే వచ్చే ప్రమాదాలగురించి వివరించే భీమాకంపెనీ ఉత్తరం ఒకటీ, కానీ ఖర్చు లేకుండా లక్షలు సంపాదించే అద్భుతమయిన ఐడియాలూ, … విసుగ్గా చెత్తబుట్టలోకి విసిరేశాను. జూలీవేపు ఛూశాను. ఆతృతగా ఉత్తరాలు చదువుతోంది.

నేను నా ఫైలు తీసుకుని పీటరుతో మాటాడడానికి వెళ్ళేను. తిరిగి వచ్చేసరికి జూలీ కిటికీలోంచి ఏ దూరతీరాల్లోకో చూస్తోంది.

''ఎక్కడికెళ్ళేవు?'' ఎందుకో ఎనలేని హుషారు తెచ్చుకుంటున్నట్టు కనిపించింది. కానీ నేను పట్టించుకోకుండా ఉండడం మంచిది.

పీటరుకి నేనంటే ప్రత్యేకాభిమానం. జూలీయే కాదు ఇంకా ఒకరిద్దరు కూడా ఈ విషయమై వ్యాఖ్యానించేరు. నిజానికి చెప్పుకోదగ్గ పెద్ద కారణం ఏమీ లేదు. గాడిదలా చాకిరీ చేస్తాను కనక. అతనికి కనీసం ఒకటిన్నర మనుషులపని కిడుతుంది నాకిచ్చే ముప్పాతిక జీతానికీను. నేనామాట అంటే జూలీ ఒప్పుకోదు.

''పీటరు పెళ్ళాన్ని ఒదిలేశాడు, తెలుసా?'' హేళనగా నవ్వుతుంది.

నాకలాటి సరసాలు నచ్చవు. ''చూడు, నాకతని వ్యక్తిగత విషయాలు అనవసరం. నాకు సంబంధించినంతవరకూ ఈ ఆఫీసులో మనుషులూ, ఈ ఫైళ్ళూ ఒకటే,'' అన్నాను కఠినంగా ఓ బొత్తి ఫైళ్ళు ఎత్తిపట్టుకుని గాల్లో ఊపుతూ.

జూలీమొహం కళ తప్పింది క్షణకాలం. మరీ కఠినంగా మాట్లాడేనేమో అనిపించింది. అదే మాట నేను కొంచెం సౌమ్యంగా చెప్పివుండొచ్చు.

తను సిగరెట్ తీసి చేత్తో పుచ్చుకుని నావేపు చూసింది.

పీటరుతో మాటాడినా చిక్కు తేలలేదు. ఫైలంతా గందరగోళం. ఎలా రాయాలో బోధపడ్డంలేదు. విసుగ్గా కాయితాలు బల్లమీదికి విసిరేశాను.

"విసుగ్గా ఉందా?" జూలీ అడిగింది.

నేను మాట్లాడలేదు. తను చేతిలో సిగరెట్ వేపూ నా వేపూ మార్చి మార్చి చూసి మళ్ళీ పెట్టెలో పెట్టేసింది. ఆశ్చర్యపోవడం నావంతయింది. ఎక్కు పెట్టినబాణంలా పెట్టెలోంచి తీసిన సిగరెట్టెప్పుడూ కాల్చకుండా ఒదిలిపెట్టలేదావిడ.

"హేయ్," నేను మాటాడకుండా ఉండలేకపోయేను. "ఏమైంది?"

జూలీ జవాబు చెప్పలేదు. ఎదురుగా బల్లమీదున్న కాయితాలవేపు చూస్తూంది. ఏదో చాలా బాధ కలిగించేదే అయివుండాలి అనిపించింది నాకు.

తను హఠాత్తుగా లేచి వచ్చి, నాకెదురుగా కుర్చీలో కూర్చుంది. "ఇది చూడు," అంది ఏదో దినపత్రికలోంచి కత్తిరించిన కాయితపుముక్క చూపిస్తూ.

అదొక మరణవార్త. ఎక్కడో పియోరియా అనబడే ఊళ్ళో హారియట్ క్రిస్టెన్సన్ అనే ఆవిడ మరణించింది గుండెజబ్బుతో. వయసు యాభై. వచ్చే ఆదివారం అంత్యక్రియలు.

జూలీ తన తల్లిపేరు బార్బరా అని చెప్పినట్టు గుర్తు. "మీ చుట్టమా?" అనడిగేను. అంతకంటే ఏం మాట్లాడాలో నాకు తోచలేదు.

జూలీ తలొంచుకుని, నెమ్మదిగా, అతినెమ్మదిగా అంది, "నాకు జన్మనిచ్చిన స్త్రీ."

నేను తుళ్ళిపడ్డాను. "మీ అమ్మా?"

జూలీ అవునన్నట్టు తలూపింది.

కాలం నత్తలా నడుస్తోంది నింపాదిగా.

"ఆవిడ మా అమ్మ. నాకు ఈ సంగతి తెలుసుకోడానికి పదహారేళ్ళు పట్టింది. సోరెన్సన్స్ నన్ను పెంచుకున్నారని తెలిసినప్పుడు నాకు పదకొండేళ్ళు. .... అప్పట్నుంచీ మాఅమ్మని చూడాలని ఒకటే తహతహ. ... కనిపించినవాళ్ళనందర్నీ అడిగేను. ... నర్సులూ, డాక్టర్లూ, రెసిడెంట్ నర్సులూ ... ఎంతమందిని అడిగేనో లెక్క

లేదు. ఫెడరల్ రికార్డులూ, హాస్పిటల్ ఫైళ్లూ, ఎన్ని చూశానో కళ్ళు పొడుచుకు .. ప్రత్యేకం దీనికోసమే మూడు స్టేట్స్‌లో నాలుగు సంస్థల్లో మెంబర్ని అయ్యేను....'' గుక్క తిప్పుకోడానికి ఓ క్షణం ఆగింది. ''ఆఖరికి నిన్ననే న్యూజెర్సీనించి ఉత్తరం వచ్చింది ఆవిడ పియోరియాలో ఉన్నట్టు. ... రాత్రంతా ఆలోచనలతో ఉక్కిరిబిక్కిరి అయిపోయేను.'' నాచేతిలోంచి ఆ పేపరుకటింగ్ తీసుకుంది.

''అయాం సారీ, సో వెరీ సారీ,'' అన్నాను. ఇక్కడ అందరూ అనే మాటే. నాకు మాత్రం మహా వెగటుగా తోచింది.

జూలీ వెలితిగా నవ్వింది, ''తమాషాగా లేదూ? నేనూ మాఅమ్మా ఒకరినొకరం తొలిసారి చూసుకోడం నేను పుట్టినప్పుడు ... అప్పట్లో నాచుట్టూ ఏం జరుగుతోందో నాకు తెలీదు. మళ్ళీ చూసుకోడం ఇప్పుడు, ఆవిడ చనిపోయేక! ఈసారి తనచుట్టూ ఏం జరుగుతోందో ఆవిడకి ...''

నాకు గుండెలు పట్టేసినట్టయింది. కుర్చీలోంచి లేచి, దగ్గరికెళ్ళి, భుజంమీద చెయ్యేసి, ''కాఫీకి వెళ్దాం, రా'' అన్నాను.

ఆ అమ్మాయి కళ్ళెత్తి నావంక చూసింది. తడిగా ఉన్నాయవి.

కెఫీటీరియాకి వెళ్తున్నంతసేపూ, కాఫీ తాగుతున్నంతసేపూ, జూలీ మాటాడుతూనే ఉంది. ఎవరెవరిని కలుసుకుందో, ఏం మాటాడిందో, ఏ ఫైళ్ళు పట్టుకోడానికి ఎన్ని అవస్థలు పడిందో, ఏ ఏ సంస్థలు ఏం పనులు చేస్తాయో ...

ప్రతి మాటా జాగ్రత్తగా వింటున్నాను. తెరిచినపుస్తకంలా కనిపించింది ఆ సమయంలో ఆ అమ్మాయి ... హఠాత్తుగా నన్నడిగింది, ''మీదేశంలో పెళ్ళిళ్లే నయం అనుకుంటా. తండ్రిపేరు తెలీని పిల్లలుండరు.''

ఆవిడ ఏమంటోందో నాకు అర్థమయింది. గుండెల్లో పొడిచినట్టయింది. నేను జవాబు చెప్పలేదు.

జూలీ మళ్ళీ అడిగింది, ''నువ్వు మీపెద్దలు నిర్ణయించిన సంబంధమే చేసుకుంటావా?''

గబుక్కున లేచేన్నేను. "ఏమనుకోకు. నేను అర్జెంటుగా పంపవలసిన కాయితాలున్నాయి. వెంటనే వెళ్ళాలి. మనం తరవాత మళ్ళీ మాటాడుకుందాం. ఏమనుకోవు కదూ?"

కాఫీకీ, టిప్పుకీ డబ్బు బల్లమీద పడేసి, గబగబా నాసీటువేపు నడిచేను. కళ్ళు తిరుగుతున్నట్టుంది. పెద్దవాళ్ళు చూసుకుంటారు అన్నీ ... భగవంతుడా! చూసుకుంటున్నారా? చూసుకున్నారా?

జూలీ పీటర్ ఆఫీసుగదిలోంచి వచ్చి, తనసంచీ అందుకుంది, "నేను శలవు పెట్టేను. రేపు కూడా రాను. సర్వీస్‌కి వెళ్తున్నాను."

"మీ తల్లిమృతికి నేను సంతాపం వెలిబుచ్చుతున్నాను,"

జూలీ గుమ్మంవేపు నడుస్తూ "థాంక్సూ" అంది.

జూలీ వెళ్ళిపోయింది.

నామనసంతా అల్లకల్లోలంగా ఉంది. తనమాటలు గుదిబండలయి గుండెల్లో కొట్టుకుంటున్నాయి. ఫైలు తీస్తే ఒక్క అక్షరం కూడా కనిపించడంలేదు. టైము చూశాను. కనీసం ఇంకో గంటసేపైనా పని చెయ్యాలి. జూలీ శలవు తీసుకుంది. నేను కూడా అడిగితే బాగుండదు.

పెద్దలు చేసే పెళ్ళి ... అరేంజిడ్ మేరేజస్ ... తండ్రిపేరు తెలీని పిల్లలు ...నాకు పిచ్చెత్తిపోతోంది. ఫోన్ తీసి చిన్నమామయ్య నెంబరు కొట్టేను. కామాక్షిపిన్ని ఫోను తీసింది. ఆవిడ ఈమధ్యే వచ్చింది. అంచేత ఫోను తియ్యడానికి మొహమాటం ఆవిడకి.

"నేను పిన్నీ, శారదని."

"ఆఁ. బావున్నావా?"

నేను జవాబు చెప్పలేదు.

"శారదమ్మా!" అంది పిన్నే మళ్ళీ అట్నుంచి.

"ఆఁ. ఆఁ. బాగానే ఉన్నాను" అన్నాను తొట్రుపాటుతో.

"మాటాడకపోతేనూ ..."

“ఏం లేదు … నాకేం తోచడంలేదు పిన్నీ. ఇవాళ సాయంత్రం మాయింటికి ఓమారు రాకూడదూ,” వీలయినంత మామూలుగా ధ్వనిస్తూ అన్నాను.

“అలాగే” అంది పిన్ని. ఆ ఒక్కమాటకే నామనసు చల్లబడింది.

“ఇంకోగంటలో నాపనయిపోతుంది. ఇక్కడనించి తిన్నగా మీఇంటికి వచ్చి నిన్ను మాయింటికి తీసుకెళ్తాను. మళ్ళీ నేనే దింపుతాలే.”

సరేనంది పిన్ని. ఎప్పుడూ ఇంతే ఆవిడ. తూచినట్టు ఎంత మాటాడాలో అంతే మాటాడుతుంది. వెయ్యి ప్రశ్నలతో వేధించుకు తినడం ఆవిడ పద్ధతి కాదు. నేను ఫోను పెట్టేయబోతూంటే అంది “మీచిన్నమామయ్యకి కూడా ఫోన్ చేసి చెప్పు.”

“అలాగే” అనేసి ఫోను పెట్టేశాను.

000

అయిదయేసరికి చిన్నమామయ్య ఇంటిముందు వాలేను. ఇంట్లో ఇంకెవరూ లేరు. పిన్ని సిద్ధంగానే ఉంది. ఉల్లిపాయరంగు వెంకటగిరి చీరే, తెల్ల జాకట్టుతో.

“వెళ్దామా?” అంది నన్ను చూడగానే ఆప్యాయంగా.

“పద” అన్నాను నేను కూడా వెనక్కి తిరుగుతూ.

కారు నడుపుతున్నానన్నమాటే కానీ మనసంతా చిరాగ్గా ఉంది. ఎంత ప్రయత్నించినా జూలీమొహం మనసులోంచి చెరుపుకోలేక పోతున్నాను.

లేక్ మొనానా పక్కనించి వెళ్తున్నాం. నీటిమీంచి పిల్లగాలులు మొహాన సుతారంగా తాకుతున్నాయి ఊరడిస్తున్నట్టు. పిన్నివేపు చూశాను. ఆవిడ కిటికీలోంచి అటువేపు చూస్తోంది.

“ఇక్కడ కూచుందాం,” కారు పక్కకి తీసి ఆపేను. ఇద్దరం కారు దిగి నీళ్ళకి దగ్గరగా గడ్డిమీద కూర్చున్నాం. గాలి మెల్లిగా వీస్తోంది. నీళ్ళలో అలలు చిన్నగా కదులుతున్నాయి. బాతులు నీళ్ళమీద తేలుతూ, ఒడుపుగా చిన్నచేపల్ని మింగడానికి ప్రయత్నిస్తున్నాయి. ఒడ్డున ఓ రెండు బాతులు సేద దీరుతున్నాయి.

“ఇంటినించి ఉత్తరాలు వస్తున్నాయా?” పిన్ని అడిగింది.

“రెండ్రోజులక్రితం ఒకటొచ్చింది.”

హఠాత్తుగా నామీద నాకే చిరాకేసింది. నామీద నాకే జుగుప్స ఉవ్వెత్తున లేచి పడింది. దిగంతాలలోకి దృష్టి సారించి చూస్తూ అన్నాను, “అన్నయ్యా, వదినా, పిల్లని పువ్వుల్లో పెట్టి చూసుకుంటున్నారు. పిల్ల ఆ యింట మహా గౌరవంగా పెరుగుతున్నమాట కూడా నిజమే. కానీ, దాన్ని కన్న తల్లిని నేనూ …”

ఒక నిముషం ఆగి మళ్ళీ అన్నాను, “ఎవరేం అనుకున్నా సరే నాకక్ఖర్లేదు. ఎవరేం అన్నా నేను పట్టించుకోను. నిజానికి నాతప్పుకి … అసలు నాతప్పు మాత్రం ఎందుకవుతుంది? నాతప్పు కాదు. .. తప్పు ఎవరిదైనా బిడ్డ ఎందుకు బాధపడాలీ? దాన్నిక్కడికి తెచ్చి పెంచుతాను. నాబిడ్డని నాదగ్గరే పెట్టుకుంటాను.”

ఈ మాటలు అనేశాక, మనసు కుదుటపడింది. ఇప్పుడు ప్రాణం హాయిగా ఉంది. నాబిడ్డ నాదగ్గరున్నంత హాయిగానూ ఉంది.

“మంచిది. తీసుకురా,” అంది పిన్ని.

నేను తలెత్తి ఆవిడమొహంలోకి చూశాను. ప్రశాంతంగా ఉంది.

మొనోనా నిర్మలంగా ప్రవహిస్తూంది.

హాయిగా గుండెలనిండా గాలి పీల్చుకున్నాను. సోమవారం జూలీకి చెప్పేస్తాను.

ooo

(నవంబరు 12, 1982 ఆంధ్రజ్యోతి వారపత్రికలో ప్రచురితం.)

# 9. జేబు

‘‘నాకు కొత్త పరికిణీ, జాకట్టూ కావాలి’’ అంది పరిమళ అమ్మతో.

‘‘వారం రోజులు కూడా కాలేదు  కొత్తస్కూలని కొత్తబట్టలు కుట్టించి. మళ్లీ ఇప్పుడే ఏమిటి’’ అంది అమ్మ.

‘‘పోనీ పరికిణీ అక్కర్లేదు. జాకట్టు కుట్టించు. కొత్తది కుట్టించకపోతే నేను స్కూలికి వెళ్లను’’ అంది పరిమళ.

‘‘బాగుంది వరస. రోజుకో కొత్త జత కావాలేమిటి రాణీగారికి’’ అంది అమ్మ నవ్వుతూనే.

‘‘రోజుకోటి అక్కర్లేదు. నాకు ఇంగ్లీషు క్లాసు వున్నరోజున వేరే డ్రెస్సు కావాలి.’’

‘‘ఏమయింది ఇంగ్లీషు క్లాసులో?’’ అనడిగింది అక్కయ్య. ఇలాటికోరికలకి మూలం స్కూలేనని అక్కయ్య గ్రహించేసింది.

పరిమళ మాటాడలేదు.

అమ్మ ‘‘సరేలే చూద్దాం. పైనెల బాబి పుట్టినరోజు వస్తోంది కదా. అప్పుడు నీక్కూడా కుట్టిస్తాలే’’ అంది.

‘‘అలా కాదు. నాకు ఇప్పుడే కావాలి’’ అంది పరిమళ మళ్లీ.

‘‘బాగానేవుంది వరస. లేడికి లేచిందే ప్రయాణం అని కావాలి అనేసరికి కొనీడానికి ఎలా అవుతుంది. ఏవిటాతొందర’’ అంటూ కసురుకుంది అమ్మ.

పరిమళ ఊరుకుంది కానీ మనసులో ఉక్రోషం పట్టలేకుండా వుంది.

OOO

ముందు రోజు ..

స్కూళ్లు తెరిచారు. ఎనిమిదో క్లాసులో అడుగు పెట్టింది పరిమళ. కొత్త పరికిణీ జాకట్టుతో, పుస్తకాలూ, జామెట్రీ బాక్సూ గుండెల్లో పొదివి పట్టుకుని, అన్నీ కొత్తమొహాలు. క్లాసులో అడుగు పెడుతుంటే గుండెలు చుక్ చుక్ మంటూ చిన్న రైలింజనులా కొట్టుకున్నాయి.

కొత్త స్కూలూ, కొత్తమొహాలూ, కొత్త క్లాసూ, కొత్త మేష్టరూ, కొత్తపుస్తకాలూ, కొత్త పరికిణీ, కొత్త జాకట్టూ .. అమ్మ వారంరోజులకిందట తనని బజారుకి తీసికెళ్లి, తను ఎంచుకున్న పువ్వుల పరికిణీగుడ్డా, మామిడిచిగురు రంగు జాకట్టు గుడ్డా కొని, అక్కడే అరుగుమీద కుట్టుమిషను పెట్టుకుని కూర్చున్న అమీరు సాయబుచేత కుట్టించిన కొత్త పరికిణీ, జాకట్టూ - సమస్తం చక్కగా అమిరేయి.

అయినా కొత్త క్లాసు కొత్త క్లాసే.

అడుగులో అడుగేసుకుంటూ, తల ఓర ఒంచుకుని దొంగతనం చేయబోతున్నట్టు చుట్టూ చూస్తూ క్లాసులో అడుగు పెట్టింది. మేష్టారు ఇంకా రాలేదు. మగపిల్లలందరూ కుడిపక్క వరసల్లోనూ, ఆడపిల్లలందరూ ఎడమపక్క బల్లలమీదా కూర్చున్నారు. మామూలుగా బాగా తెలివైనవాళ్లూ బుద్ధిమంతులూ ముందువరసల్లో కూర్చుంటారు. పాఠాలు చదవనివాళ్లూ, బొమ్మలేసుకునేవాళ్లూ వెనక వరసల్లో సర్దుకుంటారు.

అందరూ గలగల్లాడుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు. పరిమళ కళ్లు నెమ్మదిగా గది నలుమూలలా ఓ చుట్టు చుట్టి, ఎడమవేపు రెండోవరసలో కూర్చున్న ఇద్దరు అమ్మాయిలమీద వాలేయి. ఎందుకో వారిద్దరూ ప్రత్యేకంగా కనిపించారు. వాళ్లమీద ఆ పిల్లకళ్లు అట్టే నిలిచిపోయేయి. అందులో అటువేపు వున్న అమ్మాయి తనని గమనించి మెల్లిగా నవ్వి, పక్కనున్న అమ్మాయికి చెప్పినట్టుంది. రెండో అమ్మాయి వెనుదిరిగి తనవేపు చూసింది. కొన్ని ‘‘యుగాలసేపు’’ అనిపించినతరవాత, మెల్లిగా వాళ్లవేపు నడిచింది. వాళ్లు కూడా రమ్మన్నట్టు జరిగి చోటు చేసేరు బల్లమీద తనకి.

“నీపేరేమిటి” అని అడిగింది జరిగి చోటిచ్చిన అమ్మాయి. తెల్లగా, పల్చగా వుంది, కోలమొహం, గట్టిగా పట్టుకుంటే కందిపోతుందేమో అనిపించేంత సుకుమారం. ఆ అమ్మాయిపేరు రమణిట. రెండో అమ్మాయి చామనచాయ, నిన్నెక్కడో చూసేనంటూ పలకరించే కళ్లూ, పెదవులమీద చిరునవ్వు అక్కడే పుట్టిందేమో అనిపిస్తూంది. విశాలట ఆపిల్ల పేరు.

“పరిమళ” అంది తను వినిపించీ వినిపించనంత నెమ్మదిగా.

ష్ అన్నారు వెనకెవరో. మాష్టారు వచ్చేరు.

రమణితో మాటాడుతున్న పరిమళ ఇటు తిరిగి, అప్పుడే క్లాసులో ప్రవేశించిన మాష్టారిని చూసి, నోరు తెరుచుకు చూస్తూ వుండిపోయింది.  గుండె ధన్ ధన్ మని రెట్టింపు వేగంతో కొట్టుకుంటోంది. ఆయన వాళ్ల ఇల్లు గలాయన! వారం రోజులయింది వాళ్లింట్లో అద్దెకి దిగి. వచ్చిందగ్గరునుంచీ ఆయన ఏవో రూల్స్ పెడుతూనే వున్నారు.

ఆయన తనబల్లదగ్గరికి వెళ్లి, చుట్టూ ఓమారు చూసి, “హు ఓ కొత్తమ్మాయి వచ్చిందన్నమాట” అన్నారు తనవేపు చూస్తూ. తరవాత ఎటెండెన్స్ తీసుకుంటూ తనపేరు వచ్చేసరికి తలెత్తి తనవేపే చూస్తూ “ప్రమీల” అన్నారు.

“ప్రమీల కాదండీ, పరిమళ” అంది కాస్త బెదురుతో.

“పరిమళ” అన్నారు మేష్టారు తినేస్తున్నట్టు చూస్తూ.

క్లాసులో చిన్న నవ్వులు వినిపించేయి. సైలెన్స్ అంటూ అరిచేరు మేష్టారు.

ఇంగ్లీషు క్లాసు.

నాన్‌డిటైల్డ్ టెక్స్టుబుక్కు - పంచపాండవులూ ద్రోణాచార్యుడిదగ్గర విలువిద్య నేర్చుకోడం, అర్జునుడు చెట్టుమీద పిట్టకన్ను తప్ప మరేమీ కనిపించడం లేదనడం, ఆచార్యులవారు తదేకధ్యానం అంటే అదీ అని వివరించడం … పుస్తకంలోకి తలదూర్చేసిన పరిమళని వెనక కూర్చున్నమ్మాయి పెన్సిలుతో పొడిచింది,

పరిమళ వులిక్కిపడింది. బల్లమీద జామెట్రిబాక్స్ ధన్ మని కింద పడింది. ఇంగ్లీషు మేష్టారికి తెగ కోపం వచ్చేసింది.

ఎవరది అని ఆయన అడక్కుండానే తెలుస్తోంది. పరిమళ బల్లమీదనించి ఒంగి చెల్లాచెదరుగా పడిపోయిన స్కేలూ, కాంపసూ, పెన్సిలూ, రబ్బరూ, .. ఒక్కటొక్కటే ఏరుకుంటోంది ఆయనవేపు బెదురుగా చూస్తూ.

క్లాసులో అందరూ కిసకిసలాడుతున్నారు.

సైలెన్స్ అంటూ మేష్టారు అరిచి, పరిమళని "ఇలా రా" అని తన కుర్చీదగ్గరికి పిలిచారు.

పరిమళ జామెట్రీ బాక్సూ, అందులో వుండవలసిన సామానూ అంతా బల్లమీద పెట్టి ఆయనదగ్గరికి వెళ్లింది.

"ఆ పోపులడబ్బా నాక్లాసుకి ఎందుకు తెచ్చేవు?" అని అరిచేరాయన, కొట్టడమే తరువాయిగా.

పరిమళ జవాబు చెప్పలేదు.

"ఆ చెత్తడబ్బా ఇంగ్లీషుక్లాసులో కావాలా?" అని మళ్లీ అడిగేరు అధికారస్వరంతో.

"అక్కరలేదు సార్" అంది పరిమళ బెదురుగా.

"రేపటినించీ నాక్లాసుకి జామెట్రీబాక్స్ తీసుకురాకు, అందరికీ చెప్తున్నా, నాక్లాసుకి ఎవరూ జామెట్రీబాక్సు తీసుకురావడానికి వీల్లేదు" అంటూ క్లాసు మొత్తానికి తాఖీదిచ్చేరు ఆయన.

క్లాసులో మొత్తం ముప్ఫై జతల కళ్లు తనవేపు తిరిగేయి "నీనించే" అంటూ.

ఆ రోజుకి క్లాసు అయిపోయింది. తనకి జాగా ఇచ్చిన స్నేహితురాళ్లిద్దరూ, రమణీ, విశాలా మాటాడుకుంటూ బయటికి వచ్చేరు. వాళ్ల ఇళ్లు ఇరుగూ పొరుగూన్న. తనఇంటికి దారి అటువేపే. అంచేత వాళ్లతో నడుస్తూంది.

"మేష్టారికి నువ్వంటే కోపం. అనవసరంగా నీమీద కేకలేసేరు" అంది రమణి.

"నేనంటే ఆయనకెందుకూ కోపం?" అంది పరిమళ. నిజంగానే ఆ పిల్లకి అర్థం కాలేదు.

"ఏమో మరి. వాళ్లింట్లో అద్దెకి వున్నారు కదా. మరేదో అయివుంటుంది."

అప్పుడే ఓ నిర్ణయానికి వచ్చేసింది. ఇహమీదట ఇంగ్లీషుక్లాసుకి జామెట్రీబాక్స్ తీసుకెళ్లరాదు. మరి పెన్సిలూ, రబ్బరూ, పావులా కాసూ ఇవన్నీ ఎలా ... చేతిలో పట్టుక్కూచోలేదు కదా.

000

"లేడికి లేచిందే ప్రయాణమా" అంటూ కసిరిన అమ్మ "పోన్లెద్దూ ఓపని అయిపోయినా అయిపోయినట్టే" అనుకుంది తెల్లారి లేచేక. ఎలాగా బాబీకి కొనాలి కదా. పైగా ఆ కుట్టుపనివాడు అన్నరోజుకి ఇస్తాడో ఇవ్వడో. ఇప్పుడే మొదలెడితే నయం అని ఆ సాయంత్రమే తమ్ముడితోపాటు రామయ్యసెట్టి కొట్టుకి తీసికెళ్లింది బట్టలు కొనడానికి. బాబిగాడికి చొక్కా గుడ్డ ఎంపిక ఇట్టే అయిపోయింది కానీ పరిమళకి నచ్చిన రంగూ, పువ్వులూ, అంచూ కూడేసరికి పొద్దు వాలింది.

అమ్మ వాటికి ధర చెల్లించి, అరుగుమీదున్న అమీరు సాయిబుకిచ్చింది కుట్టడానికి.

సాయిబు కొలతలు తీసుకున్నాడు.

"నా జాకట్టుకి జేబు పెట్టు" అంది పరిమళ.

సాయిబు అమ్మవేపు చూశాడు.

"జాకట్టుకి జేబూ ఏమిటే?" అంది అమ్మ.

"బాబీ చొక్కాకి పెడుతున్నాడు కదా. నాకూ అలాగే పెట్టమను" అంది పరిమళ అదేమీ వింత కానట్టు.

"వాడంటే మగవాడు" అంది అమ్మ.

‘‘వాడు మొగవాడయితే నేను ఆడవాడు. నాజాకట్టుకి జేబు వుండాలి. లేకపోతే నాకు జాకట్టే అక్కర్లేదు.’’

‘‘ఆడవాడు ఏమిటే?’’ అంది అమ్మ నవ్వుతూ.

.‘‘జాకట్టుకి జేబు బాగుండదు అమ్మాయిగారూ’’ అన్నాడు సాయిబు.

‘‘నాకు బాగుంటుంది’’ అంది పరిమళ పట్టుదలగా.

‘‘పోనిద్దూ. సరదా పడుతోంది. ఓ చిన్న ముక్క అతికిద్దూ’’ అంది అమ్మ. ఇదేదో తెమిల్తే కానీ ఇంటికెళ్లి వంట మొదలెట్టడం జరగదు. ఏడు కొట్టేసరికి కంచంముందు కూచోపోతే నోష వచ్చేస్తుంది ఆయనగారికి.

జేబు పెట్టడానికి ఒప్పందం అయింతరవాత ఎక్కడ అన్న ప్రశ్న వచ్చింది. అబ్బాయిలచొక్కాల్లా గుండెలమీదా, తాతగారి జుబ్బాకి వున్నట్టు చివర అంచులదగ్గరా...

పరిమళ, ‘‘నాకదంతా తెలీదు. నాకు జేబు కావాలి, పెన్సిలూ, రబ్బరూ పెట్టుకోడానికి,’’ అంది.

‘‘పెన్సిలూ, రబ్బరూ కింద పడిపోతాయి మీరు ఏ చెమ్మా చెక్కావో ఆడుతున్నప్పుడు’’ అన్నాడు సాయిబు.

‘‘అయితే పక్కకి పెట్టు’’ అంది పరిమళ.

మొత్తమ్మీద పరిమళ జాకట్టుకి పక్కజేబు పెట్టడానికి నిశ్చయం అయేసరికి ఆరుంబావు అయింది. అమ్మ తొందరపడుతూ పిల్లలిద్దరినీ రిక్షా ఎక్కించి ఇల్లు చేరింది ఆరాటపడిపోతూ.

మర్నాడు తెలుగు గ్రామరుక్లాసు. పరిమళకి ఇంగ్లీషు మేష్టరంటే ఎంత భయమో తెలుగుమాష్టారంటే అంత ఇష్టం. ఆయన చెప్పే పద్యాలూ, గ్రామరూ, అన్నీ ఎంతో చక్కగా అర్థం అవుతాయి తనకి.

పాణిని కథ చెప్తున్నారు.

*పరిపూర్ణ చంద్రబింబమువోలె శాంతమై కళకళలాడు మొగంబు వాడు*

*ఉన్న తోరస్కుండయి చూడంగ తగు మేని సొబగువాడు*

*ఆసాయమాయాసమనక గురవర పదాబ్జ శుశ్రూష నెరపువాడు*

*గాని అది ఏమి పాపమో గడగి యొక్క పాఠమయిన అప్పగించిన పాపమున బోఁడు.*

పరిమళకి ఈపద్యం చాలా ఇష్టం. చివరిపాదంలో చమత్కారం ఆ పిల్ల మనసునాకట్టుకుంది. పద్యంలో పదే పదే ''వాడు'' అని రావడంతో నిన్నట్నుంచీ తనని వేధిస్తున్న ప్రశ్నకి సమాధానం కనుక్కోవాలి అనిపించింది. క్లాసు అయిపోయిన తరవాత మేష్టారిదగ్గరికి వచ్చింది ''నాకో సందేహం మాష్టారూ'' అంటూ.

''ఏమిటమ్మా?'' అన్నారాయన చిరునవ్వుతో. ఆయనకి కూడా పరిమళ అంటే ప్రత్యేకాభిమానం చాలా తెలివైనదని.

''అదేనండీ. వాడు ఏకవచనం, వారు బహువచనం కదండీ.''

''అవునమ్మా''

''మగవాడు ఏకవచనం, మగవారు బహువచనం. మరి ఆడవారు బహువచనం కదా, ఆడవాడు ఏకవచనం ఎందుకు కాదూ?''

మాష్టారు నవ్వేరు,

పరిమళ మాత్రం నవ్వలేదు. ఆ పిల్లకి నిజంగానే ఆ సందేహం వచ్చింది. తనకి సమాధానం కావాలి.

''వ్యాకరణం ఎందుకు ఎలా లేదో చెప్పదమ్మా. వున్న మాటలు కాలగతిలో ఎలా రూపాంతరం పొందేయో చెప్పుతుంది అంతే. నువ్వు ఆడవాడు అంటే, మరో పదిమంది అలాగే అంటే అదే కరెక్టయిపోతుంది కొంతకాలానికి. నువ్వు గొప్ప రచయిత్రివి అయింతరవాత చెయ్యి ఆ పని.'' అన్నారాయన సగం హాస్యంగానూ, సగం నిజంగానూ.

“నేనిప్పుడే అంటానండీ,” అంది పరిమళ. ఆ పిల్లకి ఆయనదగ్గర అంత చనువుంది మరి.

“లేదులే. నువ్వు పెద్ద రచయిత్రివి అయేవరకూ ఆగాలి. అప్పుడయితే నీమాట చెల్లుతుంది. ఆర్షప్రయోగం అని అందరూ మెచ్చుకుంటారు. ఇప్పుడంటే, నీకు భాష రాదంటారు. ఇంతకీ ఈ వాదన ఎందుకు వచ్చిందసలు?” అన్నారు మేష్టారు.

పక్కనే వున్న రమణి “ఈ జాకట్టుజేబుతో వచ్చిందండీ”, అంది నవ్వుతూ, ఆ జేబు ఆయనకి కనిపించేలా రవంత లాగి.

“ఏమిటీ .. నేనెప్పుడూ జాకట్టుకి జేబు చూడలేదులే .. అందుకన్నాను,” ఆయన పరిమళ మొహంలోకి చూస్తూ.

“అదేనండీ మన పరిమళ అంటే.” అంది వెనకునున్న విశాల.

000

ఆ రాత్రంతా ఆలోచిస్తూనే వుంది పరిమళ. జేబుకి ఆడా మగా ఏమిటి అని. చాలా చాలా ఏళ్లకి ముందు, అమ్మా, అమ్మమ్మా బయటికి వెళ్లని రోజుల్లో వాళ్లకి, ఇలా పెన్సిళ్లూ, రబ్బరు ముక్కలూ పట్టుకు తిరగాల్సిన అవుసరం లేని రోజుల్లో జేబులు అక్కర్లేకపోయి వుండొచ్చు. ఇప్పుడు తను అవన్నీ పట్టుకు తిరగాలంటే, రోజు మహ చిరాగ్గా వుంటోంది పొద్దస్తమానం, ఏదో ఒకటి చేతిలోంచి జారి పడిపోవడం, మళ్లీ కొత్తది కావాలని ఇంట్లో పేచీ.

“పోనీ చిన్నసంచీ కుట్టిస్తా, అందులో పెట్టుకో” అంది అక్కయ్య. కానీ ఆ సంచీ కూడా పారేసుకోకుండా చూసుకోవాలి కదా అస్తమానం. అదీ ఓ పనే ... జేబు అయితే ఈ వస్తుసముదాయం అంతా ఓ చోట పడుంటాయి. తాను అనుక్షణం చూసుకోనక్కర్లేదు పెన్సిలుందా, రబ్బరుందా ... అనుకుంటూ. అప్పుడు తన తలకాయని వేరే విషయాలకి వినియోగించుకోవచ్చు కదా అనుకుంటూ నిద్ర పోయింది.

000

పదిహేనేళ్లయింది. అమెరికాలో స్థిరపడిన పరిమళ రమణిని చూడ్డానికి వాళ్లింటికొచ్చింది.

రమణి ఉప్పొంగిపోతూ, "అబ్బ, ఎన్నాళ్లకెన్నాళ్లకి కనిపించేవే. నిన్ను మళ్లీ చూస్తాననుకోలేదు. ఎప్పుడో ఏడాదికో రెండేళ్లకో నీకథలు పత్రికలలో కనిపించినప్పుడల్లా నేనూ విశాలా నీగురించే అనుకుంటాం."

పరిమళ కూడా పొంగిపోయింది తనకథ చదివి, "మన పరిమళ" రాసిందనుకుంటూ మురిసిపోయేవారున్నారని తెలిసి.

రమణి, "పద, పద, విశాల హైదరాబాదులో వుంటుంది కానీ వాళ్లక్కయ్యని చూడ్డానికొచ్చిందిట. పద, వాళ్లింటికెళ్దాం" అంటూ హడావుడి చేసి లాక్కుపోయింది వాళ్లింటికి.

విశాల ఇంట్లో ముగ్గురూ కూచుని పొట్టాచారిగారి గురించీ, లెక్కల మాష్టారు గురించీ, ఇంకా ఎన్నో విషయాలు గలగల మాటాడేసుకున్నారు. "ఆ రోజుల్లో నువ్వొక్కదానివే పరికిణీ, జేబు జాకట్టుతో క్లాసు కొచ్చేదానివి. మేం నవ్వుకునేవాళ్లం నీ తెలివితేటలకి" అంది రమణి.

పరిమళ కూడా నవ్వేసి, "మీరెందుకు పెట్టించుకోలేదూ మీజాకట్లకి పోకెట్లు?" అంది.

"ఎక్కడ ... మాఅక్కయ్యకి చాలనివన్నీ సద్వినియోగం చెయ్యడంతోనే సరిపోయింది నాకు" అంది విశాల.

"నాకు ఆ అదృష్టం కూడా లేదు. నాకు వున్నవాడొక్కడూ అన్నయ్య అయిపోయేడు. వాడి చొక్కాలు నన్ను తొడుక్కోనిస్తే, జేబులు అవే వచ్చేసి వుండేవి, ప్చ్, తోచలేదు కానీ" అంది రమణి.

"మన తెలుగు మేష్టారు ఎక్కడున్నారు?" అనడిగింది పరిమళ.

"రిటైరయిపోయారు. ఆ ఇంట్లోనే వున్నారు."

‘‘పెళ్లి చూద్దామా’’ అంది పరిమళ చిన్నప్పటి ప్రసంగాలు లీలగా మనసులో మెదిలి.

‘‘పదండయితే తొరగా. ఇప్పుడయితే ఆయన ఇంట్లోనే వుంటారు. మరో గంట పోతే దొరకరు. పార్కుకి వెళ్లిపోతారు.’’ అంది విశాల.

ముగ్గురూ కలిసి మేష్టారింటికి వచ్చేరు. ఆయన వరండాలో కూర్చున్నారు భాగవతం చదువుకుంటూ. పక్కనే స్తంభాన్నానుకుని కూర్చుని, రాత్రికూరకి చిక్కుడుకాయలు ఈనెలు తీస్తున్నారు ఆయన భార్య కామమ్మగారు.

గేటు తోసుకుని వస్తున్న ఇద్దరు ఆడవాళ్లని చూసి, మేష్టారు చత్వారం కళ్లద్దాలు సవరించుకుంటూ ‘‘ఎవరూ?’’ అన్నారు.

కామమ్మగారు గుర్తు పట్టి, ‘‘అదేనండీ, రమణీ, విశాలా, పరిమళాను’’ అని, ‘‘రండమ్మా’’ అంటూ వాళ్లని ఆహ్వానించింది ఆప్యాయంగా.

వాళ్లు మేష్టారికి నమస్కారాలు చేసి, ఆ పక్కనే చాపమీద కూర్చున్నారు.

‘‘జేబుజాకట్టు పరిమళేనా’’ అన్నారు నవ్వుతూ మేష్టారు,

రమణి కూడా నవ్వింది, ‘‘అవునండీ అదే’’ అంటూ.

పరిమళ సిగ్గు పడిపోయింది. ఏమిటో అప్పట్లో అలా బుద్ధి పుట్టింది అనుకుంటూ.

కామమ్మగారు ఇంట్లోకి వెళ్లి, మూడు గ్లాసుల్లో మజ్జిగ తీసుకొచ్చారు.

‘‘ఇప్పుడెందుకండీ’’ అంటూనే పుచ్చుకున్నారు వాళ్ళు ముగ్గురూను.

‘‘అమెరికాలో వున్నావన్నమాట అయితే. కిందటినెల మా మనవరాలొచ్చి వెళ్లిందిలే, పాంట్లూ, షర్టులూను. నువ్వూ అంతేనేమో. ... నిలువునా జేబులే... ’’ అన్నారాయన మాటలసందర్భంలో నవ్వుతూ.

‘‘జేబూలూ, ఆ జేబులనిండా నోట్లూ... అంతేనా ...’’ అన్నారు కామమ్మగారు కూడా నవ్వుతూ. ఆవిడ హాస్యానికే అన్నారు.

పరిమళ చప్పున మొహం పక్కకి తిప్పుకుని, ‘‘అదేం లేదండీ’’ అంది.

అది కామమ్మగారి దృష్టి దాటిపోలేదు. "అయ్యో అలా అనకుండా వుండవలసింది" అనుకున్నారావిడ మనసులోనే.

పరిమళ మాత్రం అంతలోనే తేరుకుని, తేలిగ్గా నవ్వేస్తూ, "జేబు కాదండీ జోలె ఇప్పుడు" అంది చేతిసంచీ చూపిస్తూ. తరవాత సంచీలోంచి "ఇది మీకోసం" అంటూ ఓ బాల్ పాయింటు పెన్ను తీసి మేష్టారికిచ్చింది. ఆయన అందుకున్నారు కృష్ణార్పణం అంటూ.

రమణి "ఎన్ని జేబులున్నా, ఎక్కడున్నా మన పరిమళ మన పరిమళేనండీ మాష్టారూ. జేబులనిండా ఇప్పటికీ కాగితాలూ, పెన్సిళ్లే" అంది.

"అవున్ట. కథలు రాస్తున్నావని విన్నాను. చదువులతల్లి కటాక్షం వుంది నీకు. నేను అప్పుడే అనుకున్నాను నువ్వు మంచి రచయిత్రివి అవుతావనీ. అదే సంతోషం నాకు" అన్నారు మేష్టారు.

"మంచి రచయిత్రిననేం లేదండీ. ఏదో గిలుకుతూంటాను తోచినప్పుడు" అంది పరిమళ వినయంగా.

"అదేనమ్మా. జేబు పెన్సిలు దాచుకోడానికి, పెన్సిలు మనసు దాచుకోడానికి" అన్నారు మాష్టారు నెమ్మదిగా ఎటో చూస్తూ.

ఆపైన ఎవరికీ మాటలు తోచలేదు. నిశ్శబ్దం బరువుగా తెర దించింది వారిమధ్య.

"చీకటి పడుతోంది, వెళ్లొస్తాం మేష్టారూ" అంటూ లేచేరు ముగ్గురూను.

"ఉండండమ్మా, ఒక్కక్షణం" అంటూ కామమ్మగారు లోపలికి వెళ్లి, ఓపళ్లెంలో పళ్లూ తాంబూలంతోనూ తిరిగొచ్చారు. ముగ్గురికీ బొట్టు పెట్టి, తాంబూలం చేతిలో పెట్టారు.

పరిమళ వంగి వారిద్దరికాళ్లకి దణ్ణం పెడుతుంటే కళ్ల నీళ్లొచ్చాయి. తను ఈ సంప్రదాయాలు మరిచిపోయి ఎంతకాలం అయిందో .... కానీ ఈరోజు అప్రయత్నంగానే వంగి దణ్ణం పెట్టేసింది.

మరోసారి "వెళ్లొస్తాం మాష్టారూ, వెళ్లొస్తాం అమ్మా," అని ఇద్దరికీ చెప్పి గేటువేపు నడిచారు ముగ్గురూ..

పరిమళ గేటుదగ్గర ఒక్కక్షణం ఆగింది. ఓరవొంపుగా తలొంచి, కొనకళ్ల చూస్తే ఆయన కళ్లొత్తుకోడం కనిపించింది.

చిన్నగా నిట్టూర్చి, రమణిభుజమ్మీద చెయ్యేసి ముందుకి నడిచింది ....

000

*(పైన ఉదహరించిన పద్యం నాకు గుర్తున్నట్టుగా రాసేను. తప్పులుండొచ్చు. రూపసీ, బుద్ధిమంతుడూ అయిన పాణిని బాల్యంలో విద్యాసముపార్జనలో మాత్రం అట్టే ప్రకాశించలేదట.. ఆయన కొంతకాలం గురుకులవాసం చేసి, తరవాత, సహవాసులు హేళన చేయడంచేతో, గురువుగారి ప్రోద్బలంతోనో హిమాలయాలకు వెళ్లి, తపస్సు చేసి అఘటిత ప్రజ్ఞాధురీణుడు అయినాడనీ ఒక కథ).*

*(ఆగస్టు 2008 తెలుగుతూలికలో ప్రచురితం )*

# 10. "నేను"

(ఒకరు మరొకరిని ఎన్ని తప్పుడుమాటలయినా అనొచ్చు. ఫరవాలేదు. కానీ చెయ్యి చేసుకుంటే తప్పు. కోర్టుటీవీ ప్రోగ్రాంలలో చూశాను ఈ నీతి. ఆ స్ఫూర్తితో రాసిన కథ.)

మునిసిపల్ ఆఫీసులో నేను కొత్తగా ఉద్యోగంలో చేరినరోజులు.

నేను చేరడానికి పదిరోజులముందు చేరేట్ట సత్యం అని ఒక టైపిస్టు. వంకరటింకరగా గీసినట్టున్నకళ్లూ, తుప్పజుత్తూ, పొట్టిగా, పీలగా, గట్టిగా గాలేస్తే ఎగిరిపోతాడేమో అన్నట్టుండేవాడు. యస్సెల్సీ అయిందనిపించుకుని టైపు నేర్చుకుని ఉద్యోగంలో చేరేడు. ఎవరితో మాట్లాడేవాడు కాదు.

రెండురోజుల్లో నాకు అర్థమయింది. ఆ అబ్బాయికి కొంచెం నత్తి. అంచేతే మాట్లాడడు. అంచేతే పెద్ద చదువులకి పోకుండా టైపు నేర్చుకుని, మాట్లాడక్కర్లేని పనిలో స్థిరబడ్డాడు.

నాకు మరికొన్ని వివరాలు తెలిసేసరికి మరో రెణ్ణెల్లు పట్టింది. వాళ్లమ్మ పొరుగూరు మునసబుగారింట్లో పాచిపని చేస్తుందిట. మునసబుగారు ఇక్కడ ఆఫీసులో తన పలుకుబడి వినియోగించి టైపిస్టు వుద్యోగం ఇప్పించేరు.

ఆఫీసులో సత్యాన్ని సత్యనారాయణ అని పూర్తిపేరుతో ఎవరూ పిలవగా నేను వినలేదు. సత్యం అని కూడా కాదు. అయితే సత్తిగాడు లేకపోతే నత్తిగాడు.

టైపు మాత్రం చాలా బాగా చేసేవాడు. కుప్పలు, కుప్పలు ఫైళ్లు ఇట్టే టైపు చేసి పారేసేవాడు. ఒక్క తప్పులేకుండా. సార్ ఎప్పుడయినా ఉత్తరాలు డిక్టేటు చేస్తే, ఏదో రాస్తున్నట్టు గిలికేవాడు షార్టుహేండులో. తరవాత తనభాషలో టైపు చేసేసేవాడు. నాకు అది తెలుసుకోడానికి కొంత కాలం పట్టింది. ఓ రోజు అడిగేను, నిజంగా నువ్వు

షార్టుహేండు తీసుకుంటున్నావా అని. అతను నవ్వి తనసీటుకి వెళ్లిపోయేడు. అదే తొలిసారి అతనిమొహమ్మీద నవ్వు చూడ్డం నేను. నాకు కూడా సంతోషంగా అనిపించింది ఆ పూట.

సత్యాన్ని ఎగతాళి చేసేవాళ్లలో ముఖ్యుడు కనకరాజు. అతడు స్ఫురద్రూపి. ఒడ్డూ పొడుక్కీ తగ్గట్టు పచ్చని పసిమిరంగు శరీరచ్ఛాయా, ఎక్స్‌రే కళ్లూ, ఉంగరాలజుత్తూ -కథానాయకుడికి కావలసిన హంగులన్నీ వున్నాయి. ఆ పైన కలవారి అబ్బాయిట. చదువుమీద శ్రద్ధ లేకపోవడంతో బియే అవగానే ఉద్యోగంలో పెట్టేరు వాళ్లనాన్నగారు. సరదాకో కాలక్షేపానికో వస్తున్నట్టు వేంచేసేవాడు ఆఫీసుకి.

కనకరాజు కూడా సత్యాన్ని సత్యం అని నోరారా పిలవగా నేనెప్పుడూ వినలేదు. ఎప్పుడయినా సరే, ఎవరిఎదుట అయినా సరే ''ఒరే సత్తిగా,'' ''నత్తిగా,'' ''పొట్టోడా,'' ''సోడాబుడ్డీ కళ్లోడా'' ... ఇలాగే వుండేవి అతని సంబోధనలన్నీ.

అక్కడికీ వూరుకోలేక ఓసారి అడిగేను, ''కనకరాజుగారూ, ఎందుకండీ అతన్ని అలా పేర్లు పెట్టి హేళన చేస్తారు?'' అని.

కనకరాజు తేలిగ్గా నవ్వేసి. ''అదేంలేదు మేడం. చిన్నప్పట్నుంచీ ఎరుగున్నోళ్లం. ఒకే వూరోళ్లం. ఆడేం అనుకోడు మేడం.'' అన్నాడు.

నిజమే కాబోలు అనుకున్నాను. ఎందుకంటే నాకూ వున్నారు అలాటి స్నేహితులు. అచ్చంగా అలాగే కాకపోయినా, ఒకరినొకరం మాట అనుకోడం, నవ్వేసి వూరుకోడం నాకూ అలవాటే. నా కాలేజీరోజుల్లో కమ్మవారమ్మాయి నాక్లాసుమేటు. నన్ను ''నల్లబ్రాహ్మల్ని నమ్మకూడదు'' అనేది తను. ''కమ్మల్నీ తుమ్మల్నీ నమ్మరాదు'' అనేదాన్ని నేను. అక్కడితో సరి. దాన్నెప్పుడూ మేం కులాలవారీ యుద్ధంగా తీసుకోలేదు. మా స్నేహానికి అంతరాయం కలగలేదు. ఇప్పటికీ నేను విశాఖపట్నం వస్తే నన్ను చూడ్డానికి విజయవాడనించి వస్తుంది. కనకరాజుకీ సత్యనారాయణకీ కూడా అలాటిస్నేహమేనేమో అని నేను వూరుకున్నాను.

ooo

మధ్యాహ్నం టిఫిను టైమవుతోంది. చూస్తున్న ఫైళ్లు మూసేసి, లేవబోతుంటే, సత్యం నాబల్లదగ్గరకి వచ్చేడు. ఏదో ఒకటి మాట్లాడాలి కనక, ‘‘అయిపోయిందా పని?’’ అన్నాను.

సత్యం తలొంచుకు నిలబడ్డాడు. ఆ తరవాత ఓకాయితం నాకు అందిచ్చాడు చూడమని.

చదివేను. పది భావకవితలు చదివి వాటిలోంచి నాలుగుపాదాలు తీసుకుని ఎవరో అమ్మాయిని ఉద్దేశించి రాసినట్టున్నాడు. నాకు నవ్వొచ్చింది కానీ నవ్వలేదు. ‘‘బాగుంది’’ అని చెప్పి తిరిగి యిచ్చేసాను ఆ కాయితం.

కొంచెంసేపు వూరుకుని, ‘‘ఎందుకు మేడం, అందరూ నన్ను అలా మాటలంటారు?’’ అన్నాడు నత్తి కప్పి పుచ్చుకోడానికి అవస్థ పడుతూ.

నాకేం చెప్పాలో తోచలేదు.

మళ్లీ అతనే నెమ్మదిగా, తలొంచుకుని నేలచూపులు చూస్తూ, ‘‘నేను మాత్రం మనిషిని కానా? నేనేం అందంగా లేనా?’’

ఉలికిపడి తేరి చూశాను అతనివేపు. వేరే సందర్భంలో వేరే స్థలంలో ఇంకెవరైనా కనిపించి, ‘‘మీఆఫీసులో సత్యనారాయణ అని ఓ అబ్బాయి వున్నాట్ట. ఎలా వుంటాడేమిటి చూడ్డానికి?’’ అని ఎవరైనా అడిగితే, తడుముకోకుండా వెంటనే, ‘‘ఘోరంగా వుంటాడు’’ అనేసి, మళ్లీ ‘‘చూడ్డానికి ఘోరంగా వుంటాడు కానీ మనిషి మంచివాడు, పని బాగా చేస్తాడు కానీ ..చూడ్డానికి మాత్రం ...’’ అంటూ నాలుగు నంగిమాటలు అనివుండేదాన్ని.

కానీ ఈ క్షణం ... ప్రత్యేకించి ఈ క్షణంలో నాకు తెలివొచ్చింది. అతని ప్రశ్నలో సత్యం బోధపడింది. ఈ క్షణంలో నేను చూసిన సత్యంమొహం జన్మలో మరువలేను.

ఆ క్షణంలోనే నాకు అర్థమయింది. అతన్నిగురించి నేను ఏం అనుకుంటున్నాను అన్నది కాదు ప్రధానం. అతనికి తనమీద తనకి గల అభిప్రాయమే నేను గౌరవించాలి.

నాకు తేరుకోడానికి రెండు నిముషాలు పట్టింది. “ఎందుకలా అనుకుంటారు మీరు? మీగురించి మీకు వున్నఅభిప్రాయం ప్రధానం కానీ ఎవరో ఏదో అంటున్నారని మీరెందుకు బాధ పడడం?” అన్నాను.

నామాటలు నాకే బోళాగా వినిపించేయి. కానీ అంతకంటే ఏం చెయ్యను? ఏం చెప్పగలను? మనకొచ్చిన చదువులూ, మనం నేర్చిన నాగరికతలూ అలాటివి.

“నమస్తే మేడమ్” అనేసి సత్యం వెనుదిరిగి వెళ్లిపోయేడు.

నాకు మాత్రం ఆ రాత్రంతా నిద్ర పట్టలేదు.

ఆ తరవాత వరసగా రెండురోజులు ఆఫీసులో మిగతా గుమాస్తాలు కూడా సత్యాన్ని ఎగతాళి చెయ్యడం మొదలు పెట్టేరు.

“ఏరా నత్తిగా! ప్రేమగీతాలు రాస్తున్నవేటి? ఎవుర్రా ఆ పిల్ల?”

“జాగర్తరోయ్. పిల్ల తాలూకాళ్లు చూసేరంటే మక్కలిరగదన్నేగల్రు.”

“నత్తోడికి పిల్లనెవరిస్తార్రా ఎర్రెదవా. ఆయిగ నీబతుకేదో నివ్వు బతుకు. ఎర్రేసాలు పోమాక.”

వాళ్లమాటలు చూస్తే నాకు మహ చిరాకేస్తోంది. కనకరాజు మాటలు గుర్తొచ్చేయి. వాళ్లకీ వాళ్లకీ వున్న స్నేహాలు అలాటివిలే అని నన్ను నేను సమాధానపర్చుకోడం కూడా కష్టంగానే వుంది.

ఆ రోజు సత్యం కొత్తచొక్కా, కొత్తపేంటు వేసుకు వచ్చాడు. మనిషిలో ఎన్నడూ లేని హుషారు కనిపిస్తోంది. ఏదో విశేషం వుంది అనుకున్నాను కానీ అడగలేదు. తలొంచుకుని ముందున్న ఫైలు చూస్తున్నాను.

“ఏరా, పెళ్లికొడకా, ఎప్పుడ్రా పప్పన్నాలు?” అంటూ కనకరాజు వచ్చేడు.

నేను తలెత్తి చూశాను. సత్యం మాటాడకుండా టైపు చేసుకుపోతున్నాడు తనమానాన.

“ఒరే, నామాటిని చేస్కోనని చెప్పేయరా. చేసుకుంటివా, కనీసం మరో అవిటోన్ని పుట్టించి నాలాటోల్ల ప్రానాలు తీమాక” కనకరాజు నవ్వేడు గలగలా.

సత్యం తలెత్తి విసురుగా చూసేడు.

ఆ మాట ఏ సంబంధమూ లేని నాకే ఛెళ్లున తగిలింది. "కనకరాజుగారూ," ఏదో అనబోతున్నాను. నావాక్యం పూర్తి కానేలేదు. సత్యం చేతిలో వున్న క్లిప్ బోర్డు విసిరి కొట్టేడు కనకరాజుమీదికి. అది అతని నుదుటికి తగిలి నేలమీద పడింది రప్మని చప్పుడు చేస్తూ. కనకరాజు నుదురు చిట్లింది.

కనకరాజు నోటికిరాని తిట్లు లంకించుకుని, సత్యంకాలరు పుచ్చుకుని గుంజేడు. మరో ఇద్దరు గుమాస్తాలూ, ఆఫీసు ప్యూను వచ్చి వాళ్లని విడిపించేరు.

సార్ గబగబా వచ్చేరు "ఏమయిందేమయింది?" అంటూ.

అక్కడ వున్నవారందరూ గలగలా ఎవరి వెర్షను వాళ్లు చెప్పడం మొదలెట్టేరు గోలగోలగా. మౌనంగా చూస్తూ వూరుకున్నదాన్ని నేనొక్కర్తినే.

సార్ షటప్ అని అరిచి అందరినోళ్లూ మూసి, ఎవరి సీటులోకి వారిని తోలేసి, కనకరాజునీ, సత్యాన్ని "పదండి నారూంకి" అంటూ తనవెంట తీసుకుపోయేరు.

ఓ గంట తరవాత, నన్ను పిలిచేరు. "మీ సెక్షనులో మీ సమక్షంలో జరిగింది కనక మీకే సంగతి బాగా తెలియాలి. అంచేత మీరు రిపోర్టు రాసి ఇవ్వండి. తరవాత నేను వాళ్లిద్దరిమీదా తగినచర్య తీసుకుంటాను" అన్నారు.

"అంతకుముందేం జరిగిందో, వాళ్లిద్దరిమధ్యన ఏం లావాదేవీలున్నాయో నాకు తెలీవండీ" అన్నాను ఆ రంధిలో ఇరుక్కోడం ఇష్టం లేక.

"అవన్నీ మనకి అక్కర్లేదండీ. ఈ పూట మీ రూంలో ఏంజరిగిందో మీరు చూసింది చూసినట్టు రాసివ్వండి చాలు. తరవాత నేను చూసుకుంటాను," అన్నారాయన.

"సరేనండీ" అని చెప్పి వచ్చేశాను. సత్యం నావేపు ఒకసారి చూసి తలొంచుకుని టైపులో పడిపోయేడు. పక్కగదిలో కనకరాజు సణుగుడు ఇంకా వినిపిస్తూనే వుంది.

ఆ సాయంత్రం ఇంటికొచ్చి, కాఫీ తాగి, పత్రిక పట్టుకుని కూర్చున్నాను. కనకరాజు వచ్చేడు, "నమస్తే మేడమ్" అంటూ.

‘‘రండి, ఏం ఇలా వచ్చేరు?’’ అన్నాను ఎదటికుర్చీ చూపిస్తూ.

కనకరాజు అట్టే తాత్సారం చెయ్యలేదు. ‘‘మీరు రిపోర్టు రాస్తన్నరంట కదా మేడమ్,’’ అన్నాడు.

‘‘ఊఁ’’ అన్నాను ప్రశ్నార్థకంగా అతనివేపు చూస్తూ.

‘‘అదికాదు మేడమ్. నా తప్పేమిటి చెప్పండి మేడమ్. నేనేం కానిమాట అంటినా?’’ అన్నాడు. తన తప్పేం లేదని గట్టిగానే నమ్ముతున్నట్టు కనిపించేడు,

‘‘మీరు అలా అతన్ని నానాపేర్లూ పెట్టి పిలవడం బావులేదండీ మరీ’’ అన్నాను వచ్చిన అవకాశాన్ని వదులుకోకుండా. చాలారోజులుగా ఈమాట కనకరాజుకి చెప్పాలని వుంది నాకు.

‘‘నేనేం లేనిమాట అన్నాను మేడమ్? అవిటోన్ని అవిటోడు అంటే తప్పెట్ల అవుతాది? వున్నమాటే గద. అది సత్యమే గద’’ అన్నాడతను.

‘‘ఆ మాట బాధిస్తుంది కనక’’ అన్నాను.

‘‘అయితే, నన్నూ అనమండి పడతాను. అంతే కానీ కొడితే ఎట్లా? చూడండి చందమామలో మచ్చమాదిరి నుదుటిమీద ఈ మచ్చ శాశ్తంగా వుండిపోతది. అసలు కొట్టానికి ఆడికేటి అధికారం వున్నది?’’

నేను అతనివేపే చూస్తూ వుండిపోయాను కొన్నిక్షణాలపాటు. ఈ మనిషితత్త్వం ఏమయివుంటుంది? కనకరాజుకి సంబంధించినంతవరకూ - లోకం సమస్తం తనచుట్టూ తిరుగుతోంది, తనకి తెలిసిందే జ్ఞానం. తనఅనుభవంలోకి వచ్చిందే వాస్తవం. తనకి కలిగిందే నొప్పి. అంతే.

కానీ ఎదటిమనిషి కూడా తనలాటివాడే అనీ, తనకిలాగే అవతలివాడికి కూడా ఓ మనసుంటుందనీ, అది నొచ్చుకోగలదనీ కనకరాజులాటి మనుషులకి తోచదు. తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చునేమో కానీ కనకరాజుమనసు రంజింపజేయడం నాతరం కాదు..

‘‘సరేలెండి. రేపు చూద్దాం. పన్లో వున్నాను,’’ అన్నాను చేతిలో పత్రిక కింద పడేస్తూ.

కనకరాజు లేస్తూ, ‘‘నామాదిరి అందగాడయితే అనుకోవచ్చును గానీ అవిటోన్ని అవిటోడు అంటే తప్పేంటి?’’ అంటూ మరోసారి వెకిలిగా నవ్వి పెద్ద పెద్ద అంగలేసుకుంటూ నిష్క్రమించేడు.

నాకు ఆలోచనలు ఒకంతట తెగలేదు. ఒకరిమీద చెయ్యి చేసుకోరాదు. ఈటెల్లాటి మాటలతో పోట్లు పొడిస్తే తప్పు లేదు. ఇదీ కోర్టులు చెప్పే న్యాయం. ఎదటివాడిమీద చెయ్యి చేసుకున్నవాడిదే తప్పు. వాడికే శిక్ష.

మరి నా కర్తవ్యం కూడా అదేనా? ... ‘‘నేను అందంగా లేనా?’’ అంటూ ప్రశ్నిస్తూన్న సత్యం నా మనసులో కొచ్చేడు. అతనిలో ఆ ‘‘నేను’’ ... అదే అహం. అదే జీవం. అదే ప్రాణం. అదే పొద్దు పొడిచిందగ్గర్నుంచీ పొద్దుగూకేవరకూ మనిషిని నడిపించే మహాయంత్రం. అదే ‘‘అయిదురేకుల దీపకళిక’’. ఎదటివారికి ఎంత హీనంగా కనిపించినా, మనిషి జన్మ ఎత్తిన ప్రతివాడిలో ఆ ‘‘నేను’’ వుంటుంది నిస్సందేహంగా. వుండితీరాలి. సత్యం ఈరేడులోకాలా ఏ గణనాంకాల్లోకీ ఎక్కకపోవచ్చు కానీ తనకి తాను ఒక మనిషే1

కలం తీసుకున్నాను రిపోర్టు రాయడానికి.

000

(తెలుగు తూలిక 22 జూన్ 2009)

# 11. రంగు తోలు

ఆదివారం. నీలవేణికి తోచడంలేదు. వూళ్లో నాటకసమాజమొకటి ఏదో నాటకం, భిన్నజాతులసంఘర్షణగురించి వేస్తున్నారని టీవీలో చూసింది. అదేమిటో చూద్దాం అనిపించి సుందరాన్ని అడిగింది. అతను రాబోయే కాన్ఫరెన్సుకోసం సీరియస్‌గా పేపరు రాసుకుంటున్నాడు. తనకి టైం లేదని అనడంతో ఒక్కతే బయల్దేరింది.

సుందరం కారులో దింపుతాననీ, నాటకం అయేవేళకి మళ్లీ వస్తాననీ చెప్పాడు. థియేటర్ అట్టే దూరం లేదు. అట్టే చలి లేదు, నడిచి వెళ్తానంది నీలవేణి. వచ్చేటప్పుడు మాత్రం తనొచ్చేవరకూ గేటుదగ్గరే వుండమని గట్టిగా చెప్పాడతను.

థియేటర్ దగ్గర జనం బాగానే వున్నారు. టికెట్లు అమ్ముడయిపోయేయి. దిక్కులు చూస్తూ నిలబడ్డ నీలవేణికి ఎవరో సౌంజ్ఞ చేసారు కళ్లతోనే. అటు తిరిగి చూసింది.

ఒక మూడేళ్ల అమ్మాయి ఏడుస్తూ నిలబడింది చేతిలో ఓ టికెట్‌తో. ఏగుడ్విల్ స్టోరులోనో కొన్న సాదాగౌనూ, పాతజోళ్లూ, ఎర్ర రిబ్బనుతో కట్టిన నల్లని ఉంగరాల జుట్టూ. ఎవరో ఓ చల్లనమ్మ ఆ పిల్లని తగలకుండా, గజందూరంలో నిలబడి ఓదార్చడానికి తంటాలు పడుతోంది. ఆ అమ్మాయి ఏడుపు తప్ప మరే జవాబూ లేదు. "మామీ" అన్నమాట తప్ప మరోమాట లేదు. ఒకరిద్దరు ఆ అమ్మాయికి బాగా దూరంలో నిలబడి, ఏవో నంగిప్రశ్నలేస్తున్నారు. ఓ పెద్దాయన నీలవేణివేపు చూసాడు అర్థవంతంగా. ఆ చూపుకి ఎన్నో అర్థాలు లేవు. ఒకే ప్రశ్న "మీపిల్లని మీరు చూసుకోనక్కర్లేదూ?"

నీలవేణికి ఏమనాలో తోచలేదు. ఆ చిన్నదానికి అతనెంత చుట్టమో తనూ అంతే. తన రంగు మూలంగా, తనకీ ఆ పాపకీ చుట్టరికం కలిపాడాయన.

అదే క్షణంలో ఆ పాప కూడా నీలవేణిని చూసిందేమో ఒక్కపరుగున వచ్చి, కాళ్లకి చుట్టుకుంది. నీలవేణి దిగ్భ్రమతో అవాక్కయి చుట్టూ చూడసాగింది, ఆ పిల్లతలమీద చెయ్యేసింది అసంకల్పప్రతీకారచర్యలా. ఈ పాప తనదగ్గరికి పరుగెత్తుకు రావడం తనరంగు చూసే - అనుకోకుండానే మనసులో మెదిలిన ఆలోచన అదీ .

"ఇంకా నయం. మిమ్మల్ని నేన్చూడకపోతే, ఎవరోఒకరు సోషల్ సర్వీస్‌ని పిలిచేసుండేవాళ్లు," అన్నాడు తన సమయస్ఫూర్తికి తనే మురిసిపోతూ ఇందాకా తనకి కన్ను గీటినాయన.

నీలవేణికి ఆ సిస్టమ్‌గురించి అట్టే తెలీకపోయినా కోర్టుటీవీ అదేపనిగా చూడ్డంవల్ల తెచ్చుకున్న విజ్ఞానంతో **ఆ** సిస్టమ్‌లో పడితే ఏమవుతుందో త్వరగానే ఊహించుకోగలిగింది. అంచేత గట్టిగా ఆ పిల్ల తనచుట్టం కాదని చెప్పలేకపోయింది. సిస్టమ్ సిస్టమ్ అని కొట్టుకునే చాలామంది బుర్రలకి నిత్యజీవితాల్లోని కటికసత్యాలు ఎక్కవు.

హాల్లో ఆట మొదలయింది. ప్రేక్షకులు లోపలికి వెళ్లిపోయారు. గూడు చేరిన గువ్వలా పాప ఏడుపు మానేసి, జరుగుతున్న నాటకంలో తనకేం భాగం లేనట్టు నోట్లో వేలేసుకు నిలబడింది ఆవిడకాళ్లమాటున. నీలవేణి మరో అయిదు నిముషాలు దిక్కులు చూస్తూ నిలబడింది

ఆ తరవాత ఏంచెయ్యాలో తోచక, ఆ పాపని తీసుకుని హాల్లోకి వెళ్లి, షాపరాన్ చూపించినసీట్లో కూచుంది పాపని పక్కసీట్లో కూచో పెట్టుకుని.

పావుగంట అయింది. రంగంమీదకి కొత్త పాత్ర ప్రవేశించింది.

"మామీ" పాప అరిచింది హఠాత్తుగా.

చుట్టూ కూర్చున్నవాళ్లు హుష్ష్ అంటూ తమ అసహనాన్ని వెలిబుచ్చారు. నీలవేణి వాళ్లకి క్షమాపణలు చెప్పుకుని, ఆ పాపని నెమ్మదిగా అడిగింది "ఆవిడ మీఅమ్మా?" అని.

"అవును మామీయే".

తల్లెవరో నిర్ధారణ అయిపోయింది. నీలవేణిప్రాణం తెరిపిన బడింది. ఆట ముగిసేసరికి ఆ పసిదానిబాధ్యత కూడా తీరిపోతుందని.

ఆట అవగానే ఆ తల్లి పరిగెత్తుకుంటూ వచ్చింది. ఆపకుండా పావుగంటసేపు క్షమాపణలూ, కృతజ్ఞతలూ చెప్పుకుంది.

ఆ తరవాత తెలిసినకథ ఏమిటంటే - ఆ తల్లి మహానటి కావాలని మహా తాపత్రయపడుతోంది రెండేళ్లుగా. ఇంతకాలానికి ఓ చిన్నఅవకాశం దొరికింది రంగంమీదికెక్కడానికి. బేబీసిటర్లని పెట్టుకునే స్తోమతు లేదు. వచ్చిన ఒక్క అవకాశం వదులుకోలేక వూళ్లోనే వున్న ఓ కజిను కమీలాని అడిగింది పిల్లని చూడమని. ఆవిడ తనకి అట్టే టైము లేదనీ, ధియేటరుదగ్గర కలుసుకుని చూస్తానని మాటిచ్చింది. ప్రతిఫలంగా ఆట చూడ్డానికి ఉచిత టికెట్ ఇవ్వడానికి ఒప్పుకుంది తల్లి. ఆటకి టైమయిపోతోంది. ఆ కజినుమీద నమ్మకంతో ఆంట్ కమీలా వచ్చేవరకు గేటుదగ్గర నిల్చోమని ఆ పాపతో చెప్పి తాను తెరవెనక్కి వెళ్లింది. అదీ కథ.

సుందరంకోసం ఎదురుచూస్తూ నిలబడింది నీలవేణి. ఎంతసేపటికీ అతని జాడ లేదు. మరిచిపోయాడో, వచ్చి వెళ్లిపోయాడో. తెలిసినవాళ్లు ఎవరైనా కనిపించి రైడిచ్చేరు అనుకున్నాడో. ... తనీ పాపగొడవలో పడి అన్నమాటప్రకారం గేటుదగ్గర నిలవడం వెంటనే జరగలేదు. పాపగురించే ఆలోచిస్తూ ఇంటివేపు నడవసాగింది. వీధిలో అట్టే జనం లేరు. జోరుగా దూసుకుపోయే కార్లు, అక్కడా అక్కడా సైకిళ్లూ ...

నీలవేణికి ఆ తల్లిని తలుచుకుంటే జాలేసింది. సకలజనులూ సమానులే అంటూ గొంతులు చించుకునే ఈ దేశంలో కొందరు కొంచెం "ఎక్కువ సమానం" అని ఈ దేశం వచ్చినకొత్తలో అర్థం అయింది.

ఓ రోజు కూరలు తెచ్చుకోడానికి రెండు వీధుల అవతల వున్నషాపుకి వెళ్లింది. ఆ రోజు సరదాగా నవ్వుతూ వెళ్లిన నీలవేణి చిరాగ్గా మొహం ముడుచుకు ఇల్లు చేరింది. సీరియస్‌గా పేపరు రాసుకుంటున్న సుందరం తలెత్తి భార్యామణి మొహం చూసి ఏంవైందన్నాడు,

నీలవేణి గ్లాసుడు మంచినీళ్లు తాగి మార్కెట్లో జరిగిన సంగతి చెప్పింది. బండిలో తనకి కావలసిన సామానులు వేసుకుని చెకర్‌దగ్గరికొచ్చింది. తనముందున్న తెల్లావిడ బండెడు సామాన్లకి చెక్కు రాస్తే ఏ బాధా లేదు. తను ఇరవైడాలర్లకి చెక్కు రాస్తే, డ్రైవర్స్ లైసెన్స్ చూపించమంది ఆ చెకర్. నీలవేణికి అది లేదు. మామూలుగా సుందరం, తనూ కలిసే వెళ్తారు ఎక్కడికెళ్లినా. అతనే సారథి. ఈ ఒక్కసారి అట్టే దూరం లేదు, కావలిసినవి అట్టే లేవు, ఆనాటి వాక్ కూడా అయిపోతుందని బయల్దేరింది. ఇరవై డాలర్లసామాన్లకి, తానేదో షాపు దోచుకుపోతున్నట్టు సవాలక్ష ప్రశ్నలేసింది ఆ చెకర్. ఆపైన మేనేజరు వచ్చి ఓ కార్డుమీద పేరు, ఎడ్రెసూ, తన లేక భర్త వుద్యోగం - అవన్నీ రాయమన్నాడు. నీలవేణికి ఒళ్లు మండింది.

"మీసామాను మీరే వుంచుకోండి. నాకక్కర్లేదు," అంది, చేతులో బండి వదిలేసి. ఆ మేనేజరు ఓనిముషం ఆలోచించి ''చెక్కు తీసుకో'' అన్నాడు ఆ తెల్లపిల్లతో.

అంతా విని, సుందరం "పోనిద్దూ ఎవరి రంధి వాళ్లది" అన్నాడు.

నీలవేణి అతనివేపు పరీక్షగా చూసింది. నిజమే, తనరంగు విషయం అతన్ని బాధించదు. తనపెళ్లినాడే లేకపోయింది అతనికి ఆ యావ.

ఆ రోజుల్లో తను ఎన్నిసార్లు చూసుకునేదో తనచేతులు పరీక్షగా. నిగనిగలాడుతూ నీలమేఘశ్యామ వర్ణం..

నాన్నమ్మ ఓదార్పులు - "నల్లనివాడు, పద్మనయనమ్ములవాడు" అన్నారు కాని తెల్లనివాడు అన్నారా?"

"తెలుపు అసలు రంగే కాదు, ఏడురంగుల పోగు," అన్నయ్య సముదాయింపు.

"కాకి నలుపు, కోకిల నలుపు, వసంతుని రాకతో తెలియు అసలు మెరుపు" అంటూ సంస్కృతం మాస్టారి ఓదార్పు.

నీలవేణికిపేమీ ఊరట కలిగించలేదు అప్పట్లో.

"ఈ నల్లపిల్లని పెళ్లాడ్డానికి ఎవడొస్తాడో" అంటూ అమ్మ చాటుగా కళ్లొత్తుకోడం చూసినప్పుడు ప్రాణం గిలగిల కొట్టుకుంది. అయితే ఆ పిల్లపెళ్లి అతిసులువుగా అయిపోయింది కాలం, ఖర్మ కలిసొచ్చి.

పొరుగింటి కాముడత్తయ్యగారి సుపుత్రుడు సుందరం "నీలవేణిని చేసుకుంటాను" అన్నాడు. నీలవేణినే తప్ప ఇంకెవరినీ చేసుకోనని కూడా అన్నాడు.

"కోడలు నలుపయితే కులమంతా నలుపు" అంటూ తల్లి మొదట కాస్త గునిసినా, త్వరలోనే సర్దుకుంది, "చిన్నప్పట్నించీ ఎరిగిన చిన్నది, ఇంట్లో మనిషిలా మసలినపిల్ల. ఎక్కడ్నుంచో ఏ పడుచునో పట్టుకొస్తే ఆవిడగారు నెత్తినెక్కి కదం తొక్కదనేముంది? ఆ కోటమ్మకోడల్ని చూడరాదూ. తెల్లగా పిండిబొమ్మలా ఉందన్న మాటే కాని ఆ మిడిసిపాటూ, అదీనూ ..." అనుకుని.

సుందరం తనకు తానై ముందుకి రావడంతో నీలవేణికి తన తోలురంగు రంధి తగ్గి, ఉపశమనం కలిగించింది. తల్లిదండ్రులు తమ నెత్తిన పాలవాన కురిసిందని మురిసిపోయారు.

ఆ తరవాత అచిరకాలంలోనే అమెరికా చేరుకున్నారు నూతనదంపతులు.

అమెరికా వచ్చింతరవాత నీలవేణికి తొక్కరంగు గురించి కొత్తసంగతులు క్రమంగా తెలిసొస్తున్నాయి. ఇక్కడ నలుపు అందానికి సంబంధించినది కాదు తోలురంగు జాతిచిహ్నం. తనని ఆఫ్రికననుకుంటున్నారు ఇక్కడితెల్లవారు.

నీలవేణికి తాను కట్టుకునే బట్టలు మార్చేవరకూ ఆసంగతి తెలియలేదు. నిజానికి అమెరికాకి రాగానే తాను చీరెలు కట్టడం మానేయలేదు. కొంతకాలం చీరెలే కడుతూ వచ్చింది. వాటివల్ల ఎంతసౌఖ్యమో చాలామందికి తెలియచేస్తూ వచ్చింది కూడాను. దరిమిలా, పేంట్లూ, చొక్కాల్లోకి మారేక, వాటిలోనూ అంత సౌఖ్యమూ వుందనిపించింది. మనం ఏం చెయ్యాలనుకున్నా గాని కారణాలు వాటికి తగ్గట్టు వాటంతటవే దొరుకుతాయన్న సత్యం తెలిసొచ్చింది. వస్త్రధారణతోనే తదితర అలంకరణలూనూ. బొట్టు, గాజులు అన్నీ ఒక్కొక్కటే తీసి పక్కన పెట్టేసింది.

అదుగో అప్పుడే ఎదురైంది కొత్తబాధ. తనని స్థానికులు ఆఫ్రికను అనుకున్నందుకు కాదు కాని, నీలవేణికి దాని వెన్నంటి ప్రచారంలో వున్న స్టీరియోటైపు అభిప్రాయాలు, వారు చిలకరించే చిర్నవ్వులు - అవీ ఎక్కువ బాధ కలిగించింది.

ఆమధ్య ఎవరో హాస్యమాడేరు, మనల్నెందుకు అనడం "కలర్డ్" అని.

నిజానికీ వారే వెలుగుతున్నారు నానావర్ణాల్తో.

కోపమొచ్చి హుంకరించినప్పుడు కెంపుల్తిరిగిన మొహం,

దిక్కుల్తోచనప్పుడు వెలాతెలా వోయే మొహం,

లాగి లెంపకాయొకటి ఇచ్చుకున్నప్పుడు కమిలి

నీలిమ పులుముకునే మొహం.

నానావర్ణాలూ ప్రతిఫలించేది తమరి వదనాల్లోనే అంటూ.

అసలు తెలుగొక భాష అనీ, తెలుగువాళ్లు ఒక జాతి అనీ తెలీనివాళ్లు అమెరికాలో చాలామంది వున్నారు. అక్కడక్కడా ఒకటో రెండో ఎంగిలిముక్కలు దొరకపుచ్చుకున్న కొందరు, "అయితే ఇప్పుడు హరిజనుల పరిస్థితేమయినా మెరుగయిందా?" అని జాలిగా అడుగుతున్నారు. ఆ ప్రశ్న వెనకునున్న అమాయకత్వానికి, బోళాతనానికి నవ్వూ, చిరాకూ కలిగేవి తనకి.

ooo

నీలవేణి థియేటరుదగ్గర తనకి తటస్థపడ్డ పాపని గురించే ఆలోచిస్తూ నెమ్మదిగా అడుగులేస్తోంది. ఆ కజినెవరో. ఎందుకు రాలేదో ... రావడం ఆలస్యమయిందేమో, ఈలోపున తను ఆ పాపని హాల్లోకి తీసుకెళ్లిపోలేదు కదా.

ఆలోచిస్తూ అడుగులేస్తున్న నీలవేణిని ఎవరో వెనకనించి వచ్చి చేతిలో సంచీ లాక్కోబోయారు. తను హేయ్ అంటూ సంచీ గట్టిగా పట్టుకుంది బెదిరిపోతూ. తిరిగి చూస్తే ఒకరు కాదు ముగ్గురు కుర్రాళ్లు ... సంచీ వదిలేసింది ఒణికిపోతూ. అందులో

ఒకడు ఏం అనుకున్నాడో తనని గట్టిగా తోసేడు. తను అరుస్తూ కింద పడింది. నుదురు చిట్లింది. వాళ్లేదో అంటున్నారు కాని ఒక్కముక్క కూడా అర్థం కాలేదు, కళ్లు మసకబారుతున్నాయి. ఇంతలో మరెవరిదో గొంతు వినిపించింది.

ఆ తరవాత ఏంజరిగిందో స్పష్టంగా తెలీలేదు కాని తనని రక్షించడానికి మరెవరో గట్టిగా ప్రయత్నిస్తున్నారని అర్థం అయింది.

మరి కొంతసేపటికి …

వీధిదీపం వెలుగులో నల్లటిమొహంమీద కారుతున్న ఎర్రని రక్తం,

తెల్లటిచొక్కామీద ఎర్రని రక్తం,

నీలవేణి గుండెలు గజగజ వణికేయి లేతరెమ్మలా.

అదే సమయంలో అతను కూడా నెమ్మదిగా తనవేపు తిరిగాడు. వంట్లో శక్తినంతటినీ కూడగట్టుకుని, "హౌవార్యూ" అని అడిగాడు, ఎక్కడో ఏడూళ్లవతలినించి వినిపించింది ఆ స్వరం.

నీలవేణి ఫరవాలేదన్నట్టు తలూపింది. అతను గమనించేడో లేదో … కళ్లు మూసుకున్నాడు.

"నా ప్రాణానికి తనప్రాణం అడ్డు వేసిన ఈమానవుడెవరు చెప్మా? ఎందుకు వేశాడు? చాలామందిలాగే అతను కూడా తనని 'తనవారు' అనుకున్నాడా?"

దారిన పోతున్న మరో కారు ఆగింది. ఆ పుణ్యాత్ముడు 911కి సందేశం పంపించాడు సెల్లులో.

ఆదరా బాదరా రెండు పోలీసుకార్లు, ఎర్రని ట్రక్కులో పెరమెడిక్కులూ దిగారు. ఇద్దరు పెరమెడిక్కులు అతనివేపు నడిచారు. ఒకమ్మాయి తనదగ్గరికొచ్చింది, ఎలా వున్నావంటూ.

"నేను బాగానే వున్నాను. అతనికెలా వుంది?" ఆదుర్దాగా అడిగింది నీలవేణి.

"ఫరవాలేదు. స్పృహ తప్పింది, ప్రమాదం లేదు."

ఆమెచుట్టూ చెదురుమదురుగా రక్తపు చుక్కలు.

నుదుటిమీంచి గొంగళీపురుగులా జారుతున్నరక్తం,

తెల్లని బ్లౌజుమీద, నల్లనిచేతులమీద చుక్కలు, చుక్కలుగా ఎర్రని రక్తం.

అటుతిరిగి అతనివేపు చూసింది.

స్పృహ లేకుండా పడివున్నాడు. ముక్కులోంచి, చెవుల్లోంచి, నోట్లోంచి కారి చారలు కడుతున్న ఎర్రనిరక్తం, చొక్కామీద చిందిన రక్తం,

రోడ్డుమీద పారుతున్న రక్తం ...

నీలవేణి హృదంతరాలనుండీ తొలిసారిగా తన తోలురంగుతాలుకూ తలుపులు తొలగి, ఎర్రని, గోరువెచ్చని అరుణకాంతులు చివ్వున ఎగిసేయి దిగంతాలకు తలకావేరిలా.

000

(ఈమాట.కాం. లో ప్రచురితం. నవంబరు 2006)

# 12. కులదీపకుడు

శ్రీలక్ష్మికి ఆరుగురు ఆడపిల్లల తరవాత పుట్టాడు కొడుకు.

పురందరశర్మగారు పొంగిపోయారు వంశోద్ధారకుడు, పున్నామనరకమునుండి రక్షించువాడు పుట్టేడని. తల్లిమనసు కుదటపడింది పురిటినొప్పులింతటితో సరి అని! కామితార్థములు తీర్చు తనయుడని పెట్టుకున్నారు పేరు కామేశ్వరరావని.

ఆరుగురు అక్కలూ మురిసిపోయారు ఒక్కగానొక్క తమ్ముడని.

వాడు ఆడింది ఆటా, పాడింది పాటా. కాలుమీద కాలేసుకుని, దర్జాలొలకబోస్తూ, చదువులు ముగించేసుకుని ఇంజినీరయేడు. విజయవాడలో ఓ పెద్దకంపెనీలో జూనియర్‌గా చేరేడు. ఆ కంపెనీవారే "మెరికలాటి కుర్రాడు. అమెరికాలో చెలగవలసినవాడు" అని గుర్తించి, అతడిని అమెరికా పంపారు ట్రెనింగుకి. ఏడాదిపాటు అక్కడుండి వాళ్ల ఆనుపానులు గ్రహించేడు. అమెరికన్ మెళుకువలు పట్టుబడ్డాయి. "Work smart, not work hard". అంటే వొళ్లొంచి పనిచెయ్యడం కాదు, అలా వొళ్లొంచి పని చేసేవాళ్లని గుర్తించి, చేరదీసి, కూడగట్టుకుని వాళ్లచేత పనులు చేయించుకోడమని అర్థమయిపోయిందతనికి.

చదువయింది. పెళ్లి కావాలి. సంబంధాలొస్తున్నాయి. ప్రతి సంబంధానికీ ఏదో ఓ అభ్యంతరం.

పెద్దక్క కూతురు - వొడగెక్కువ.

చిన్నక్క ఆడబడుచు - కుండమార్పులు, అచ్చిరావు.

మూడోఅక్క మరిది క్లాస్‌మేట్ చెల్లెలు - లాభంలేదు. అమ్మాయికుంది కుజదోషం.

ఇరుగూ, పొరుగూ, చుట్టాలూ, పక్కాలూ తెచ్చిన పెళ్లికూతుళ్లు సైతం అంతంత మాత్రమే.

తండ్రిక్కావాలి తమ పరువుబరువు మోయగల కోడలు.

తల్లికుంది తమ్ముడికూతుర్ని కోడలుగా చేసుకోవాలని.

కొడుక్కి కావాలి సాంఘికంగా తనస్థాయి పెంచగల సుకుమారి.

అంతలో వచ్చాయి అంతర్రాష్ట్రీయ సంతలు, చెన్నైలో సాఫ్టువేరు సభలు. కామేశ్వరరావు హడావుడిగా బయలుదేరేడక్కడికి. ఎక్కడ ఏక్షను వుందో అక్కడ ప్రత్యక్షం కావలె మరి. మూడురోజుల తరవాత తిరిగొచ్చాడు. ఆ వెంటనే ప్రకటించాడు ఇంట్లో సకలజనులకూ.

చెన్నైలో వున్నది ఓ చిన్నది. అతనికి అన్నివిధాలా అనుకూలమయినది. పిల్ల పేరు జ్ఞానమణి. హార్డ్‌వేర్, సాఫ్టువేరుల విజ్ఞానఖని. తండ్రికుంది పెద్దపేరు, అళహ ముత్తువర్. ఆ అమ్మాయే తనకి కాగల అర్ధాంగి అన్నాడు.

తల్లీ, తండ్రీ, పెద్దక్కా, చిన్నక్కా, మూడో అక్కా కురిపించారు ప్రశ్నలు గుక్కతిప్పుకోకుండా. నాలుగో ఆవిడ అత్తారింట్లో వుంది. ఐదూ, ఆరూ ఆ యింటి జనాభాలెక్కల్లోకి ఎక్కలేదింకా. వారిమాట వినిపించుకోరెవరూ. ఇరుగూ, పొరుగూ తలో మాటా సెలవిచ్చారు. మొత్తంమీద అందరూ కలిసి కొరుక్కుతినేశారు అతన్ని.

"వారికులమేమిటి?", "గోత్రమేమిటి?", "తల్లిదండ్రులెవరు?", "వారాడు బాస ఏమిటి?", "వారికున్న తాహతేమిటి?"

"అబ్బబ్బభ్భ, సైలెన్స్, సైలెన్స్" అరిచాడు కామేశ్వరరావు. ఆపైన ఇచ్చేడు సమాధానం.

"కులమింటికోతిసైనా తెచ్చుకోమని కదా అమ్మ సలహా. నేను ఎంచుకున్న ఆ అరవపిల్ల అందమున కోతిపిల్ల. వారి కులమున మేలుబంతి. అమ్మా, నీ కోరిక సగం తీరింది. మీరేమిటి చూస్తారు కులంపేరున? కులాలు వృత్తులనుబట్టి ఏర్పడ్డాయని కదా మీవాదం. మాకు ఇంజినీరింగే తల్లిపేరు. మేము సాఫ్టువేరువారం."

"ఆచారాలేమిటి అంటే -.ఈనాడందరూ అనుసరిస్తున్నవే. ఘనవిజయాలు సాధించేవి, మెట్టుమీద మెట్టు పేర్చుకుంటూ పైపైకి ఈడ్చుకుపోయేవి."

"వారి తాహతు?"

"దేశదేశాల పరుచుకున్న బంధుమిత్రపరివారం."

"తిండీ తిప్పలో?"

"టేరీజు వేసి మరీ చూసుకున్నాం ఇద్దరం పీచా, నూడుల్స్, గోబీ మంచూరియా."

"అందమైన పిల్లేనా?"

"నాకళ్లకి రంభ".

"గుణమా? - ధనధృవం. మరి వినయం సమయానుకూలం."

"అభిజాత్యమా? - తెల్లవారి హయాంలో ముత్తాత ఐసీయస్సాఫీసరు. తాత హైకోర్టు జడ్జి. తండ్రి అళహముత్తువర్ కంట్రాక్టరు. సుఖంగా రిటైరయి, ప్రస్తుతం వూటీలో విశ్రాంతి తీసుకుంటున్నారు. వారి ఏకైక సంతానం జ్ఞానమణి చక్కగా చదువుకుని సాఫ్టువేరు ఇంజినీరయి సొంతకంపెనీ నడుపుకుంటోంది."

"మరి నన్ను సుఖపెట్టునా, లేదా అంటే ఓ, యా, యా, తప్పక సుఖ పెట్టును. నా కంపెనీలో సాయపడును. నేనింక దర్జాగా కాలు మీద కాలేసుకు కాలం గడపొచ్చు. ఎప్పట్లాగే, సాటివారితో జల్సాల్చేస్తూ తిరగొచ్చు."

తల్లికీ తండ్రికీ మాట తోచలేదు. మనసొప్పలేదు కొడుకుమాట మన్నించడానికి. "మనకులం కాదు, మనగోత్రం కాదు, నువ్వీ పెళ్లి చేసుకుంటే మళ్లీ ఈ గడప తొక్కడానికి వీల్లేదు" అని నిక్కచ్చిగా చెప్పేశారు కులదీపకుడికి.

కామేశ్వర్రావు గుమ్మం దిగుతుంటే, "స్వార్థం" అన్నతండ్రి మాట వినిపించింది. వెనుదిరిగి చూస్తే తల్లి కళ్లొత్తుకుంటోంది చీరెచెరగుతో.

కాముడిగుండె కలుక్కుమంది. చేతిలో పెట్టె మెట్లమీద పెట్టి లోపలికొచ్చాడు.

తల్లిపక్కన కూర్చుని మరోసారి ఆవిడకి నచ్చచెప్పడానికి ప్రయత్నించేడు సౌమ్యంగా, "చూడమ్మా, చిన్నప్పట్నుంచీ నీమాటే వింటున్నాను కద. నువ్వు చెప్పినట్టు నడుచుకుంటున్నాను కద. ఈనాడు దేశంనిండా కంప్యూటరు ఇంజినీర్లే. వీరి లక్షణాలేమిటో, ధర్మాలేమిటో ఏ వేదాలూ వివరించలేదు. బస్తీలో హోటల్లో భోంచేస్తాం, అక్కడ సద్బ్రాహ్మణులు మడికట్టుకు వంట చెయ్యడంలేదు కదా. ఆపద్ధర్మం అంటావు. అమ్మా, ఈనాడు మనం వున్నది అయోమయ స్థితిలో. సమస్తం, సందిగ్ధం, అస్తవ్యస్తం, గందరగోళం. ఈనాడు ప్రజలకి ఒక్కటే నీతి, ఆత్మప్రదక్షణం. నా ఉన్నతికి నేను పాటుపడాలి. నన్ను మీరు కులవృత్తిలోకి దింపకుండా, మరేదో సాధించాలనే కదా ఇంజినీరింగులో పెట్టింది. మరి నేను ఆ రంగంలో  పైకి రావాలంటే తదనుగుణంగానే అడుగు వేయాలి. పాత రాతియుగం, కొత్త రాతియుగం, క్షీణ యుగం,లాగే, ఈ యుగానికి కూడా, పేరు పెట్టొచ్చు అయోమయయుగం అని. ముందు ముందు రాబోయే స్వర్ణయుగం లక్షణాలేమిటో ఇప్పుడు చెప్పలేం కాని అంతవరకూ దారినిండా ముళ్లూ, రాళ్లూ. ఆ భవిష్యత్తేమిటో సుస్థిరంగా, బలంగా వేళ్లూనేవరకూ ప్రశ్నలే కాని సమాధానాలు లేవు. అంచేత అమ్మా నువ్వడిగే చాలా ప్రశ్నలకి నాదగ్గర సమాధానాలు లేవు. దయచేసి నన్ను మాత్రం ఆపకు. నాదారి నన్ను వెతుక్కోనియ్"

"వితండవాదం" అంది తల్లి విసుక్కుంటూ. కొడుకు మాటల్లో కనిపిస్తోంది కొంత న్యాయం. మనసులో ఏ మూలో చిన్నప్పట్నుంచీ నెలకొన్న నమ్మకాలు ముల్లై గుచ్చుకుంటున్నాయి. ఆమెకి స్పష్టంగా అర్థం అయింది ఒక్కటే "ఇది అయోమయ స్థితి, ఈ యుగంపేరు గందరగోళం" అన్నది. దీర్ఘంగా నిట్టూర్చి దేవుడిగదివేపు నడిచింది.

తండ్రి తనకి కొడుకే లేడు, పొమ్మన్నాడు.  శ్రీలక్ష్మి కళ్లొత్తుకుంది చీరెచెరగుతో మరోసారి. కొడుకు నడిచాడు విశాలప్రపంచంలోకి.

పెళ్లయిపోయింది అట్టహాసంగా అవధానుల కామేశ్వరరావుకీ, అళహముత్తువర్ జ్ఞానమణికీ చెన్నైలో ఏయమ్‌గారి బంధుమిత్రుల సమక్షంలో. అతడిమకాం మారింది చెన్నైకి

ఆరు నెలలు గడిచాయి. రాకపోకల్లేవు కాని ఆ యింటిమీద కాకి ఈ యింటిమీదా ఈ ఇంటిమీద కాకి ఆ యింటిమీదా వాల్తూనే వున్నాయి. సమాచారాలు అందుతూనే వున్నాయి - డాట్‌కామ్రూప్ కంపెనీ జ్ఞానమణి అజ్మాయిషీలో అమెరికాఅధ్యక్షుడి రాజనీతిలా దిగంతాల వ్యాపించిపోతోందిట. స్కూటరు కొన్నాట్ట. కారు కొన్నాట్ట. కొత్త మేడ కట్టేట్ట చెన్నైలో. వూటీలో వుందిట మరో విశ్రాంతిగృహం. అంతేకాక ఆర్నెల్లకోమారు పెడతాట్ట అమెరికా.

శర్మగారూ, శ్రీలక్ష్మి ఎవరి మనసులో వారు విడివిడిగా మురిసిపోయారు కుమారుని ప్రయోజకత్వానికి. ఆ మాట ప్రకాశంగా పలకడానికి మాత్రం రవంత బింకం, మరింత జంకు.

ఓ రోజు రాత్రి పడుకోబోతుంటే పురందరశర్మగారి చెయ్యి కాస్త చిమచిమలాడు తున్నట్టనిపించింది. మర్నాడు ఉదయం లేవబోతుంటే కళ్లు తిరిగేయి. కాఫీకప్పుతో ఎదురైన భార్యవేపు అయోమయంగా చూశారు. శ్రీలక్ష్మి బెదిరిపోతూ, డాక్టరుగారికి కబురెట్టింది అర్జంటుగా. త్వరలోనే తెలివిడి అయింది, ఆ లక్షణాలు తిమురుగాదు, పైత్యం చేయడం కాదు. నరం పట్టేయడం కాదు. పరీక్షలు చేసి పక్షవాతం లక్షణాలు కనిపిస్తున్నాయన్నారు డాక్టరుగారు.

రెండు గుండెలు గుభేలు మన్నాయి. నాలుగో పడిలో పడ్డ తమని ఆదుకునే నాధుడెవరు? వున్న ఒక్కకొడుకూ అత్తారింట్లో మకాం పెట్టాడు. కూతుళ్లు ఎవరి బతుకులు వారు బతుకుతున్నారు. తమని ఆదుకోగల స్తోమతు గలవారు కారు.

పక్కింటి రామనాథం, ఎదురింటి సోమలింగం, చిన్నప్పటి చెలికాడు సుందర్రావు, ఒక్కొక్కరే వచ్చి, చూసి, పరామర్శించి, కొడుక్కి కబురు పెడితే బాగుంటుందని సలహా యిచ్చి వెళ్లిపోయారు. ఆ పైన ఎవరో నెమ్మదిగా ఆ మాట కామేశం చెవినేశారు. అతను

ఆదరా బాదరా వచ్చాడు సంగతేమిటో స్వయంగా కనుక్కోడానికి.

డాక్టరుతో మంతనాలు జరిపేడు. చివరికి చెప్పేడు తల్లితో. "నువ్వొక్కదానివీ ఇక్కడ చూసుకోలేవు. చెన్నైలో మంచి డాక్టరున్నాడు. పరపతిగల మామగారున్నారు. సేవలు చెయ్యడానికి దాసీజనం వున్నారు. వాళ్లమీద అజమాయిషీ చేయడానికి కోడలుంది. పద, పోదాం,"

అయిష్టంగానే తల్లి మూటా, ముల్లె సర్దుకు ప్రయాణమయింది. ఎంత కాదనుకున్నా కడుపుతీపి, బతుకు భయం. జరిగినన్నాళ్లే కులాలూ, గోత్రాలూను అన్నారు పొరుగింటి రామనాథంగారు.

గుమ్మంలో ఎదురైన కోడల్ని చూడగానే, "ఈ పిల్లలో ఏంచూశాడు కొడుకు" అనిపించింది శ్రీలక్ష్మికి మనసులో ఏమూలో. జాగ్రత్తగా ఆ అమ్మాయిని తగలకుండా ఓరవొంపుగా వొత్తిగిలి లోపలికి నడిచింది.

కోడలు మాత్రం అత్తగారినీ, మామగారినీ మనస్పూర్తిగానే ఆహ్వానించింది. ఏ మాత్రం జాప్యం చెయ్యకుండా ఆస్పత్రిలో స్పెషల్ గది ఏర్పాటు చేయించింది, ఆ సాయంత్రమే ఆయన్ని చేర్పించేరు. కామేశ్వరరావు డాక్టరుతో చెప్పాడు తను అర్జంటుగా అమెరికా వెళ్తున్నానని, తిరిగి వచ్చేవరకూ తన తండ్రిని అత్యంత జాగ్రత్తగా చూసుకోవాలని.

ఆ రోజంతా ఆస్పత్రిలోనే వుండి సాయంత్రం శ్రీలక్ష్మి ఇంటికి వచ్చింది. వస్తూనే వంటగదిలో ప్రవేశించింది. "వంటమనిషి ఎందుకూ, నేను చేస్తాలే" అంటూ.

బల్లమీద కంచాలూ, గ్లాసులూ అమర్చింది మణి. అత్తగారు పెట్టుకున్నతరవాత తను వడ్డించుకుంది.

"కరీ కొంజం," అంటూ మణి అత్తగారి కంచంలో కూర మారు వడ్డించబోయింది.

శ్రీలక్ష్మి గాభరాగా "వద్దు, వద్దు" అంటూ చెయ్యి అడ్డు పెట్టింది.

మణి తెల్లబోయింది. అత్తగారు, అన్నం పెట్టుకున్నారు. అన్నం పరబ్రహ్మ స్వరూపం. పెరుక్కి కూడా ఆంక్షల్లేవు. కూరా, పులుసూ, కోడలు వడ్డించుకున్న తరవాత మళ్ళీ ఆ గిన్నె ముట్టుకోలేదు ఆవిడ.

"సాంబార్ వేస్తునా?"

"తరవాత వేసుకుంటాను", "రాత్రికి తింటాలే", "ఇంతకారం నేను తినలేను." నిజానికి తెలుగుకారాలతో పోలిస్తే అది కారమే కాదు. అదో వంక, అంతే.

మణి మాటాడకుండా భోజనం ముగించింది. మర్నాటినుండీ "అప్పరం, అప్పరం," (తరవాత) అంటూ అత్తగారి సరసన కూచోకుండా జరుపుకొస్తోంది.

మరో రోజు వుదయం అత్తగారు స్నానం చేసిన తరవాత కట్టుకున్న చీర తడిపి ఆరేసుకున్నారు. ఆ సాయంత్రం మణి ఆరినచీర తీసి, మడత పెట్టి ఆవిడకి అందివ్వబోయింది. ఆవిడ అందుకోకుండా, పక్కనున్న బల్ల చూపించారు. మర్నాడు ఆవిడ మళ్ళీ స్నానం చేసేవేళ వరకూ ఆ చీర అక్కడే వుంది. ఆవిడ ఆ చీర మళ్ళీ తడిపి ఆరేసుకుంది. ఆ తరవాత మణి మళ్ళీ ఎప్పుడూ అత్తగారి బట్టలు ముట్టుకోలేదు.

ఆ రాత్రి మణికి ఎంత ఆలోచించినా అర్థం కాలేదు. ఏమిటి ఈ అత్తగారి వరస? ఏది పనికొస్తుందో ఏది పనికిరాదో ఎలా తెలుస్తుంది? ఈ ఆచారాలకి భాష్యాలు ఎవరు చెబుతారు?

రెండువారాలయేసరికి పరిస్థితులు ఓ కొలిక్కి వచ్చేయి. అమెరికానించి కొడుకు తిరిగొచ్చేశాడు. ఈసారి ప్రయాణం జయప్రదంగా ముగిసిందని మురిసిపోతూ. యూరప్‌లో బ్రాంచి పెట్టడానికి సన్నాహాలు చేస్తున్నాడు.

పురందరశర్మగారిని ఆస్పత్రినించి విడుదల చేశారు. ఇంట్లో ఫిజికల్ థెరపీకి సిద్ధంచేశారు కొడుకూ, కోడలూ.

ఆ సాయంత్రం అత్తగారు పక్కవీధిలో వున్న రామాలయానికి వెళ్ళారు. ఆకాశం దట్టంగా మబ్బులేసి వుంది. గాలి రాను రాను వుధృతం అవుతోంది. వరండాలో కూర్చుని పుస్తకం చదువుకుంటున్న మణి కళ్ళెత్తి చూసింది. అత్తగారు ఆరేసుకున్న

చీరె ఎగిరి కంచెమీద పడింది. మణి కళ్లు విచ్చుకున్నాయి. ఆ చీరె ప్రత్యేకత ఏమిటో తెలీదు గాని, వచ్చినదగ్గిర్నుంచి చూస్తోంది ఆవిడ దాన్ని చాలా జాగ్రత్తగా పరిరక్షించికుంటున్నట్టే కనిపిస్తోంది. ఇప్పుడు దాన్ని అలా వదిలేస్తే, గాలికి ఆ కంచెమీద ముళ్లకి తగులుకుని చిరిగిపోవడం తధ్యం. ఆలోచిస్తూ కూచోడానికి టైంలేదు.

గబగబా లేచి వెళ్లి, ముళ్లమీంచి ఒడుపుగా తప్పించి, లోపలికి తెచ్చి, మడత పెట్టి కుర్చీమీద పెట్టింది. "పక్కింటావిడ వచ్చి తీసి పెట్టారని చెప్పడమా, చిరిగిపోతుందని నేనే తీసాను, కావలిస్తే మళ్లీ తడిపి ఆరేసుకోండి అని చెప్పడమా" అని ఆలోచిస్తూ వెనుదిరిగింది. గేటు దగ్గర అత్తగారు లోపలికి వస్తూ కనిపించారు. ఆయాసపడుతూ వచ్చి వాలు కుర్చీలో కూలబడింది. ఆ తరవాత కోడలువేపు చూసి, "అబ్బబ్బ, ఏం జనం, ఏం జనం గుళ్లో. నిల్చుని నిల్చుని ప్రాణం సాలుకొచ్చింది. నోరెండిపోయింది. కొంచెం మంచినీళ్లు తెచ్చిపెట్టు తల్లీ," అంది.

మణి తెల్లబోయి చూసింది అత్తగారివంక.

ఆవిడ మళ్లీ, "నల్లతణ్ణి" అంది. ఆవిడ తెలుగూ, అరవం కూడా అర్థం చేసుకోడానికి మణికి రెండుక్షణాలు పట్టింది. లోపలికెళ్లి, గ్లాసుతో మంచినీళ్లు తెచ్చి, ఇచ్చి, తన గదిలోకి వెళ్లిపోయింది.

శ్రీలక్ష్మి మంచినీళ్లు తాగి, సేద తీరినతరవాత, లేచి, పక్కకుర్చీలో వున్న చీరె తీసుకుని తన గదిలోకి వెళ్లిపోయింది.

ఇప్పుడావిడకి కోడలు కుందనపుబొమ్మలా కనిపిస్తోంది. అడిగినవాళ్లకీ, అడగనివాళ్లకీ "మాకోడలు! చూశారా, చిదిపి దీపం పెట్టొచ్చు" అని చెప్తూంటుంది, ఆవిడకి పూజలూ, వ్రతాలూ, నోములే నిరంతరం కాలక్షేపం. అందులో తొంభైపాళ్లు కోడలి కడుపు పండి కులదీపకుడొకడు అవతరించి తమ వంశం తరింపజేయాలనేన్ట! ఆపక్క కుర్చీలో కూర్చుని పురందరశర్మగారు శూన్యంలోకి చూస్తుంటారు.

000

ఇది పాతికేళ్లనాటి మాట. కోడలికడుపు పండి పుట్టిన కులదీపకుడు, ఐపాండ్యన్, ప్రస్తుతం అమెరికాలో వున్నాడు. తనకి అనుకూలవతి అయిన ఆఫ్రికన్-అమెరికన్ అమ్మాయిని నిన్ననే పెళ్లి చేసుకున్నానని ఫోన్ చేశాడు.

"మన కోడలంటే కనీసం మనదేశంలో పుట్టిన పిల్ల. ఆఫ్రికాలోనూ అంతరిక్షంలోనూ పుట్టిన పిల్లలకి మన ఆచారాలూ, వ్యవహారాలూ ఏం తెలుస్తాయి?" అంది శ్రీలక్ష్మి భర్తతో కోడలు వినకుండా.

ఆయన భార్యవేపు చూశారు కొనకళ్ల. పక్షవాతంతో వంపులు తిరిగిన పెదవులమీద చిన్నహాసం విరిసింది. అది ఆనందమో అవహేళనో అర్థం కాలేదావిడకి.

000

(కౌముది.నెట్ లో ప్రచురితం. జూన్ 2006)

# 13. మీరెవరితాలూకు!

“ఆవిడెవరూ? ఒక్కరే వచ్చినట్టున్నారు. ఎక్కడా చూసినట్టు లేదు?” అన్నారొకావిడ వెనకవరసలో కాస్త ఎడంగా కూర్చున్నావిడనుద్దేశించి.

పది కళ్లు అటు తిరిగేయి పొద్దుతిరుగుడుపువ్వుల్లా.

“ఆవిడా? కౌశికిగారు. మీకు తెలీదూ? అదే మన పిచ్చికుంట్ల సుబ్బరామయ్యలేరూ. ఆయనభార్య. నాకూ తెలీదు అంబరీషుగారు చెప్పేవరకూ” అంది అంబరీషుగారి భార్య.

అమెరికాలో అదొక మహానగరం. స్థలం ఒక ఆలయప్రాంగణం. అక్కడ చేరినజనం తెలుగు జాతీయులు. సందర్భం సంక్రాంతి సంబరాలు.

హాలంతా కోలాహలంగా వుంది - పట్టుచీరెల రెపరెపల్తో, పంజాబీ కుర్తాల్తో, షెర్వాణీలతో, పువ్వులపరికిణీల్లో జీన్లకలవాటు పడ్డ కాళ్లమూలాన కలిగిన తొట్రుపాటుతో, అదిచూసి తలలు నెరిసిన తల్లులనవ్వుల్తో అచ్చంగా మన వూళ్లోలాగే.

ఆడవారంతా ఓపక్కనా, మగవారు మరోపక్కనా మంతనాలాడుకుంటున్నారు, ఇంగ్లీషూ, తెలుగూ, హిందీ కలగాపులగంగా, ఉగాదిపచ్చడికి దీటు రాగల నుడికారంతో.

పిల్లలు చిన్నచిన్నగుంపులయి తమతమ తరగతుల్ని బట్టీ, సరదాల్ని బట్టీ జట్లు జట్లుగా విడిపోయి గలగల తిరిగేస్తున్నారు హుషారుగా.

మగవాళ్లలో మధ్యవయస్కులు పిల్లల కాలేజీచదువులగురించీ, వాటికయే ఖర్చులగురించీ వాదించుకుంటున్నారు. ఆ స్థాయి దాటినవారు తాము పెంచి పెద్ద

చేసిన పిల్లలు ముందుముందు తమని ఆదుకుంటారా, ...కోరా, ...కోకపోతే తమరేం చేయాలి వంటి సాధకబాధకాలు చర్చించుకుంటున్నారు.

మధ్యలో మగవారు తమతాలూకూ ఆడవారిని "తాళాలేవీ," "పిల్లలేరీ," "నీకిచ్చినకాయితాలేవీ" లాటివి అడగడానికొచ్చి, ఆ పక్కనా ఈ పక్కనా వున్నవారు ఎవరో, ఎవరు ఎవరికేమవుతారో తెలుసుకుని తృప్తిగా వెనక్కి మళ్లుతున్నారు. ...

ఆ ప్రజాసమూహం మధ్య, ధ్వజస్తంభంలా కాకపోతే తామరాకుమీద నీటిబొట్టులా అందరిలో కలిసిపోతూ, విడిపోతూ, అందరికీ అయినదానిలాగానూ, ఎవరికీ కానిదానిలాగానూ సీదాగా తిరుగుతున్నారు పంకజంగారు.

సభ మొదలయింది. వేదికమీదికి దీక్షితులుగారు విజయం చేశారు.

"మామూలుగా ఇలాటివేడుకల్లో ఉపన్యాసాలుండవు కాని కార్యదర్శి పెద్దిరాజుగారు సంక్రాంతి విశేషం ఏమిటో నాలుగు ముక్కల్లో చెప్పమన్నారు. అంచేత రంగమ్మీదికొచ్చేను. మీలో చాలామందికి నన్ను సుబ్బలక్ష్మిగారి హబ్బీగానే తెలుసు. మా తల్లితండ్రులు బారసాలనాడు నాకు చేసిన నామకరణం అభిరామదీక్షితులు. ..."

మూడోవరసలోంచి ఎవరో విశ్వదాభిరామ వినురవేమా అంటూ దీర్ఘం తీసారు. దీక్షితులు అటుతిరిగి, "లేదు నాయనా, ఆ అభిరాముణ్ణి కాను. కనీసం దాయాదులం కూడా కాం." అన్నారు. ప్రేక్షకులు నిశ్శబ్దంగా నవ్వేరు. దీక్షితులుగారు సంక్రాంతి పదానికి అర్థం, విశేషాలు గబగబ నాలుగంటే నాలుగు ముక్కల్లో చెప్పిపరువు దక్కించుకున్నారు.

తరవాత నలుగురు పిల్లలు స్టేజిమీదికొచ్చి మాతెలుగుతల్లికి మల్లెపూదండ పాడేరు. తరవాత వరసగా పిల్లలు స్టేజీ ఎక్కడం, దిగడంతో ఓ అరగంట గడిచింది. స్టేజిమీద పాడుతున్నమరియు ఆడుతున్న పిల్లలు ఎవరు ఎవరితాలూకో స్టేజిముందు తిరగాడుతున్న కెమేరాలనిబట్టీ, స్టేజికి కాస్త ఎడంగా నిలబడి దిలాసా కబుర్లు చెప్పుకుంటున్నవారిని బట్టీ విశదం అవుతోంది. కాస్త చురుకుపాలు ఎక్కువైనవాళ్లు

పందేలు కాస్తున్నారు ఎవరెవరితాలూకు అయివుండొచ్చో, అలా అనుకోడానికి కారణాలేమిటో వివరిస్తూ.

మూడోవరసలో వున్న సుందరిగారు, “అదుగో ఆ చివరనున్న పాప మాపెదనాయన మూడోకూతురు మనమరాలు,” అంది పక్కన ఉన్నావిణ్ణి మోచేత్తో పొడిచి.

ఆ పక్కనున్నావిడ ఉలిక్కిపడి, సర్దుకుని, “ఇటు చూడండి, వీరయ్యగారివెనకాలున్న ఉంగరాలజుత్తు కుర్రాడే నేను మీకు ఇందాకా చెప్పింది. మావొరుగూరు చంద్రయ్యగారి బామ్మర్ది. మీ చెల్లెలికొడుక్కి ఈడూ జోడూను” అంది మరో చివరున్న చిన్నవాణ్ణి వేలెత్తి చూపుతూ.

అలా చూపబడిన కుర్రాడు వాళ్లవరస గమనించి పక్కకి తప్పుకున్నాడు అప్రసన్నంగా.

“నేను అభిరామ్‌గారి వైపుని” అంది సుందరిగారికి అటుపక్కనున్నావిడ కణ్వశ్రీగారి కోడలు.

సుందరిగారు అటుతిరిగి నవ్వింది. “బాగుంది. ఆయనేమో సుబ్బలక్ష్మిగారు హాబ్బినన్నారు. మీరేమో అభిరామ్‌గారి వైపునంటున్నారు.”

“వల్లిగారెక్కడా కనిపించలేదు. ఆమె రాలేదేమి” అన్నారు మరెవరో.

“సరేలెండి. మీకు తెలీదేమో. చక్రిగారు లేకుండా ఆవిడ రారు. ఆయనేమో ఇండియా వెళ్లారు.”.

“మీవారేరీ?” వెనకవరసలో వున్న వినతిగారు ముందుకి వంగి కౌశికిభుజం తట్టి ప్రశ్నించారు.

కౌశికి ఇబ్బందిగా కదిలి, “మీకు తెలీదేమో, మేం విడిపోయి చాలాకాలం అయిందండీ,” అంది.

“అయితేనేం. ఫ్రెండ్సుగా ఉండొచ్చునే, మా అమ్మాయి ఆల్సో డైవోర్సుడే. ఇప్పటికీ చిలకా గోరింకల్లా కలిసి తిరుగుతారు,” అంది వినతిగారు ఎరువువాక్కులు

వల్లెవేస్తూ. ఎవరిబాధలు వారివి. అందరికీ ఒక్కలా జరగదు అన్నమాట ఆవిడకి చెప్పినా అర్థం కాదు.

స్టేజిమీద అమ్మాయి "చేయెత్తి జైకొట్టు, తెలుగోడా, గతమెంతొ ఘనకీర్తి గలవోడా..." అంటూ అందుకుంది.

కౌశికి పాట వినసాగింది అతిప్రయత్నంమీద తాను చిన్నప్పుడు ఆ పాట నేర్చుకోడానికి ఎంత తంటాలు పడిందో గుర్తు చేసుకుంటూ. ఆ పాటే ఇప్పుడు మనసుని తాకడంలేదు ఎంచేతో మరి. నోరు వెగటుగా వుంది. వినతిగారి వాక్యాలు ఎదలో ముల్లై కెలుకుతున్నాయి. ఆయనే వుంటే మంగలెందుకు అన్న సామెత గుర్తుకొచ్చింది. కౌశికి మొహం కళ తప్పడం పంకజంగారు గమనించి చిన్ననిట్టూర్పు విడిచారు. చెప్పుకు తిరగడానికి నాగరీకదేశంలో నివాసం. మాటసొంపు చూస్తే ఇక్ష్వాకులనాటి జాతీయాలు!

ఇంతలో రమాన్‌గారు వచ్చి, "కాఫీ కావాలా?" అని అడిగారు పంకజంగారిని.

"ఎక్కడుంది, నేను తెచ్చుకుంటానులెండి" అని రమణగారికి సమాధానం చెప్పి ఇటుతిరిగి చూస్తే కౌశికి లేదు.

పంకజం లేచి, వరండాలో కాఫీ తీసుకుని, రెండు పంచదార గుళికలు తీసుకుని, చుట్టూ కలయచూసింది. దూరంగా ఓ స్తంభాన్నానుకుని నిలబడి సూర్యాస్తమయం తిలకిస్తున్నకౌశికి కనిపించింది. దగ్గరికి వెళ్దామా, వద్దా అని తను సందిగ్ధంలో పడి కొట్టుకుండగానే ఆ అమ్మాయే ఇటు తిరిగి చూసి చిన్నగా నవ్వింది. అదే పచ్చజండాగా గుర్తించి, పంకజం అటు నడిచింది.

"ఏం బయటికొచ్చేశారు, ఆ పాటలూ, ఆటలూ చూసేలా లేవనా?" అంది నవ్వి.

"అదేం లేదండీ. పిల్లలు, ఏంచేసినా ముద్దుగానే వుంటుంది. అందులోనూ మనదేశానికి ఇంతదూరంలో వుండీ ఆ మాత్రం నేర్చుకున్నారంటే గొప్పమాటే కదా."

కాస్సేపు ఇద్దరూ అస్తమిస్తున్న సూర్యుణ్ణీ, కమ్ముకొస్తున్న చిమ్మచీకట్లనీ చూస్తూ కూర్చున్నారు.

"అసలు ఇలాటి సమ్మేళనాలకి రావడం నాకంత ఇష్టం ఉండదు. రాను మొర్రో అని మొత్తుకుంటున్నా వినకుండా మా మేనత్త మనమరాలు ఈడ్చుకొచ్చింది వాళ్లమ్మాయి డాన్సుచేస్తుంది రమ్మని."

"ఏరీ ఆవిడ మరి?"

"తెరవెనకుంది. వాళ్లమ్మాయికి ముస్తాబు చేస్తోంది."

పంకజం తలూపింది.

కౌశికే కొంచెంసేపు ఊరుకుని, మళ్లీ అంది, నెమ్మదిగా తనలో తను మాటాడుకుంటున్నట్టు, "ప్రభావతిగారిని చూడండి. నా సంగతి నాకంటే ఆవిడకే ఎక్కువ తెలుసు. అయినా ప్రతిసారీ 'మీఆయన్ని ఇక్కడ చూసాను, మీఆయన ఇలా అన్నారు' అంటూ ఒకటే సొద. నాకంటె ఆవిడకే ఎక్కువ యావలా వుంది ఆయనగురించి. మళ్లీ తన భర్తనిగురించి మాటాడినప్పుడు మావారు అనదు. పద్మనాభంగారు అంటూ పేరెట్టి మాటాడుతుంది. నావిషయంలో మాత్రం 'మీఆయన' అంటుంది. అసలు ఎందుకు చెడిపోయిన సంబంధాలగురించి ఎత్తి పొడుస్తున్నట్టు మాటాడ్డం చెప్పండి. అక్కడికి 'ఫలానా ఆయన ఒగ్గేసిన ఆడమడిసి'గానే నా అస్తిత్వం అయినట్టు. ప్రతివారికీ ఈ కొండగుర్తులు అవసరమా అని కూడా అనిపిస్తుంది ఒక్కొక్కప్పుడు ..."

పంకజంగారికి మాట తోచలేదు. ఆ సమయంలో తను చేయగలిగిందల్లా వినడమే. మందహాసం చేసారు అర్థమయిందన్నట్టు.

మళ్లీ కౌశికే అంది, "ఇంతకీ మీమాట చెప్పనేలేదు. మీరెవరితాలూకూ?"

ఈసారి ఆవిడ గట్టిగానే నవ్వేశారు. కౌశికి కూడా నవ్వింది ఆ పూటకి తొలిసారిగా.

"తాలూకాలూ లేవు, జిల్లాలూ లేవు. ఎవరికి వారే యమునాతీరే," అంటూ ఆగిపోయారు, లిప్తపాటు తన వునికిని మరచి.

కౌశికి అప్పుడే కొత్తవ్యక్తిని చూసినట్టు ఆవిడమొహంలోకి చూడసాగింది.

‘‘అదికాదండీ. మీరు కూడా ఒక్కరే వచ్చినట్టున్నారు. మీకింత నిబ్బరం ఎలా వచ్చిందీ అని.’’

‘‘పారలాక్స్ ఎరర్ అనుకో. దృష్టిదోషం అనుకో. కొంతవరకూ మానవసైజం కూడాను. ప్రతిజీవుడికీ మరోమనిషికో, గుంపుకో చెందాలన్న తపన తప్పదనుకుంటాను. ప్రతిమనిషీ మరొక మనిషితో ఏదో ఓరకం చుట్టరికంకోసం అనుక్షణం వెతుక్కుంటూనే వుంటాడు, మా వూరువాడూ, మా పొరుగువాడు, మా కులంవాడూ, మా ఆఫీసులోవాడూ అంటూ. బీరకాయపీచు చుట్టరికాలు కలుపుకుంటూనే వుంటాడు. ఆదిని గణవిభజనకి కూడా ఇదే ప్రాతిపదికేమో.’’

‘‘మీకు మనుషులమీద మాచెడ్డ నమ్మకంలా వుంది,’’ అంది కౌశికి.

‘‘ఏమో, అది నమ్మకమో అమాయకత్వమో నాకు తెలీదు. నిజానికి మూఢ నమ్మకమేనేమో కూడా. ఒకకథ చెప్తాను. నేను దాదాపు పాతికేళ్లకిందట ఇండియా వెళ్లాను. ఆ రోజుల్లో బొంబాయో, మద్రాసో వెళ్లి మావూరు వెళ్లేవాళ్లం. అలా వెళ్లి వస్తూంటే, ఆసారి మాత్రం సవ్యంగా సాగలేదు. పూనాలో మాఅన్నయ్యని చూసి బొంబాయి బయల్దేరుతున్నాను. సరిగ్గా తెల్లారి బయల్దేరే సమయానికి మా పిల్లకి డయేరియా, నాకు నూటనాలుగు జ్వరం. ఏం చెయ్యను? నేనొక్కదాన్నయితే ఏదో తంటాలు పడుదును. చేతిలో మూడేళ్ల పిల్ల. మా అన్నయ్య ఆ రోజుకి ఉండిపోమన్నాడు. బొంబేలో ఎయిరిండియాకి ఫోన్ చేశాడు. వాళ్లు టికెట్టు మార్చడానికి ఒప్పుకున్నారు అన్నాడు. సరే రెండు రోజులతరవాత, కాస్త స్తిమితపడిన తరవాత, మాయిద్దరినీ టాక్సీ మాట్లాడి పంపించాడు. టాక్సీడ్రైవరుకి మరీ మరీ చెప్పాడు జాగ్రత్తగా తీసుకెళ్లమని. తీరా ఎయిరిండియా ఆఫీసుకి వెళ్తే నెలరోజులవరకూ ఖాళీ లేదన్నాడు ఆ ఆఫీసరు. నాకు గుండె గుభేలుమంది. మళ్లీ ఆ టాక్సీయే ఎక్కి బ్రిటిష్ ఎయిర్‌వేస్ ఆఫీసుకి వెళ్లాను. అక్కడా అంతే. అలా ఆ పూటంతా తిరిగాం.

గత రెండు రోజులుగా మాయిద్దరికీ ఒంట్లో బాగులేకపోవడం మూలంగానూ, రోజంతా టాక్సీలో తిరగడం మూలానూ ప్రాణం కడబట్టింది.

బండి తోలుతున్న సర్దార్జీకి కూడా విసుగేసినట్టుంది, ‘‘బెహన్జీ, నేను ఉదయంనుంచీ మీతోనే వున్నాను. మీరు ఎక్కడికి వెల్తారో చెప్పండి. మిమ్మల్ని అక్కడ విడిచేసి ఇంటికి పోతాను. మాభార్య, బిడ్డ నాకోసం చూస్తంటారు.’’ అన్నాడు సర్దార్జీ తనకొచ్చిన ఇంగ్లీషులో.

‘‘సరే, ఏదేనా చిన్న హోటలికి తీసుకెళ్లు,’’ అన్నాను నాకొచ్చిన హిందీలో.

నాకు మరీ పెద్ద హోటళ్లు పడవు. ఏదో మామూలు హోటలు చూడమన్నాను. అతను ఏవో రెండు మూడు హోటళ్లకి తీసుకెళ్లాడు. ఎక్కడా గదులు లేవు. ఊళ్లో ఏవో మీటింగులూ, సంబరాలూన్న. రాత్రి తొమ్మిదయింది. ఒకహోటల్లో ఒక చిన్నగది చూపించాడు ఆ మేనేజరు. చీకటిగుయ్యారం. కిటికీల్లేవు. తలుపు వేసుకుంటే ఇనప్పెట్టెలో వున్నట్టే. మనం సామాన్లకొట్టు అంటాం చూడు అలా వుంది. పగలయినా గాలీ వెల్తురూ తగిలే సూచనల్లేవు. ఆ మేనేజరు ఎందుకో బయటికి వెళ్లిన సమయం చూసి, సర్దార్జీ ‘ఈ గది బాగులేదు. మీరు వుంటానంటే మీఇష్టం. లేకపోతే వేరే చూద్దాం’, అన్నాడు, ఇంగ్లీషు వదిలేసి తనకలవాటయిన హిందీలో. మరో రెండు నిముషాలకి ఆ మేనేజరు తిరిగి వచ్చాడు.

‘‘మళ్లీ వస్తాను,’’ అన్నాను. ఈ గది నాకొద్దు అని స్పష్టంగా చెప్పడానికి బెరుకు. సర్దార్జీ కూడా కాస్త తొట్రుబాటుతో ‘నాదేంలేదు బహన్జీ ఇష్టం’ అన్నాడు.

ముగ్గురం బతుకు జీవుడా అనుకుంటూ బయట పడ్డాం.

కారెక్కాక, సర్దార్జీ అన్నాడు, ‘‘భాయిసాబ్ మిమ్ముల్ని జాగర్త అని చెప్పినారు. అంచేత చెప్తన్న బెహన్జీ. మీకు నమ్మిక అయితే మాయింటికి పోదాం. మాఅమ్మా, నాన్నా కూడా ఉండారు.’’

పంకజం ఒక్క క్షణం ఆగి మళ్లీ మొదలెట్టారు, ‘‘నేను అట్టే ఆలోచించలేదు. ఎందుకని అడక్కు. నాకు పూర్తిగా మతి పోయింది. సరే పదమన్నాను. అతనన్నట్టుగానే ఇంటినిండా జనం. ఫాతచుట్టాన్ని ఆదరించినట్టు అదరించారు

నన్నూ, మాపిల్లనీ. మర్నాడు బయల్దేరుతూ ఆ సర్దార్జీ కూతురుచేతిలో ఓ నోటు పెట్టబోయాను కాని వాళ్లు ఒప్పుకోలేదు. మమ్మల్ని తండ్రి ఎయిరిండియా ఆఫీసుకి తీసుకెళ్లాడు. నన్ను కార్లోనే ఉండమని చెప్పి అతను లోపలికెళ్లాడు. పావుగంటలో తిరిగొచ్చాడు. మాకు టికెట్లు దొరికాయి.''

''మంచివాళ్లే. మీకు భయం వెయ్యలేదూ?'' అంది కౌశికి విస్తుపోతూ.

''ఏమో అప్పట్లో నాకు తోచినట్టు చేశాను. తర్కానికి దిగితే నేను జవాబులు చెప్పలేను. ఇంటికొచ్చాక మావారికి చెప్తే, 'ఎవడితో పడితే వాడితే అలా వెళ్లిపోవడమేనా. బుద్ధి లేదూ. వాడు ఏసందులోకో తీసుకెళ్లి నాలుగు తంతే ఏంచేస్తావు' అని కేకలేశారు. నాకు మొదట్లో తోచలేదు కాని తరవాత ఆలోచిస్తే నాకే నవ్వొచ్చింది. ఏ సందులోకో తీసుకెళ్లడం ఎందుకు. ముందురోజు నేను ఎయిర్‌లైన్స్ ఆఫీసులచుట్టూ తిరుగుతున్నప్పుడు భోషాణాల్లా నాలుగు పెట్టెలు అతని కార్లోనే వదిలేశాను కదా. కావాలనుకుంటే అతను ఆ పెట్టెలతో సహా కారు తోలుకుపోయుండొచ్చు. నేను చేసేదేముంది కనక.''

''నిజంగా? కాకమ్మకథలా వుంది.''

''నమ్ము, నమ్మకపో, నీ ఇష్టం. నా మటుకు నేను కూడా చాలా ఆలోచించాను ఎందుకలా చేశానా అని. ఇప్పటికీ అనుకుంటూనే వుంటాను ఆ సర్దార్జీ రోజు ఎంతమందిని కారులో ఎక్కించుకుంటాడో, వాళ్లందరినీ తనయింటికి తీసుకెళ్తాడా, ఆ రోజు అతనికి ఆ బుద్ధి ఎందుకు పుట్టిందీ, నేనెందుకు అతన్ని నమ్మేనూ, మరో ప్రయత్నం గట్టిగా చెయ్యాలని నాకెందుకు తోచలేదూ .... నాకు ఇప్పటికీ సమాధానాలు లేవు. బహుశా అతను, భాయిసాబ్, బెహన్జీ అంటూ బంధుత్వాలు కలపడంతో మన ఆతిథ్యాలు ఏమూలో మనసున పొడగట్టి పనిచేశాయేమో.''

ఇద్దరు కొంచెసేపు మౌనంగా దిగంతాల్లోకి చూస్తూ కూర్చున్నారు.

“నిజమేనేమోలెండి. నేనందరికీ దూరంగా వుంటాను, ఒంటిపిల్లి రాకాశిని. అయినా ఏ కూరలబజారులోనో ఓ తెలుగుపలుకు వినిపిస్తే గిరుక్కున వెనుతిరిగి చూస్తాను అసంకల్ప ప్రతీకారచర్యలాగా” అంది కౌశికి తప్పు చేసినట్టు తలవంచుకుని.

“అయివుండొచ్చు. నువ్వు ఈ రోజు ఇక్కడికి రావడం కూడా అలాగే జరిగి వుండొచ్చు. మీ మేనత్త మనవరాలు నిమిత్తమాత్రురాలు.”

“మీమాటే నిజమనుకుందాం. నా ఇష్టాయిష్టాలు కూడా గమనించాలి గదా జనాలు. నేను ఏ బంధాలు పెంచుకున్నానో, ఏవి తెంచుకున్నానో తెలీనివాళ్లు కనీసం తెలీనట్టు వుండాలి కదా.”

“నా అభిప్రాయం ఏమిటంటే నిజానికి మనిషంత irrational జంతువు మరి లేదు భువిలో. ఎప్పుడు ఏ మాట తోస్తే అప్పుటికా మాట అనేస్తారు. ఆ వెంటనే మరిచిపోతారు. మళ్లీ వాళ్లే ఏ రోడ్డుమీదో నీకు తారసపడితే నిన్ను గుర్తుకూడా పట్టకపోవచ్చు. నీలాటివాళ్లు మాత్రం ఆ మాటలు పట్టుక్కూచుని మనసు పాడుచేసుకుని మథనపడతారు,” అన్నారు పంకజంగారు సన్నగా చీవాట్లు పెడుతున్నట్టు కనిపించకుండా.

ఇంతలో హాల్లోంచి హోరున చప్పట్లు వినిపించాయి.

కౌశికి మొహం చూసి ఏం అడగబోతూందో ఊహించినట్టు, “మరి ఇంకేం మాటాడకు. పద. ఇక్కడ మనం ఇలా తలా తోకా లేని కబుర్లతో కాలక్షేపం చేస్తూంటే అక్కడ వాళ్లందరు మంచి మంచి పాటలూ, డాన్సులూ వినీ, చూసీ ఆనందించేస్తున్నారు.”

“పదండి. మా మనవరాలి నృత్యం అయిపోయిందంటే నేను ఈ పూటంతా పడిన అవస్థకి ఫలితం సున్నా.” అంది కౌశికి కూడా లేస్తూ.

హాల్లో స్టేజిమీద అమ్మాయి మరియాద గాదయా అంటూ పాడుతోంది కమ్మని కంఠంతో.

000

# 14. కొత్తసీసా, పాతసారా

స్థానిక కాలేజీలో నాకు ఉద్యోగం దొరికినప్పుడు కొండనందుకున్నట్టు పొంగిపోయాను. ఎందుకంటే నాకు ప్రాణపదమైన మానవతా విలువలకి సంబంధించిన పని అది. ప్రతి విద్యార్థీ ఒక సెమెస్టరులో పది గంటలసేపు సంఘసేవ చెయ్యాలి. దానికి కొన్ని నియమాలు వున్నాయి. ఆ నియమాలు వివరించడం, వాళ్లని చక్కని రాజమార్గాన నడపడం నా విధి.

మా డైరెక్టరు నాకు వివరాలు చెప్పినప్పుడు నాకు చిన్న నవ్వొచ్చింది. మేం చిన్నప్పుడు కాపీబుక్కుల్లో రాసేవాళ్లం "ఆడి తప్పరాదు", "తల్లిదండ్రులు దేవునితో సమానము" లాటివి. దాంతో నీతులూ రాతలూ కూడా నీటుగా నాటుకుంటాయని మాపెద్దల ఉద్దేశం. అలా జరిగిందా అన్నది వేరేకథ అనుకోండి.

అమెరికాలో ఉగ్గుపాలతో "గెలుపు" పాఠాలు నూరిపోసి, ఎదిగిన తరవాత ఈ సన్మార్గాలూ, సంఘసేవా బోధిస్తున్నారు. అమెరికా, ఇండియా భౌగోళికంగా diametrically opposite కావడంచేత కావచ్చు!.

000

మికేలా వచ్చింది తను చెయ్యబోయే ప్రాజక్టుగురించి మాటాడడానికి.

"ఏంచేస్తావు?" అని అడిగాను మామూలుగానే.

"ఏమో"

ఇది కూడా మామూలే. వాళ్లకి ప్రపంచంలో సమస్త విషయాలూ తెలుస్తాయి కాని "సాటిమనిషికి నువ్వు చెయ్యగల సాయం ఏమిటి?" అంటే చప్పున చెప్పలేరు.

అరగంటసేపు తనకుటుంబం, చదువు, చెయ్యబోయే ఉద్యోగం మాటాడినతరవాత ఆ ఉద్యోగానికి పనికొచ్చే సంఘసేవ బోధిస్తాను. అందులో కూడా సొంతలాభం కొంత పొందుపరచక తప్పదు మరి! పుణ్యమనే కదా పూజలూ, వ్రతాలూను.

బిజినెస్ ఎడ్మినిస్ట్రేషన్ మేజరుట. సరే, ఏ బిజినెస్ గానీ మనుషులతో పని- ఎదటివారి మనస్తత్వాలు అర్థం చేసుకోడం కదా. అంచేత ఊళ్లో వున్న రెండు సేవాసమాజాలకి వెళ్లి అక్కడ ఏం చేస్తున్నారో, తనక్కడ చెయ్యగలిగిన సాయం ఏమేనా వుందేమో చూడమన్నాను.

ఇప్పుడు ఆ మాట చెప్పడానికే వచ్చింది.

"నాకో మంచి ప్రాజెక్టు దొరికింది," అంది హుషారుగా.

"ఎక్కడ?" అని అడిగాను.

ఊరిచివరనున్న నర్సింగుహోంలోనట. "పైగా అక్కడ ఒక ఇండియన్ ఆవిడ వుంది. అంచేత నేను కల్చరల్ డైవర్సిటి కూడా స్టడీ చెయ్యొచ్చు," అంది మికేలా.

సరే, తాను అక్కడ తన ప్రాజెక్టుకి సానుభూతి [compassion], నిస్సహాయులకి సాయము చేయుట [helping the needy], భిన్న సంస్కృతులలో విలువలు [cultural diversity] అను మానవతావిలువల అధ్యయనం చేయుట అని నిర్ణయించేం.

ఆ అమ్మాయి లేవబోతూ, "ఇండియాలో ఉమ్మడికుటుంబాలు కదా, రెండుగదుల్లో పదిమంది వుంటారు. ఆవిడని ఇక్కడికి తీసుకొచ్చి నర్సింగుహెంలో పెట్టడం ఏమిటి?" అంది.

000

ఇదివరకు ఇలాటి విషయంలోనే తను అడిగిన ప్రశ్న గుర్తొచ్చింది, "రెండుగదుల్లో ఆరుగురు వుంటే మరి పిల్లల ఎదుటే ... చేస్తారా?" అని. ఏమిటి అడుగుతోందో వాచ్యం చెయ్యలేదు నామీద గౌరవంతో. నాకు ఏంచెప్పాలో తోచలేదు.

"పిల్లలముందు చెయ్యరు కాని కావాలనుకుంటే దారే వుండదా? జనాభా చూస్తే తెలుస్తోంది కదా" అన్నాను తేలిగ్గా.

ఎవరు ఎలాటి ప్రశ్నలు వేస్తారు అన్నది కూడా సాంస్కృతికవిజ్ఞానంలో భాగమే. అదే వయసుగల తెలుగు పిల్లలు ఆ ప్రశ్న వేస్తారనుకోను.

000

మికేలా నామొహం చూస్తూ నిలబడింది జవాబు కోసం. "ఆయన ఈదేశంలో ఉండడంచేత మారిపోయారా?"

నాక్కూడా ఆ అనుమానం వచ్చింది కాని బయటబడడం నాకు ఇష్టం లేదు. మామూలుగా పెద్దవాళ్లని ఇక్కడికి తీసుకొచ్చింతరవాత ఇంట్లో పెట్టుకోడమే చూశాను కాని నర్సంగుహోంలో పెట్టడం చూడలేదు.

"నీ ప్రోజెక్టులో అది కూడా భాగమే. చూడు ఏం నేర్చుకుంటావో," అన్నాను గోడమీద పిల్లివాటంగా.

సరేనంటూ వెళ్లిపోయింది.

ఆ తరవాత మికేలా అప్పుడప్పుడొచ్చి తను కనుగొన్న సరికొత్త విషయాలు చెప్తూనే వుంది.

ఆశ్చర్యం, ఆవిడ అంటే పూర్ణిమాదేవి పెళ్లి చేసుకోలేదట.

వాళ్లచెల్లెలికి పదకొండుమంది పిల్లలుట.

స్కూలు టీచరుగా పనిచేస్తూ వీళ్లందరికీ చదువులు చెప్పించిందిట.

పెద్దపిల్లలు ఎదిగి ఉద్యోగాల్లో చేరిన తరవాత, చిన్నవాళ్లని చదివించారట.

తాను గ్రహించిన ప్రతివిషయమూ ఆ అమ్మాయికి వింతే. నాకు చాలా మామూలు విషయం. తాను ఎన్నో సంగతును నేర్చుకున్నానని చెప్పేది మహోత్సాహంతో.

తననిగురించి కూడా చాలా ప్రశ్నలు వేసేదిట ఆవిడ. మొదట చిరాగ్గా అనిపించినా అది వాళ్ల అలవాటు అనుకుని జవాబులు చెప్పిందిట. తన కుటుంబం ఫొటో కూడా ఇచ్చిందిట.

గుడ్, గుడ్ అంటూ వస్తున్నాను నేను నవ్వుతూ.

000

పూర్ణిమాదేవి - అదే నర్సింగ్‌హోంలో మికేలా సందర్సిస్తున్న ఆవిడ - తన కుటుంబంగురించి పదే పదే చెప్తూండడంతో మికేలాకి ఓ ఆలోచన తోచింది.

“నేను ఆవిడకి ఒక కలాజ్ [collage] చెయ్యమని చెప్పాను. ఓ పెద్దబోర్డుమీద తనకి అభిమానులయిన వాళ్లందరి బొమ్మలూ అమర్చి, దానికి వత్తాసుగా ఓ చిన్నపుస్తకం  వాక్చిత్రాలు రాయమని. నేను సాయం చేస్తాను,” అంది.

“చాలా మంచి ఊహ,” అన్నాను, నిజంగానే సంతోషిస్తూ. మనకి దాపరికం లేదు. డాక్యుమెంటేషను చాలా తక్కువ. మన చరిత్ర అంతా మౌఖికమే కదా.

మికేలా సందేహిస్తూ, “ఖర్చులు డిపార్ట్‌మెంటు ఇస్తుందా?” అని అడిగింది నెమ్మదిగా.

“ఎంత?”

“ఏమో.”

కలాజ్‌కి అట్టబోర్డు, గమ్, కథ రాయడానికి ఓ నోట్‌బుక్కు, లేకపోతే తెల్లకాయితాలు - ఎలా చూసినా పది డాలర్లకి మించదు. డిపార్ట్‌మెంటంటే, రసీదులూ, ఫారాలు, అప్రూవలూ, ఎందుకొచ్చిన గొడవ అని నాపర్సు తీసాను.

మికేలా చూసి, నెవర్‌మైండ్ అనేసి శలవు పుచ్చుకు వెళ్లిపోయింది. వెళ్తూ, “వెరీ ఎక్సైటింగ్” అని మరోసారి చెప్పి.

ఆతరవాత నాలుగు వారాలు కనిపించలేదు.

సిమెస్టరు చివరికొచ్చింది. మికేలా తను కనుగొన్న సంగతులూ, దానిమూలంగా తన దృష్టిలో, ఆలోచనా ధోరణిలో వచ్చిన మార్పులూ రిపోర్టివ్వాల్సిన రోజు దగ్గరకొచ్చింది.

ఎప్పుడు కలుస్తావో చెప్పమని ఈమెయిలు ఇచ్చేను. జవాబుగా తనే వచ్చింది.

"నాకో చిన్న సమస్య వచ్చింది," అంది జంకుతూ.

ఇది కూడా మామూలే. చాలామంది ఆ ముగింపు దగ్గరకొచ్చేసరికి కాస్త ఆదుర్దా పడతారు - తాము చేసింది చాలదేమో, ప్రోజెక్టు అప్రువు కాదేమో అని.

"ఫరవాలేదులే. నువ్వు పాసవుతావు," అన్నాను ధైర్యం చెప్తూ.

"అది కాదు. నేను కాలేజీ చివరిరోజునే వూరు విడిచి పోవాలి. ఈలోపున మూడు పెద్ద పేపర్లు రాయాలి. .."

నాకు చిరాకేసింది. ఈ నోది అంతా ఎందుకు?

"ఏంచెయ్యాలనుకుంటున్నావో చెప్పు" అన్నాను.

"ఆ కలాజ్ ఇంకా పూర్తి కాలేదు."

"అంటే మధ్యలో వదిలేస్తానంటావా?"

"లేదు. చేస్తాను, వచ్చేవారం వెళ్లి పూర్తి చేస్తాను. ఈ లోపున మన ఇంటర్వ్యూ చెయ్యొచ్చా అని ..."

నాకు ప్రాణం కుదుటపడింది. తొందరపడ్డది నేనే. క్షమాపణలు చెప్పుకోలేదు కాని ఇంటర్వ్యూ చేస్తానన్నాను.

మర్నాడు తొమ్మిది గంటలకి రమ్మన్నాను. సరే అని వెళ్లిపోయింది.

OOO

మికేలా రిపోర్టు రాయలేదు, ఇంకా పని పూర్తికాలేదు కనక.

అంచేత ప్రస్తుతానికి వాగ్రూపంలోనే.

మామూలుగా ఈ ఇంటర్వ్యూలు టేప్ చేస్తాం తరవాత తగువులేమైనా వస్తే సాక్ష్యం కోసం.

మికేలా దానివేపు చూసి "రికార్డు చెయ్యాలా" అంది. ఆ అమ్మాయికి చెమటలు పడుతున్నాయి.

అది చూసి, "నీకు అభ్యంతరం అయితే చెయ్యను," అన్నాను.

"నాకు ఇష్టంలేదు."

"సరే" అని, స్టూడెంటుకి అభ్యంతరమయినందున టేపురికార్డరు ఆపు చెయ్యడమయినది అని రాసుకున్నాను.

"ఏమిటి నీ ప్రోజెక్టు?"

"వయసుమళ్లినవాళ్ల ఆలోచనలు, అభిప్రాయాలూ తెలుసుకోడం, ఇతర సంస్కృతులగురించి తెలుసుకోడం."

"నీ సబ్జక్టు వయసుమళ్లిన విదేశీ స్త్రీ కదా. అందువల్ల నీకు అధికంగా తెలిసినదేమిటి?"

"చాలా తెలిసింది. నేను ఇండియాలో ఆడవాళ్లగురించి విన్న చాలా సంగతులకీ, విడివిడిగా ఒకో మనిషి జీవితానికీ చాలా తేడాలుంటాయి."

"ఏమిటి ఆ తేడాలు?"

"పెద్దపెద్ద కుటుంబాలు చాలామంది చిన్నయిళ్లలో వున్నప్పుడు రాగల తగువులగురించే నేనెప్పుడూ వింటూ .వచ్చాను. మేం ఇక్కడ అంటుంటాం ఫెమిలియారిటి మితి మీరి కంటెంప్ట్‌కి దారి తీస్తుందని. కాని అదే ఫెమిలియారిటివల్ల ఆత్మీయతలు కూడా పెరుగుతాయేమోననిపించింది ఆమెతో మాటాడినతరవాత. నేను మా కేంపుకి వెళ్లినప్పుడు చూసాను కొంచెం. కాని అవి అట్టే కాలం నిలవవు. అక్కడున్నంతసేపే "కేరింగ్ అండ్ షేరింగ్".

పూర్ణిమాదేవిని ఇక్కడికి తీసుకొచ్చిన మిస్టర్ ప్రనీల్ సొంతకొడుకు కాదు. చెల్లెలి కొడుకు. పదేళ్లకిందట ఇండియా వెళ్లినప్పుడు ఆవిడ చెప్పిందట తనకి జరుగుబాటు

కష్టంగా వుందని. చెప్పకోడానికి పదిమంది వున్నా ఎవరిబాధలు వాళ్లవి. అంచేత ప్రనీల్ తనతో తీసుకొచ్చేసాడు. ఆవిడ తనని పెంపకం తీసుకుందని దాఖలా చూపి గ్రీన్‌కార్డు సంపాదించి తనదగ్గరే వుంచుకున్నాడు. కాని ఈమధ్య పరిస్థితులు మారిపోయాయి. ఇద్దరు పిల్లలతరవాత కలిగిన పిల్లాడికి మల్టిపుల్ సొలరిసిస్. ఆ పిల్లాడికి తల్లి అవసరం 24 గంటలూను. అంచేత ఆవిడ అత్తగారి అవసరాలు ఆదుకోలేకుండా వుంది. ప్రనీల్ ఉద్యోగంవల్ల నెలకి 20 రోజులు రోడ్డుమీదే వుంటాడు. అంచేత ఆ దంపతులు మరో దారి లేక, అందుబాటులో వున్న సదుపాయం కాదనలేక ఆవిడని అక్కడ పెట్టారుట.''

మికేలా కళ్లు చెమర్చడం చూసి నాక్కూడా అదోలా అనిపించింది. ఏ దేశంలో కానీ ఏ జాతిలో కాని మానవత్త్వపు ఛాయలు ఎప్పుడూ ఒక్కలాగే వుంటాయేమో అనిపించింది.

OOO

సెమెస్టరు అయిపోయింది. ఆఖరిరోజు. అమ్మ రాసిన వుత్తరంలో సంగతులు ఆలోచిస్తూ కూర్చున్నాను. అమ్మమ్మకి చాదస్తం ఎక్కువయిపోయింది. మామయ్య ''కొన్నాళ్లు నీదగ్గర పెట్టుకో'' అని తీసుకొచ్చి ఇక్కడ దించేసిపోయాడు రెండు నెలలకిందట.

ఆవిడ చిట్టినీ, సుజీనీ చంపుకుతినేస్తోంది ''ఎక్కడికెళ్తున్నావు, ఎవరితో వెళ్తున్నావు, ఏ సినిమాకి, చీరలెందుకు కట్టుకోవూ,'' కట్టుకుంటే ''అలా కట్టుకున్నావేమిటి,'' ''తల దువ్వుకోలేదేం'', దువ్వుకుంటే ''అదేం దువ్వుకోడం'' ... ఏదో ఓ గొడవ రోజూ .....

టైము చూసాను. ఆలోచిస్తూండగానే నాలుగున్నర. ఆ రోజుకి నా పని అయిపోయింది. కంప్యూటరు ఆఫ్ చేసి, కాయితాలు డ్రాయరులో పడేసి లేవబోతుంటే మికేలా వచ్చింది. మరోసారి నాకు బై చెప్పడానికి వచ్చిందనుకున్నాను. నా బాధ్యత

నేను అత్యంత సమర్థవంతంగా నిర్వహించేను. మరొకసారి నాకు కృతజ్ఞతలు చెప్పడానికొచ్చింది. నాకు కించిత్ గర్వం కలిగింది.

“ఇంకా ఇక్కడే వున్నావేమిటి, నీఫ్లైటు టైమయిపోలేదూ?” అన్నాను.

ఆ అమ్మాయిమొహంలో ఏదో తికమక కనిపించింది.

“టైము అయిపోతోంది. కాని ఒక సంగతి మీతో అత్యవసరంగా మాటాడాలనిపించింది.”

“ఏమిటి?”

“అదే కలాజ్‌మాట.”

“కలాజ్? ఏమయింది? బాగా రాలేదా?”

“నేను అన్ని రోజులు గడిపేను ఆవిడతో. నా పనులు మానుకున్న సమయాలు కూడా వున్నాయి. కలాజ్ చూపించి ఆవిడ పరమానందపడిపోతూ థాంక్సు చెప్పింది. అది చూసి ఆశ్చర్యంతో నాకు నోటమాట రాలేదు.”

“బాగుంది. నీకు గర్వకారణం.”

“అది కాదు. ఆ కలాజ్‌లో నాబొమ్మ ....”

“ఏం, లేదా?”

“వుంది” అని ఓక్షణం ఆగి, “పోస్టేజి స్టాంపంత! ఓమూల. ఆవిడ నాగడ్డం పుచ్చుకుని ‘ఇదిగో నువ్వు’ అని నాబొమ్మ చూపించినప్పుడు నాకు అర్థమయింది ఆవిడ ఎనభై అయిదేళ్లజీవితంలో నా పాత్ర ఎంత చిన్నదో ... నేను ఎంతసేపూ నేనెంత సేవ చేస్తున్నానో అనే ఆలోచిస్తూ వచ్చాను ఇంతవరకూ.”

నేను తెల్లబోయాను.

“Very humbling experience. అదే నా ప్రాజెక్టులో నేను నేర్చుకున్న నిజమైనపాఠం, మీకు చెప్పాలనిపించింది. బై” అనేసి గబగబా వెళ్లిపోయింది.

నాకు తలతిరిగింది. కుర్చీలో కూలబడ్డాను అచేతనంగా. అమ్మమ్మా, సుజీ, చిట్టీ, పూర్ణిమాదేవీ, కొత్తరంగులు పులుముకుంటున్న పాతకాలపు విలువలూ, “నా”

చుట్టూ గిరికీలు కొట్టే "నేను" కలగాపులంగా ఝుమ్మని లేచాయి కందిరీగల్లా నామనసాకాశంలో.

ooo

(కౌముది.నెట్ లో ప్రచురితం. జులై 2007)

# 15. తల్లీ, నిన్ను దలంచి ...

గౌరీపతి అమెరికాలో దిగేనాటికి ముగ్గురు పిల్లలూ, నాలుగుపదులమీద నాలుగేళ్లవయసూను. అప్పటికి అతనికి ఇంగ్లీషుభాషమీద గొప్ప అధికారం వున్నా తెలుగంటే అంతకి మించిన అభిమానం. అతనికి తగ్గట్టే అర్ధాంగి సావిత్రి కూడా దొరికింది. అవిడకి నూనెవంకాయా, మిరపకాయ బజ్జీలూ, పులిహోరా, కొత్తిమీరకారంలాంటి వంటకాలే చేతనవును. వంటా, పిల్లలూ తనబాధ్యత అని గట్టిగా నమ్మిన సాధ్వి. వీటన్నటిమూలానా అతనికి అమెరికాలో వున్నా అచ్చం దేశంలోనే మనలోగిళ్ల ఉన్నట్టే ఉండడంచేత వారిసంసారం విరగబూసిన మందారంలా కన్నులపండువగా కళకళ్లాడుతోంది.

అతనలా జన్మభూమిమీది మమకారాలు మనసులో మననం చేసుకుంటున్న దినాలలోనే విశాఖపట్నంలో ఉన్న మిత్రుడు భగవంతం చాట్లోకొచ్చి (చేట కాదండీ, చాటు) సతాయించేడు ఓమారు రాకూడదా అంటూ. ఇద్దరూ ఓ పావుగంటసేపు ఘర్షణ పడ్డాక, ‘‘ఏదైనా సభ ఏర్పాటు చెయ్యి, వస్తాను,’’ అన్నాడు గౌరీపతి.

‘‘దానికేంవుంది. భాషాఘోష దిక్కుల పిక్కటిల్లుతోందిక్కడ. ఆరిపోతున్న తెలుగుభాషకి ఊపిరి పోసి నిలబెట్టాలని మహా ఆరాటపడిపోతున్నాం మేం అందరం. మాకంటే అమెరికాలో వున్న మీరే ఎక్కువ భాషాపోషణ చేస్తున్నారని కూడా ఇక్కడ ఓ అభిప్రాయం వుంది. నువ్వు రా. నీ అమెరికను కనులతో మనదేశం చూసి, నీఅనుభవాలు కూడా చర్చకి పెట్టొచ్చు,’’ అన్నాడతను.

సరేనన్నాడు గౌరీపతి.

దరిమిలా భగవంతం హుషారుగా విశాఖపట్నం, వాల్తేరు, విజయవాడ, రాజమండ్రీ, మరియు రాజధానిలోనూ ఉన్న అనేకానేక పెద్దలని కలుసుకుని,

అవుననిపించుకుని, తగిన సంభారాలు సమకూర్చుకునేసరికి మరో రెండేళ్లు గడిచిపోయేయి.

అలా మొత్తం ఎనిమిదేళ్లతరవాత గౌరీపతి మాతృదేశానికి ప్రయాణమయేడు. కొడుకు శ్రీను, పెద్దమ్మాయి కవిత అప్పటికి టీనేజరులు.

"యూరపయితే వస్తాం కానీ ఇండియాలో ఏముంది దోమలూ, దోపిడీ తప్ప" అన్నారు వాళ్లిద్దరూ.

"వాళ్లనొదిలేసి, నేనెలా వస్తాను?" అంది సావిత్రి. అటు పిల్లలతో వాదించలేక, ఇటు సావిత్రికి సమాధానం చెప్పలేక, గౌరీపతి ఒక్కడే బయల్దేరేడు బంధుజనులకోసం కొన్న విదేశీ వస్తుసంచయంతోపాటు కొన్ని పాతజ్ఞాపకాలు మూట కట్టుకుని.

బొంబాయిలో ప్లేను దిగి, రైలెక్కి, హైదరాబాదులో దిగగానే తొలి షాకు తిన్నాడు గౌరీపతి. ఎనిమిదేళ్లలో దేశం ఇంతగా మారిపోగలదని ఎవరైనా అతనితో అని వుంటే అతను నమ్మి వుండేవాడు కాడు. హైదరాబాదు రాజధాని కదా అంతేలే అని సరిపెట్టుకుని, కోణార్క ఎక్కి విశాఖపట్నంలో దిగి బస్సెక్కి సీతమ్మధార చేరుకున్నాడు.

అక్కడా అంతే. కిరసనాయిలు దీపాలకి బదులు కరెంటులైటులొచ్చాయి. గుమ్మాలకి పసుపూకుంకుమల స్థానాన వార్నీషులు వేసుకుంటున్నారు మిద్దెఇళ్లవాళ్లు. గౌరీపతి మనసు చిన్నబుచ్చుకుంది.

విశాఖపట్నంలో పెద్దపెట్టున అంతర్జాతీయ తెలుగుభాషోద్ధరణసభ ఏర్పాటు చేశారు. ఆంధ్రాలో వున్న రాజుగారూ, రెడ్డిగారూ, నాయుడుగారూ, చౌదరిగారే కాక మద్రాసునుండి చెట్టిగారూ, బెంగుళూరునించి మూర్తిగారూ, కొల్‌కొటానించి రాయ్‌గారూ, ఇంగ్లండునుండి విష్, అమెరికానించి గౌరీపతీ, పంటు, మరియు జర్మనీనించి చెంగళ్ కూడా వచ్చేరు. అలాగే ఇంకా చాలాదేశాల్లో పాతుకుపోయిన తెలుగుభాషాభిమానులు, తెలుగు భాషాప్రేమికులూ, తెలుగు భాషోద్ధారకులూ చాలామంది ఆ మహాసభల్లో పాల్గొనడానికి విచ్చేశారు.

"మిస్ ఆషీమాని కూడా కార్యవర్గంలో చేర్చుకుందాం," అన్నారు నాయుడుగారు. ఆషీమా అసలుపేరు ఆచింత పొన్నులక్ష్మీప్రసూనాకుమారి. ఆపేరు ఆధునికంగా లేదని, అసలు చాలామంది పలకనే లేరనీ, బెంగాలీపేర్లకి గిరాకీ అనీ - ఇలా చాలాకారణాలు వెతుక్కుని, ఆవిడ తనపేరు ఆషీమాగా మార్చేసుకుంది. గొప్పసంఘసంస్కర్తగా ఇప్పుడిప్పుడే ప్రజలనోట నానుతోంది.

"ఆమెందుకండీ ఫెమినిజమో అంటూ గోల్లేపుతుంది," అన్నాడు చౌదరి.

"ఆ, లేదులెండి. మనమాటినే మడిసే. అదీగాక మనగ్గూడా గౌరవమే. మళ్ల ఆడాళ్లని వేరెట్టేశాం అనీడానికెవరికీ ఔకాసం వుండదు," అన్నాడు చెట్టి.

చెంగళ్ కూడా మంచిపాయింటే అంటూ వత్తాసు పలికేడు. వారిసంస్థ డెమొక్రటిక్ ప్రిన్సిపులులమీద ఏర్పాటయింది కనుక అది సబబే. వేరెట్టడాలు వారికి పట్టవు. కులతత్త్వాలంటే మహమంట వారికి. "ముక్కోటిఆంధ్రులు ఒక్కజెండానీడ .. చేయెత్తి జైకొట్టు తెలుగోడా ..." అంటూ పాడుకుంటున్నవారూ, పాడుకోగలవారూనూ. అందుచేత స్త్రీలకి ప్రాతినిధ్యం ఇవ్వవలసిన అగత్యం గుర్తింపబడిపోయింది అట్టే శ్రమ లేకుండా.

కార్యక్రమాలు ఘనంగానే ఏర్పాటు చేశారు. రెండురోజుల్లో పన్నెండు పేనలులకి నిర్ణయం అయింది.

మిస్. ఆషీమా స్త్రీలకి ప్రత్యేకంగా ఒక పేనలు పెట్టాలనీ, మిగతా అన్ని పేనలులోనూ ఒక స్త్రీ తప్పకుండా ఉండాలనీ ప్రతిపాదించింది. వెనువెంటనే మరో ప్రశ్న ఉదయించింది.

"అన్ని పేనలులలోనూ పెట్టేంతమంది ఆడవారు మనకెక్కడున్నారండీ?"

"అసలే వాళ్లబుర్రలు చిన్నవి."

ఆమాటకి ఆషీమా ఉరిమిచూసింది, "అంటే మీఅభిప్రాయం?"

"అది నేనన్నమాట కాదండీ. ఆమధ్య ఎవరో హార్వర్డు ప్రొఫెసరు అన్నారని మరెవరో అన్నారు. నేను హాస్యానికి అన్నాను, అంతే," అన్నాడు చెంగళ్ నవ్వుతూ. ఆ తరవాత చుట్టూ చూశారు. ఎవరూ నవ్వలేదు.

"ఇంతకీ మీ పేనలులలో స్త్రీలకి ప్రాతినిధ్యం ఇస్తారా? ఇవ్వరా?"

"మీరే చెప్పండి ఏపేనలులో ఎవరిని పెడితే బాగుంటుందో?"

దాంతో ఆషీమాకి గొప్పచిక్కొచ్చి పడింది. ఎవరిపేరు చెప్పినా ఏదో వంక ...

"ఆవిడని కిందటేడు పిలిచాం కదా."

మరొకరు అయితే ... "ముందోసారి పిలిచేంవండీ. వాళ్లాయనకి కూడా బిజినెస్ క్లాసు ఎయిర్ ఫేర్సు కావాలందామె. ఎక్కడ తెస్తాం అంత డబ్బు?"

మరొకరు అయితే ..."అబ్బే, ఆవిడకి మాటాడ్డం చేతకాదు."

మరొకావిడ అయితే ... "నో, నో. ఆవిడకి మనవర్కుమీద గవురం లేదు,"

.మరో .. "వాటెబౌట్ .ఫలానా ..?"

"ఆమెమాట ఎత్తకండి బాబూ! 'ఫలానామె'ని పిలిస్తే 'ఫలానాయన'తో తగువు. కొరివితో తలగోక్కున్నట్టే."

ఆషీమాకి ఆయాసమొచ్చింది కానీ అందరిచేతా అవుననిపించగల స్త్రీలపేర్లు రెండుకి మించి తగల్లేదు. ఆ యిద్దరినీ రెండు పేనలులో పెట్టడానికి ఒప్పందం అయింది.

సభలు అత్యంతసంరంభంతో ప్రారంభమయేయి. రాజధానినించి విద్యశాఖామంత్రి వచ్చేరు. ఉద్యోగవిరమణానంతరం ఊటీలో విశ్రాంతి తీసుకుంటున్న తెలుగు ఆస్థానకవి ముఖ్య అతిథి. ఆయన విద్యాశాఖామంత్రితో సరిసమానంగా రాజలాంఛనాలతో విమానంమీద వేంచేశారు. మిగిలిన వక్తలు వారి వారి వీలునుబట్టీ, తాహతులనిబట్టీ, తగువాహనాలలో దిగారు.

మొదటిరోజు అసలు "తెలుంగులెవరూ," "తెలుంగు అననేమి," "తెలుంగువారి సాంప్రదాయాలు ఎట్లు నెలకొనెను" వంటి వివిధ విషయాలమీద ఉపన్యాసాలు

ఇవ్వబడ్డాయి. "ఈ రోజు మనం చాలా కొత్తవిషయాలు తెలుసుకున్నాం" అనుకుని ప్రజలు ఆనందించేరు.

రెండోరోజు అకస్మాత్తుగా అవాంతరం వచ్చిపడింది. ఆనాడు సభకి అధ్యక్షత వహించవలసిన పద్మశ్రీ సంపూర్ణా ఘోష్ కార్యదర్శి భగవంతానికి అర్ధరాత్రి ఫోను చేసి అనారోగ్యం కారణంగా తాను సభకి హాజరు కాలేనని తెలియజేశారు. తనఇంట్లో ఫోను వున్నందుకు అతను విచారించింది బహుశా ఆ ఒక్కరోజేనేమో. ఆ తరవాత కొంతసేపు అధ్యక్షులవారిని పిలవనా వద్దా అని తనలో తనే తర్జనభర్జన చేసుకుని, "నువ్వే ఏదో ఓదారి చూడు" అని ఆయన అంటారని తనకి తనే సమాధానం చెప్పుకుని, ఆ దారి కనుక్కుని, ఆ దారిన పోతున్న ఓ దానయ్యని దొరకపుచ్చుకుని, కార్యవర్గం పరువు నిలబెట్టేడు. తెల్లారేక, అధ్యక్షులవారికి తెలియజేశాడు వివరాలు. ఆయన అతని కార్యదక్షతని మెచ్చుకున్నారు.

మొత్తంమీద వక్తలూ, సభాపతీ సభామండలం అలంకరించేసరికి పది దాటింది. సభికులు వాచీలు చూసుకుంటూ మొదలెట్టు-తంట్రీ-మొహాలు పెట్టేరు. ప్రకటించిన సభాపతి కారణాంతరావల్ల రాలేకపోయారని చెప్పి, స్వల్పవ్యవధే అయినా అంగీకరించినందుకు దానయ్యగారికి పుష్కలంగా కృతజ్ఞతలు చెప్పి కార్యక్రమం ప్రారంభించేరు.

దానయ్య లేచి సభాసదులకు నమస్కరించి, "ఇప్పుడు రాయ్‌గారు మాటాడతారు" అని చెప్పి కూర్చున్నాడు.

రాయ్‌గారు లేచి, తెలుగుభాష యొక్క గొప్పతనంగురించి చక్కగా వివరించేరు.

"కన్నడప్రభువు శ్రీకృష్ణదేవరాయలు దేశభాషలందు తెలుగు లెస్స అన్నారు. సార్వభౌములు నన్నయ్యని భారతం తెనిగించమని నియమించడమే కాక తాను స్వయంగా ఆముక్తమాల్యద అను ప్రబంధాన్ని తేటతెనుగులో రచించారు. ఎందుకంటే తెలుగు ద్రాక్షాపాకమువలె మధురముగా ఉండును కనుక. ఆ తరవాత శ్రీ పాలగుమ్మి పద్మరాజుగారు తమ తెలుగుకథలని తామే ఇంగ్లీషులోనికి అనువదించి న్యూయార్క్

హెరాల్డ్ ట్రిబ్యూన్ నిర్వహించిన ప్రపంచకథలపోటీలో బహుమతులు పొంది, తెలుగుసాహిత్యానికి అంతర్జాతీయఖ్యాతిని గడించి పెట్టేరు. అంటే తెలుగుసాహిత్యం ఘనత తెలుస్తోంది కదా …''

రాయ్‌గారిఉపన్యాసం అంతా ఇక్కడ రాయడం అయేపని కాదు కానీ ఇదేధోరణిలో సాగింది ముప్పావుగంటసేపు.

ఆ తరవాత సింహళనించి వచ్చిన అళహసింగరి తాము విదేశాల్లో వుంటూ తెలుగుభాషని ఎలా పోషించుకుంటూ వస్తున్నారో చెప్పేరు. ఆయన ఉంటున్న ఊరిలో ఓ పది తెలుగుకుటుంబాలు వున్నాయిట. నెలకొకసారి కలుస్తారుట. తెలుగులో మాటాడుకోడం, చదువుకోడం, చేస్తారుట. అదికాక, ప్రతి ఆదివారం ఉదయం ఆరుగంటలకి ఆకాశవాణిలో గంటన్నరసేపు తెలుగు కార్యక్రమం నడుపుతారుట. అందులో ఒక్క ఆంగ్లపదం మచ్చుకయినా వుండదుట.

''ఆ కార్యక్రమములో మీరు ఒక్క ఆంగ్లపదమయిన ఎత్తి చూపగలిగిన, పదివేల రూప్యములు ఇత్తునని ఇదే నా సవాలు. తెలుగభాషయందు అభిమానముతో ఇక్కడ చేరిన మీరందరును సాక్ష్యము. నాహస్తవాహకవాక్‌శ్రవణయంత్రసంఖ్య కూడ మీకు ఇవ్వగలను. మీరందరూ తెలుగు మాయమయిపోతున్నదనీ, తెలుగుభాషని తిరిగి పునరుద్ధరించవలెనని అంటున్నారు. మీకు నిజముగా తెలుగుభాషయందు అభిమానము ఉండిన, ముందు మీరు ఇప్పుడు మాటాడుచున్న సంకరభాషను, ముప్పాతిక ఆంగ్లపదములతో కూడిన తెలుగును వదిలిపెట్టుట మొదలుపెట్టవలెను,'' అని చెప్పి ముగించేరు.

కార్యకర్తలు మొహమొహాలు చూసుకున్నారు. ఇంతవరకూ తాము ''అట్టి సంకరభాషలోనే మాటాడుచుంటిమి'' అని అప్పుడే తట్టింది వారికి. ఏంచేయగలరు ఎవరు మాత్రం? రోటిలో తల దూర్చేశారు కద. ''సంజయ, ఏమని చెప్పుదు'' చందమయింది కార్యకర్తల అవస్థ. భాషవిషయంలో అళహసింగరిగారి పొజిషను ముందు కనుక్కుని వుంటే బాగుండును అని విచారించేరు కొంచెంసేపు.

దానయ్య మళ్లీ లేచి, తనభాషణలో ఆంగ్లపదాలు దొరలకుండా జాగ్రత్తపడుతూ, ఆ తరువాతివక్త చెట్టిగారని ముచ్చటగా మూడంటే మూడుమాటల్లో పరిచయం చేసి మాట దక్కించుకున్నాడు. ఆ క్షణంలో అతడి మనసు పొంగిపోయింది తాను ఆ నాటిసభలో వక్త కానందుకు.

చెట్టిగారు కూడా మాటలకి రవంత తడుముకుంటున్నట్టే కనిపించేరు. కానీ అంతలోనే తాను చర్చించవలసినవిషయం గుర్తొచ్చింది. "అసలు తెలుగు ఆంగ్లపదాలను అంకించుకుని హక్కభుక్తం చేసేసుకోడానికి ముక్యకారనం మన సాంకేతికపురోబివుర్ది. ఈనాటి సాంకేతికపదాలు మనతెలుగులో లేనందున మనం ఇంగ్లీషు వాడుతున్నాం. ఒకపేళ మనం తెలుగుపదాలు సమకూర్చుకున్నా అవి అంతర్జాతీయంగా ఎవరికీ అర్తం కావు కావున మనం ఇంగ్లీషుపదములే వాడవలె. ఉదార్నకి వర్డ్ రెండుపేల్ తీసుకోండి. బనాయించండి (సేవ్), మల్ల బనాయించండి (సేవ్ యాస్), అంటే తెలంగానాలో తెలస్తదేమో కానీ తెలుగుదేసంలోనే పేరే ప్రాంతాల గంద్రగోళంగ వుంటది గంద. అంచేత, వుప్పుడు మనం నన్నయ్య, తిక్కనలనాటి తెలుగుమాటలతో పబ్బం గడుపుకోలేం. భాష సజీవం. అంటే పెరుగుతా వుంటది అనే కద. అసలు ప్రపంచంలో ఏభాష మాత్తరం మార్పు లేకండ వుండిపోయింది గనక? ఛాసరునాటి ఇంగ్లీషు ఇప్పుడు లేదు అని మనందరికీ ఎరికే కద. అంతెందుకు, ఈనాటి ఇంగ్లీషులో మన తెలుగుమాటలు ఎన్ని చేరేయో చూడండి. బాడ్ కర్మ, కరీ, మసాలా, నిర్వానా ... అంటి మాటలెన్నో ఆంగ్లంలో మామూలయిపోయినాయి కద. మామూల్ కూడా ఇంగ్లీషుమాటే ..."

ఆయన వుపన్యాసం వింటుంటే, గౌరీపతికి దిగులు ముంచుకొచ్చింది. తనకి అర్థంకాలేదు కాబోలనుకుని భగవంతంపేపు చూశాడు. అతను వంచిన తలెత్తకుండా నోట్సు రాసేసుకుంటున్నాడు పొట్టిచేత్తో (షార్టుహేండు).

ఆతరువాత పంట్ మాటాడేరు. అతను పుట్టుకతోనే నాయకుడు. కండబలంతో పాటు లోకరీతి కూడా బుడిబుడి నడకలనాడే ఒంట పట్టించుకున్న ఘనుడు.

రెండోయేట తప్పటడుగులేస్తూ ఇల్లంతా తిరుగుతూంటే, పొరుగిళ్ల ఐదారేళ్ల పిల్లలు అతనివెంట నడుస్తుంటే చూసి తల్లిదండ్రులు మనవాడికి నాయకుడయే లక్షణాలున్నాయని కనిపెట్టేశారు. అయిదోతరగతి అయేసరికే ఇరుగుపొరుగు వారందరిచేతా హౌరా అనిపించుకున్న ప్రబుద్ధుడు. ఆనాటినుంచి ఈనాటివరకూ ఇతరులని తాను నడిపించడమే కానీ తాను మరొకరివెనక నడవలేదు.

అంచేత ఈ రోజు సభ అతనికి కాస్త ఇరకాటం అయిందనే చెప్పాలి. తనని మొదటి వక్తగా పెట్టనందుకు కొంత నొచ్చుకున్నాడు. తాను చెప్పదలుచుకున్న ఘనాపాఠీ పాయింట్లన్నీ ఈ వక్తలందరూ చెప్పేశారు. ఇప్పుడు తాను చెప్పగల కొత్త విషయాలు ఏమున్నాయి? సరే, చూద్దాం అనుకుని, తను కూడా తెలుగుభాష పుట్టుపూర్వోత్తరాలదగ్గరే మొదలెట్టి, మనభాష ఘనత ప్రస్తావించి, "పొగడరా నీతల్లిభూమి భారతిని" అని ఓ చరణం పాడి, తెలుగుభాషని పరిరక్షించుకోవలసిన ఆవశ్యకతనుగూర్చి ప్రసంగించి, "మనం ఇప్పుడొక విస్తృతమయిన ప్రణాళిక తయారు చేసుకోవాలి. ఆ ప్రణాళిక తయారీలో ప్రపంచీకరణం తప్పనిసరిగా దృష్టిలో పెట్టుకోవాలి," అని సభికులవేపు చూశారు.

సభికులు అలసి, సొలిసి, దివాలామొహాల్తో వుసూరుమంటూ చూస్తున్నారు. ఎవరిమొహంలోనూ ఉత్సాహం అన్నది మచ్చుకైనా కనిపించడంలేదు. లాభంలేదు. ఏదైనా పదునైన అస్త్రం ప్రయోగించాల్సిన సమయం ఆసన్నమయింది అనిపించింది వక్తకి. ఘనతకెక్కిన మహామహులందరూ తలపుకొచ్చేరు. తేటతెనుగున రాయమన్న రాయలవారినుండీ వ్యావహారికం ఉపయోగించమన్న రామ్మూర్తిగారివరకూ, ఆ తరవాత ఆధునిక కవిత్వానికి మార్గదర్శకుడు శ్రీశ్రీ ... అవునవును.. శ్రీశ్రీగారు రావిశాస్త్రిగారికి ఏమని శలవిచ్చేరూ? తెలుగులో బాగా రాయాలంటే ఇంగ్లీషు చదువుకోవాలి అని. శహభాష్, ... పంట్గారు ఓక్షణం ఆగి శ్రోతలని కలియజూసి, మళ్లీ పుంజుకున్నారు, "మన ప్రపంచీకరణకి అనుగుణంగా తెలుగుండాలి. తెలుగుని

ఇంగ్లీషుతో కమ్మింగిల్ చేసి, పాఠ్యపుస్తకాలు తయారు చేసుకోవాలి. మనం తెలుగు నేర్చుకోడానికిముందు ఇంగ్లీషుభాషని క్షుణ్ణంగా అభ్యసించాలి.''

ఈ చివరి వాక్యంతో అంతవరకూ దిక్కులు చూస్తున్న సభికులు, ముఖ్యంగా ఇంగ్లీషుమీడియం స్కూళ్లలో చదువుకున్న యువకులు ఉలిక్కిపడి, అప్రమత్తులయి, నిటారుగా కూర్చున్నారు, ఎవరో వెన్నుమీద ఛళ్లున చరిచినట్టు. ''వాట బ్రిలియంటయిడియా!'' అన్నారు ముక్తముఖాలతో.

పంటుగారికి కావలిసింది కూడా అదే. సభికులదృష్టిని ఆకట్టుకోడం. ఆ తరవాత వారికి అర్థమయేలా విడమరిచి వివరించడం. అదేకదా మంచి వక్తలక్షణం మరి. అంచేత ఇంగ్లీషుభాష అభ్యసించవలసిన ఆవశ్యకతగురించి ఇలా వివరించేరు, ''ఇందాకా చెట్టిగారు చెప్పినట్టు సాంకేతిక పదజాలంమీద అధికారం రావాలంటే మనకి ఇంగ్లీషు భాషాపరిజ్ఞానం అవసరం. అసలు మనదేశచరిత్ర చూడండి. ఇంగ్లీషువాడు మనమీద అధికారం ఎలా సాధించాడు? వాడికి ఇంగ్లీషు కరతలామలకం కనక. ఇప్పుడు మనం మళ్లీ ఇంగ్లీషువారిమీద ఆధిపత్యం ఎలా సాధించగలం? వాడిభాష నేర్చుకుని వాడిభాషలోనే వాడిని జయించడంద్వారా. వుమన్ అండ్ చిల్డ్రన్‌కి వాళ్లభాషలోనే బోధపరిచినట్టుగానే, ఇంగ్లీషువాణ్ణి ఇంగ్లీషులోనే జయించాలి. చెట్టిగారు చెప్పింది ఎంతయినా సబబుగా వుంది. ఇంగ్లీషు నేర్చుకుంటే మనకి వారి భావనాసరళి బోధపడుతుంది. ఇంగ్లీషువ్యాకరణం, పదవిన్యాణం, వాక్యనిర్మాణం, క్షుణ్ణంగా తెలుసుకుంటేనే ఎన్నో ఘనకార్యాలు సాధించగలం. అందుకు మనం విదేశాల్లో తెలుగుపిల్లలకి ఇంగ్లీషుస్కూళ్లు పెట్టాలి. ఆ స్కూళ్లలో పాఠాలు చెప్పడానికి తెలుగుదేశంలో ఇంగ్లీషుబడిలో తెలుగు నేర్చుకున్నవారిని పిలిపించాలి. అందుకు కావలసిన నిధులు ఏర్పాటు చేయడానికి రాష్ట్రప్రభుత్వం ఏర్పాటు చేయాలి ...'' అని ముగించేరు.

ఆ తరవాత, సభాపతి చేతనయినంత సంక్షిప్తంగా ఆనాటి వక్తల ఉపన్యాసాలు సమీక్షించి చేతులు దులుపుకున్నారు.

ఆరాత్రి ప్లినరీ సెషను. ఆ రెండురోజులూ సభల్లో జరిగిన చర్చలూ, వచ్చిన ప్రతిపాదనలూ సంగ్రహించి, రకరకాల ప్రతిపాదనలు చేసేరు. అళహసింగరిగారి ఉపన్యాసం విన్నతరవాత వారిందరికీ ఒక విషయం తేటతెల్లమయింది. ఆయనలాగా ఇంగ్లీషుపదాలు వాడకుండా తెలుగు మాటాడ్డం ఎరెవరికీ సాధ్యం కాదు. కాలేదు. పైగా, గట్టిగా ఆలోచిస్తే అవగతమయింది ఆయన కూడా వారానికి గంటన్నరసేపు మాత్రమే అలా మాటాడగలుగుతున్నారు. తదితర సమయాల్లో తప్పనిసరిగా ఇంగ్లీషు వాడుతూనే వున్నారు. అందుచేత బేషరతుగా తెలుగు నేర్చుకోడానికి ఇంగ్లీషు ముఖ్యం అని అందరూ అంగీకరించేశారు. సభ్యులు పంట్‌గారి ప్రతిపాదనలు ఏకగ్రీవంగా ఆమోదించారు.

అవిః

- పిల్లలకి తెలుగుకంటె ముందు ఇంగ్లీషు నేర్పాలి.
- అన్నిస్కూళ్లలోనూ దానికి తగ్గట్టు బోధనావిధానం మార్చమని ప్రభుత్వంవారికి వినతిపత్రం సమర్పించుకోవాలి.
- కోర్సులూ, టెక్స్టుబుక్కులూ తదనుగుణంగా తయారు చేయాలి.
- సినిమాల్లోనూ, పుస్తకాల్లోనూ, పత్రికలలోనూ కూడా కనీసం ఎనభై శాతం ఇంగ్లీషు వాడాలి.
- ఇళ్లలో తప్పనిసరిగా ఇంగ్లీషే మాటాడాలి.
- అమెరికాకి వచ్చే, ఇంగ్లీషురాని అమ్మమ్మలూ, నాన్నమ్మలనించీ పిల్లలు తెలుగు నేర్చుకుంటారు కనక వాళ్లకి ప్రయాణానికిముందు విధిగా ఇంగ్లీషుభాష నేర్పే ఏర్పాటు చేయాలి. లేకపోతే వీసాలు ఇవ్వరాదు.
- విదేశాల్లో తెలుగుపిల్లలకోసం ఇంగ్లీషుపాఠశాలలు పెట్టాలి. అందుకు నిధులు సేకరించాలి.

• విదేశాల్లో తెలుగువారికోసం పెట్టిన ఇంగ్లీషుపాఠశాలలో పాఠాలు నేర్పడానికి తెలుగుదేశంనించి పంతుళ్లని పిలిపించాలి. వారికి మాత్రమే మన సంస్కృతి, మన భాష, మన ఇంగ్లీషు తెలియును కనక.

• బ్రౌణ్యనిఘంటువు - బాతు, ఫుడ్డూ, హాండూ- వంటి పదాలు అచ్చతెలుగు పదాలుగా గుర్తించి, నిఘంటువులో చేర్చి తిరగరాయాలి.

• కృష్ణమూర్తిగారు తెలుగువ్యాకరణం తిరగరాయాలి, వాడుకలో వున్న ఇంగ్లీషుపదాలకి తగినట్టు విభక్తిప్రత్యయాలు (చాట్లో, కూల్గా, వెట్యందు), సర్వనామాలకి తగిన క్రియావాచకాలు (బాత్ చేయు), (మెసేజెట్టు), ఆంగ్రీ అవు, కాల్చేయు, సిక్కవు వంటివాటిని సోదోహరణంగా నిరూపిస్తూ.

భగవంతం జాగ్రత్తగా ప్రతిపాదనలన్నీ రాసుకున్నాడు తు, చ. తప్పకుండా.

ఆ రాత్రి భగవంతం గౌరీపతిని అడిగాడు సభలమీద నీఅభిప్రాయం ఏమిటని.

గౌరీపతికి చాలా అసంతృప్తిగా వుంది కానీ ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలీలేదు.

ముప్పైఅయిదేళ్లక్రితం తాతగారు అన్నమాట జ్ఞాపకం వచ్చింది.

ఆ రోజుల్లో నాన్నగారు తనని సెయింటాంథోనీ స్కూల్లో వేయడం తాతగారికి నచ్చలేదు.

"ఈ రోజుల్లో ఇంగ్లీషుభాషకున్న గౌరవం తెలుక్కి లేదు. ఇంగ్లీషు రాకపోతే ఉద్యోగాలు రావు. అడుక్కుతినాలి" అన్నది నాన్నగారి వాదన.

"సరే, బతుకుతెరువుకోసం ఇంగ్లీషు చదువు. జాతిపరువు నిలబెట్టడానికి తెలుగు నేర్చుకో," అంటారు తాతగారు. ఆ తరవాత, పెద్దబాలశిక్ష

గౌరీపతిముందు పడేసి, "మొదలెట్టు. తల్లీ నిన్నుఁ దలంచి ..." అన్నారాయన హుంకరించినంతపని చేస్తూ.

ఆనాటి ఆదృశ్యం అతనిమనసులో చెరగనిముద్ర వేసింది. భగవంతంవేపు తిరిగి, "నీకు జ్ఞాపకం వుందా ఆ పద్యం? తల్లీ, నిన్ను దలంచి పుస్తకమున్ చేతన్ బూనితి .. ఎంత కొట్టుకున్నా ఆ తరవాతిపాదాలు గుర్తు రావడంలేదు," అన్నాడు, మనసు విలవిల్లాడుతుంటే.

"నాకూ జ్ఞాపకం రావడంలేదు," అన్నాడు భగవంతం విచారంగా మొహం పెట్టి.

(30 జూన్ 2009.)